# అనాథబాలుడు

[THE MISERABLE]

అనువాదం :

శ్రీనివాసచక్రవర్తి



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ

# అనాథబాలుడు

మన కథానాయకుని తలిదండ్రులు బహుసౌమ్యులు. తమపేరు బయటికి పొక్కకుండా గుట్టుగాపాడుకోవాలనే ఉద్దేశంతో ఒకనాటి చీకటిరాత్రి పసిపిల్లవాడిని వీధిలో కోరడి పక్కగా వదలిపెట్టి చీకటిలో మాయమైపోయారు. ఒకప్రాణి ఆవిర్భవించడానికి కారణభూతులమయ్యామనేగర్వం వారికి ఏకోశానా ఉన్నట్లు కనిపించదు. కొడుకులో తమపోలిక కాన రాకుండాచేయగలిగిన నైతికబలంకూడా వారికి లేదు.

ఈ చివరివిషయాన్నే గనక వారు దృష్టిలోఉంచుకున్నట్లయితే, పిల్లవాడిని సంఘపరంచేయాలని నిశ్చయించుకున్న ఆ రాత్రి పసికందుకు చుట్టిన చిరుగుపాత్తిళ్ళకు "పాల్" అని వ్రాసిన కాగితంముక్క గుచ్చేవారుకాదు. అయితే వారు బొత్తిగా తెలివితక్కువమొద్దులనుకోవడానికీ వీలులేదు. సాధారణంగా సంతానవంతులలో అధికసంఖ్యాకులు కొన్నికొన్ని అలవాట్లకు, దురభిమానాలకు, భావాలకు, అభిప్రాయాలకు తమజీవితాలను అంకితంచేసి, వృధాచేసుకుంటారు. అవే తమ సంతానానికీ అలవడాలని కాంక్షిస్తూంటారు.

కోరడిపక్కన తలిదండ్రులు వదలిపెట్టి వెళ్ళిపోయిన కొంతసేపటికి నిజమైన కర్మవాదిలాగా నా ఖర్మ యింతేనని పాల్ మనసుసరిపెట్టుకునిఉంటాడు. తలిదండ్రులు రొట్టెముక్క

గుడ్డనుకట్టి నోటిలో పెట్టి వెళ్ళారు. అది చప్పరిస్తూ కిక్కురుమన కుండా పడుకున్నాడు. కాసేపటికి విసుగెత్తింది. రొట్టెముక్క కట్టినగుడ్డ నోటిలోనుంచి తీసివేసుకుని, నోటితో కొద్దిగా చప్పుడుచేశాడు. కాని, ఆ నిశాప్రశాంతతమాత్రం భగ్నం కాలేదు.

అది ఆగస్టునెల. చీకటిగా చల్లగా ఉంది. శరత్కాల సూచనలు అప్పుడప్పుడే పొడగట్టసాగాయి. కొండరావిచెట్ల ఆకులు పండి రాలిపోతున్నాయి. కొమ్మలు చిన్నారిపాల్ మీదకు వచ్చి వంగాయి. మధ్యమధ్య కొమ్మలనుంచి ఆకులు విడివడి, చెమ్మగాలిలో సుళ్ళుతిరిగి నేలమీద రాలుతున్నాయి. పగలు వర్షం కురిసింది. సాయంకాలం సూర్యాస్తమయసమయానికి భూమి బాగా వేడెక్కిపోయింది.

పాపం! పాల్‌తల్లి ఎంతో శ్రద్ధతో చింకిరిగుడ్డలు వంటి చుట్టూ గట్టిగా చుట్టింది. ఆ చింకిరిగుడ్డలమధ్య పాల్ మొహం ఎర్రగా, కనిపించీకనిపించకుండా ఉంది. అప్పుడప్పుడు ఆకులువచ్చి పాల్ మొహంమీద పడేవి. అలా పడినప్పుడల్లా మొహం ముడుచుకుని, కళ్లు చికిలించేవాడు. ఈ బాధ ఎలానో కొంతసేపు భరించి, ఇక భరించలేక చివరికి గుడ్డపేలికలు ఊడతీసివేసుకున్నాడు. తడిగాలి వచ్చి శరీరానికి తగిలింది. గుడ్డలు వదిలిపోవడంతో స్వేచ్ఛ లభించింది. పాదం నోటిదగ్గర పెట్టుకుని చప్పుడుకాకుండా కులాసాగా బొటనవేలు చప్పరించసాగాడు.

కాని క్షమించాలి. 'కోరడివక్కన మకాంపెట్టిన పసిపిల్ల వాడి ప్రవర్తనను విమర్శించడం మొదలుపెట్టాను. అయితే ఇదంతా నేను కళ్లారా చూడలేదు. రమణీయమైన ఆకాశం,

ధగధగా మెరిసే నక్షత్రాలు పొదిగిన నీలి ఆకాశం ఒక్కటే సాక్షి. కనుపెదవులమీద, ఆ సిక్కుల ప్రార్థనలలో ఆ పాటే స్వర్గలోకం, ఈ ప్రాపంచిక విషయాలన్నిటిపట్ల ముఖ్యాన్ని వహించినట్టి పోల్ విషయంలో కూడా ముఖ్యానుభవించింది.

ఆ కోరశివక్కన పడిఉండగా ఆ పసికందును నేనేగనక స్వయంగా చూసిఉంటే, అతనితలిదండ్రులమీద నాకు పట్టరాని కోపంవచ్చేది. పిల్లవాడిమీద చెప్పలేనంత జాలికలిగేది. వెంటనే పోలీసులకు కేక వేసేవాడిని. ఇంకేం! మహా ఘన కార్యం చేశానని సగర్వంతో ఇంటిమొహంపట్టేవాడిని. నేను కాకపోతే ఇంకెవరైనా ఆ స్థితిలో అలానే చేసేవారని నాకు గట్టి నమ్మకం. కాని, అక్కడ ఎవరూ లేరు. ఈవిధంగా ఆ పట్టణ వాసులకు దయాంతఃకరణలను ప్రకటించేఅవకాశం జారిపోయింది. ఇలా దయాంతఃకరణలను ప్రకటించడం, ఆత్మక్షేమానికి భంగంకాకపోతే పొద్దుపోయేవిషయంగా పెక్కుమంది భావిస్తారు.

కాని, అక్కడ ఒక్కడూ లేడు. పాపాయి చలి వణు కెత్తింది. నోట్లోనుంచి బొటన వేలు జారిపోయింది. మెలమెల్లగా మూలుగు, ఆతర్వాత ఏడుపూ మొదలుపెట్టాడు. ఆ నిశా ప్రశాంతత భగ్నమైంది.

ఇలా అరగంట గడిచింది. ఎవరోవచ్చి అతనిమీదకు వంగాడు. ఆవ్యక్తి శరీరానికి ఏమిచుట్టుకున్నాడోగాని, కొట్టు బోదె నడిచివచ్చినట్టుంది. 'లంజాకొడుకులు!' అని గట్టిగా తిట్టుతూ ఒకవేపుకు కాండ్రించి ఉమ్మివేశాడు. పిల్లవాడిని పైకెత్తి అతిజాగ్రత్తగా ఆ చింకిగుడ్డలు చుట్టబెట్టాడు. కోటు

లోపల పిల్లవాడిని దాచాడు. ఇంకేం, చలిగాలితగలకపోస్తే సరికి పాల్ ఏడుపుమానాడు.

"ఆరిభగవంతుడా! యింకొకడిని పారేసిపోయారు! లంజాకొడుకులు! పీడితో యీ వేసంగిలో ముగ్గురు! ఛీ! పాపాలుచేయడం...యింకా పాపాలుచేయడం! వాళ్ళమొహం మీాద వుమ్మేయ!"

ఆ వ్యక్తిపేరు క్లిమ్ విస్లోవ్. కాపలామనిషి. నీతినియమాలు నిక్కచ్చిగా పాటించేరకం. కాని ఆ నీతినియమాలు తప్పతాగడంవిషయంలోమాత్రం అడ్డువచ్చేవికావు. పైగా అతనికి వాక్యత్రయం– మాత, పిత, ఆత్మ– అంటే పరమభక్తి.

"ఠాణాకు తీసుకుపదండి!"

ఇలా ఆజ్ఞాపించినవ్యక్తి కాల్సెంకో అనే పోలీసు బంట్రోతు. రంగేళీపురుషుడు. ఎర్రగా కొనతేలినమీాసం, సాహసపుకళ్ళు, ఏ యువతిహృదయంలోనైనా ఇట్టే ప్రేమాగ్ని రగిలించగలడు. ఇలా ఆజ్ఞాపించబడినవ్యక్తిపేరు అరెఫీ గిబ్లీ. అతనూపోలీసే. ఎప్పుడూ ఏదో విచారంగాఉంటాడు. గుండ్రని భుజాలు. అతనికి ఏకాంతం, పుస్తకాలు, పిట్టలు అంటే మహా ఇష్టం. బాతాఖానీ అన్నా, బళ్ళుతోలేవాళ్ళన్నా, ఆడవాళ్ళన్నా చెడ్డ అసహ్యం.

అరెఫీ గిబ్లీ పాల్ని ఎత్తుకుని, తీసుకువెళ్ళబోతూ హఠాత్తుగా ఆగి, మొగంమీాదిపీలికలు పక్కకుతీసి చూశాడు. అలా కొద్దినిమిషాలసేపు చూసి, బుగ్గతాకి, మీాదకువంగి, నోరు బిగించుకుని నాలుకఆడించాడు.

పాల్మాత్రం రొట్టెముక్క చప్పరిస్తూ మెదలలేదు.

విచిత్రమైనచేష్టలద్వారా అరెఫీ గిబ్లీ ఏమి ప్రకటించదలచాడో సరిగా తెలుసుకోవాలనేఆసక్తి ఆతనికి కలగలేదు. కనుబొమలు పైకెత్తి చూశాడు. కాని భావం విస్పష్టంగా అర్థంకాలేదు.

ఇంతలో అరెఫీ గిబ్లీ ఫక్కున నవ్వాడు. ఫక్కున నవ్వేసరికి మీసాలు పైకెగిరి, ముక్కుకుతాకాయి. నల్లటి పెద్ద గడ్డం చెవులవేపుకు ఊగిసలాడింది. వీధివెంట నడుస్తూ, చిన్నారి పాల్ ని ప్రశ్నించాడు: "భావిపౌరుడివిగదూ? హెహెహే!" ఈ ప్రశ్నకు జవాబుగా పిల్లవాడు అవునన్నట్టు తలూపి కిలకిలనవ్వాడు.

"చాచా! ఓఫీ! కుర్ కుర్ కుర్! గర్ గర్ గర్!" అంటూ అరెఫీ గిబ్లీ ఏనుగులాగా ఘీంకరించాడు. ఒక దీపస్తంభంపక్కన బండమీద కూర్చుని, పిల్లవాడిమొహంకేసి ఆపేక్షగా చూస్తూ ఏంచేస్తాడో చూదామని నిరీక్షించసాగాడు.

అరెఫీ మాట్లాడే అలగాభాష అర్థంకాక పసిపిల్లవాడు కొట్టుమిట్టాడాడు. చాలాసార్లు తలఆడించాడు. ముభావంగా కనుబొమలు పైకిఎగరవేశాడు. కాని రొట్టెముక్క నోట్లోనుంచి జారిపోకుండామాత్రం జాగ్రతపడ్డాడు.

ఇక అరెఫీ కడుపుచెక్కలయేటట్టు నవ్వసాగాడు.

"యిష్టంలేదు, వోరి వెధవ!"

దానిమీద "వెధవకి" నోరుతియ్యబడదనే అపనమ్మకం దృఢమై నోరు, కళ్ళు బాగా విప్పిచూశాడు. ఏదో కలవర పడుతున్నట్టు కనిపించాడు. కాని నిజానికి రొట్టెముక్క గొంతుకు అడ్డి, ఉక్కిరిబిక్కిరిఅవుతున్నాడు.

అరెక్షీ తొందరగా రొట్టెముక్క నోటిలోనుంచి లాగి వేసి, ఆతొందరలో నోరుసూటా పీకికోయబోదని కృతజ్ఞతా సనేంచుకొంటున్నట్లు ఆదుర్దాగా పిల్లవాడి మొహంలో మొహం పెట్టి పరిశీలనదృష్టితో చూశాడు.

పాల్ దగ్గాడు.

"హూష్హూ!" అని అరెక్షీ గిబ్లీ పొగబడిలేటపుడు రైలు ఇంజను కూసినట్లు కూశాడు. దగ్గు తగ్గించుకని పిల్లవాడిని గాలిలో అటూఇటూ ఊపాడు. కాని పిల్లవాడుమాత్రం ఇంకా బిగ్గరగా ఖంగుమని దగ్గసాగాడు.

"ఓరీ...!" అని అరెక్షీ నిట్టూర్చాడు ఆశ్చర్యంతో నిరాశతో చుట్టూచూస్తూ.

వీధివీధంతా నిద్రపోతున్నట్లుంది. ఇరువైపులా దీపాలు అక్కడక్కడా మినుకుమినుకుమంటున్నాయి. దూరానమాత్రం దీపాలు ఒకదానిమీదఒకటి పడిపోతున్నట్టు కనిపిస్తున్నాయి. కాని వీధివీధంతా మసకమసకలాడుతోంది. ఆకాశంఎత్తు నల్లటి గోడకు ఆనుకునిఉన్నట్లు అనిపిస్తోంది. మహాచురుకుగా భగభగా మెరిసిపోయే నక్షత్రాలకాంతులు మందహాసం చేస్తున్నట్లున్నాయి.

అరెక్షీ ఆ నల్లగోడవేపుకు కాకుండా దిగువకు తేరిపార జూశాడు. ఒకదానినొకటి ఒరుసుకుంటున్నట్లున్న చీకటిభవనాల ముద్దగా పట్టణం గోచరించింది. మధ్యమధ్య వినిపించీవినిపించని ధ్వనులు పుట్టి, ముభావంగా మందంగా అణగారిపోతున్నాయి.

ఆ దృశ్యం అరెక్షీకి అసహ్యంగొలిపింది. ముతకచొక్కా మీదకు పాల్ని గట్టిగా హత్తుకున్నాడు. వణుకునికి అదుముకుని

దూరాకాశంకేసి చూస్తూ బిట్టుగా నిట్టూర్పు విడిచి పాల్ దగ్గి దగ్గి ఏడవడానికి సిద్ధమయాడు.

"ఛీ! పాడు."

ఆ పట్టణాన్ని గురించి ఈవిధంగా తన అసహ్యభావం వెల్లడించి అరెఫీ బండమీదనుంచి లేచి, వీధివెంట నడవ సాగాడు. పిల్లవాడిని అతిజాగ్రతగా అతినెమ్మదిగా చేతులతో ఎగరవేశాడు. కొంతసేపు వీధివీధీ తిరిగాడు. ఏదో అపూర్వమైన ఆలోచనతో మనసునిండిపోయిందేమో వీధి ఎక్కడ ఇరుకుగా ఉన్నదీ, ఎక్కడ వెడల్పుగా ఉన్నదీ, ఎన్ని వంకరలు తిరిగిందీ, ఏవీధివచ్చి ఎక్కడ ఏవీధిలో కలిసిందీ గమనించనే లేదు. హఠాత్తుగా పరకాయించిచూసేసరికి చౌకు కనిపించింది. చౌకునడిమధ్యన, రెండు వేపులా రెండు దీపస్తంభాలు ఉన్నవి. జలయంత్రం ఎదురుగా కంటబడేసరికి 'ఓహో, చౌకులోకి వచ్చాంగదా' అనుకున్నాడు. అరెఫీ పోలీసుఠాణా దాటి వచ్చేశాడు.

తిట్టుకుంటూ వెనుకకు తిరిగాడు. అరెఫీభుజాలమీదుగా వెలుతురు పాల్ చిన్నారిమొహంమీద పడింది.

"నిద్రా?" అని అరెఫీ మెల్లగా గొణిగాడు పిల్లవాడిమీదనుంచి దృష్టి మళ్ళించకుండా. గొంతులో గుసగుసమని చికాకుపెట్టింది. ఈబాధ వదిలించుకోవాలని ముక్కుచీదాడు. పుట్టీపుట్టగానే జీవితంలోవచ్చిపడే ఒడుదుడుకులు పిల్లలు గ్రహించకపోవడం మంచిదని అతనికితోచింది. నిజానికి అలా గ్రహించేటంటే అతనిచేతులలో నిద్రించే ఆ భావిపౌరుడు అలా గాఢనిద్రపోయేవాడేకాదు. కడుపుకొట్టుకొట్టు ఏడ్చేవాడు.

అరెఫీ గిబ్లీ పోలీసుబంట్రోతు. నడివయసు. అందుచేత అతనికి జీవితమంటేఏమిటో బాగా తెలుసు. గొంతుచించుకుని అయినా తననుగుర్తించేటట్లు చేసుకోలేనివాడిని పోలీసు బంట్రోతుకూడా లక్ష్యపెట్టడు. ఇతరులదృష్టిని ఆకర్షించలేని వాడు నాశనమైపోతాడు. మనిషి ఒంటరిగా అట్టేకాలం బతక లేడు. ఆలోచనాపాలోచనా లేకుండా ఈ చంటిపిల్లవాడు క్లిష్టసమయంలో నిద్రపోతున్నాడు. తప్పకుండా నాశనమై పోతాడు. ఇవీ గిబ్లీమనసులోని ఆలోచనలు!

"హల్లో! యెవ రక్కడ?" అని నిండాగర్భంగా కేక పెడుతూ అరెఫీ కమానుగుండా ఠాణాలోపలికి వెళ్లాడు.

"యెక్కడనించి వస్తున్నా?" అని అతనితోపాటు పని చేసే ఇంకోవ్యక్తి అడిగాడు.

"యిప్పుడు వంతు నాదిగాదు"

ఆ రెండోవ్యక్తి బద్ధకంతో ఆవులించి, పాల్ బుగ్గమీద వేలితో పొడిచాడు.

"యేమిటిది!"

"యిష్, వూరుకో దద్దమ్మా, వూరుకో! పసిపిల్లాడు!"

"ఆరినీదుంపతెగ! యేమిటీపిచ్చివాగుడు!"

"డ్యూటీలో యెవరున్నారు?"

"గొగొలోవ్"

"నిద్రపోతున్నాడా?"

"ఆఁ– వళ్ళుతెలీకుండా నిద్రపోతున్నాడు."

"మేర్యా యేంజేస్తోంది?"

"అదీ నిద్రపోతోంది; యెందుకు నిద్రపోగూడదేం?"

"అవునవును. నిజం..." అంటూ అరెఫీ గిబ్లీ దీర్ఘాలు తీశాడు. ఏదో ఆలోచనలోపడి కదలలేదు.

"కాస్సేపటికి నా డ్యూటీకూడా అయిపోతుంది. నేనూ హాయిగా నిద్రపోతాను!" అంటూ ఆ రెండోవ్యక్తి బయలు దేరబోయాడు.

"ఒక్కనిమిషం ఆగు మైఖేల్!" అంటూ అరెఫీ అతని చొక్కాచేయి పట్టుకుని, గుంజి రహస్యంగా అడిగాడు— "యిప్పుడు మేర్యాతో మాటాడితే? యేమంటావ్?"

"యిక వీడొకడు తక్కువయినాడు!" అంటూ మైఖేల్ వ్యంగ్యంగా నవ్వాడు. ప్రశాంతంగా నిద్రపోతున్న పాల్ మొగం తేరిపారజూస్తూ "భాయీ! దానిపిల్లలతోనే అది సతమతమవు తోంది!"

"ఒక్కరాత్రికేగా; మరేం పరవాలేదు" అన్నాడు అరెఫీ అతనిని ఒప్పించగలననే ధీమాతో.

"నా దేంపోయింది. నీకూ తెలుసుగా దానిసంగతి! నన్నూ యింట్లోనుంచి తగిలేస్తుంది!...సరే యిలా యివ్వు చూదాం."

అరెఫీ అతిజాగ్రతగా చిన్నారిపాల్‌ను మైఖేల్ చేతులలో పెట్టాడు. వారివెనకగా నడవవెంబడే బూటనవేళ్ళమీద నడుస్తూ స్నేహితుని బుజాలమీదుగా నిద్రపోతున్న పసిపిల్ల వాడిమొహంకేసి ఆపేక్షగా చూడసాగాడు. నడవలోనికి రాతి నేలమీద మైఖేల్ భారీబూట్లు టకటకమంటూంటే అరెఫీ ఊపిరిబిగబట్టి మరీ నడిచాడు. ఇద్దరూ తలుపుదగ్గరకు చేరు కున్నారు.

"నే నిక్కడే వుంటా" అన్నాడు అరెఫీ మెల్లగా. మైఖేల్ తలుపు తెరచుకుని లోపలకు వెళ్ళాడు.

అరెఫీ కదలకుండా నిలబడ్డాడు. ఆందోళనతో కుంగి పోయాడు. ఏమీతోచక కోటుచేతికవ్వుదారం ఊడబెరికాడు. గడ్డం గబగబా సవరించుకున్నాడు. గోడనుంచి సున్నపుబెత్తను పెరికాడు. కాని ఇన్నిపనులుచేసినా, మనసు కుదుటపడలేదు.

తలుపు వెనకనుంచి నోరు మెదపకుండా పోట్లాడుకుంటున్న ధ్వనులు వినవచ్చాయి.

"నా అసతెట్టి, సరే అని, పిల్లవాడిని తీసుకుంది" అన్నాడు మైఖేల్ తలుపు తెరచుకుని బయటికి వస్తూ. నున్నగా క్షురంచేసుకున్న మొహంలో సంతోషం, విజయగర్వం తాండవిస్తున్నాయి.

"సరే మంచిది" అని భారంతగ్గినట్టు అరెఫీ నిట్టూర్చాడు. ఇద్దరూ బయటికి బయలుదేరారు.

"శెలవు, భాయీ! పనిలోకి వెళతాను"

"సరే, వెళ్ళు" అని మైఖేల్ ముభావంగా జవాబిచ్చి, ఒక మూలకు వెళ్ళి, పక్క అమర్చుకోవడానికి ఇంత ఎండుగడ్డి తీశాడు.

అరెఫీ మెట్లుదిగనారంభించాడు. మూడో మెట్టుమీద కాలు మోపేసరికి ఎందుకనో పాదాలు మెట్టుకు అంటుకుని పోయినట్టు అనిపించింది. కొన్నినిమిషాలపాటు కాలుకదపకుండా నిలబడ్డాడు. వసారాలో దీపం మినుకుమినుకుమంటోంది. వారి యిద్దరిమధ్యా ఈ క్రింది సంభాషణ జరిగింది.

"మైక్!"

"ఏమిటి ?"

"రేపు పిల్లవాడిని తిరిగి యిచ్చేస్తావుగదూ ?"

"ఆс-పిల్లవాడినా ! తప్పకుండా యిచ్చేస్తాను."

"అనాథశరణాలయానికా ?"

"ఊహూс-పిచ్చిపుల్లాయ్ ! కమ్మరికి !"

ఎవరూ మరి మాటాడలేదు.

మైఖేల్ ఎండుగడ్డి మూాల పరిచాడు. బూట్లు నేలమీద తారాడాయి. అరెఫీ పట్టణంకేసి చూశాడు. అంతా నిద్రపో తున్నారు. చీకటికి ఇళ్ళన్నీ ఒకేఒక బూడిదరంగుముద్దగా గోచరించాయి. నల్లటివీధిదారులు లోతైనబీటలుగా తోచాయి. పట్టణంచివర ఎడమచేతివేపున అనాథశరణాలయం. పెద్ద రాజ భవనంలా మహాభయంకరంగా ఉంది. తెల్లటిగోడలు, కిటికీలు పెద్దపెద్దవి, కాని పూలు లేవు, తెరలు లేవు......

"అక్కడికిపంపితే యిక బతకడమంటూ వుండదు" అని గొణుక్కున్నాడు అరెఫీ.

"పసిపిల్లాడు ! యెంతో అదృష్టజాతకుడయితేతప్ప యెవడూ బతకడు. తెలిసిందేగా, అక్కడి శుభ్రత, క్రమ పద్ధతి..."

మైఖేల్ కి నిద్రముంచుకొచ్చింది. గురక మొదలుపెట్టాడు. ఆ శుభ్రత, క్రమపద్ధతుల దుష్ఫలితాలమీద అభిప్రాయం నొక్కిచెప్పడానికిగాని, వివరించడానికిగాని అవకాశం లేకపో యింది.

అరెఫీ కొద్దిసేపు నిలబడి గస్తీతిరగడానికి వెళ్లిపోయాడు.

తెల్లవారవస్తోంది. చల్లగాలి వీచింది. పొలాలమధ్యన ఉన్న అతనిగుడిసె పూర్వంకన్న ఇపుడు పట్టణానికి ఎక్కువ దూరంగా ఉన్నట్లు అనిపించింది. ఇదివరలో అతనికి ఈవిష యమై ప్రత్యేకంగా ఆలోచనలు రాలేదు. కాని, ఇవాళ వచ్చాయి. వెళ్ళి గుమ్మంముందు బల్లమీద కూర్చున్నాడు. ఆరెఫీవిగ్రహం బూడిదరంగు. వ్రడుం వంగిపోయింది. రూపం చీకటిలోకలిసిపోయినట్లు గోచరించింది.

మెల్లగా లోతుగా ఆలోచించాడు. ఆలోచన ఒకేఒక ప్రశ్నగా పరివర్తనచెందడానికి చాలాసేపుపట్టింది. బిడ్డలను సాకలేనివాళ్ళకి కనేహక్కు ఉందా?

బాగా ఆలోచించి ఆలోచించి చివరకు "ఊహూం, లేదు!" అనే నిర్ణయానికి వచ్చాడు. మనసు స్థిమితపడింది. గాఢంగా నిట్టూర్చి బెదిరిస్తున్నట్లు గాలిలో పిడికిలిఆడిస్తూ, "వెధవలంజాకొడుకులు!" అని గొణిగాడు.

సూర్యోదయమైంది. తొలికిరణాలు గుడిసెకిటికీలమీద పడి, అద్దాలకు నిప్పువసుపురంగును ప్రసాదించాయి. భగవం తుడు సృష్టించిన భూమండలాన్ని అవలోకించడానికి నేలమీద నుంచి లేచిన రాక్షసకాయంతాలూకు పెద్దపెద్దకళ్ళలాగా ఉన్నాయి ఆ కిటికీలు. గుడిసెపైకప్పుమీద కదలాడేపొదలు ఆ రాక్షసిజుట్టుముడిలాగా ఉన్నాయి. తలుపుబీటలు సంతో షంతో మందహాసంచేస్తున్న అతని నుదుటిముడతలులాగా ఉన్నాయి.

# 2

ఆ మర్నాడు అరెఫీ మేర్యా ఇంటికి వెళ్ళి కూర్చు న్నాడు. ఆమె మాసిపోయినదుస్తులు ధరించివుంది. జుబ్బా పైకివిగించికట్టి, చేతులు పైకిమడిచింది. ఆమె ప్రతికదలికా కలహానికి కాలుదువ్వుతున్నట్లుంది.

అరెఫీ గిబ్లి ఆమెతో ఎంతో మాట్లాడాలనుకున్నాడు. కాని అతనికి ఎక్కువగా మాట్లాడే అలవాటు లేదేమో, బిడియపడసాగాడు. పైగా మేర్యా కదలికలలోని ఆత్మవిశ్వాసం, ప్రశాంతం, శక్తి అతనిని మరింత కుంగదీసాయి. అరెఫీ స్త్రీద్వేషి. ఈ విషయం అతను దాచుకోనుకూడాలేదు. నేలమీద ఖాండ్రించి ఉమ్మివేస్తూ మేర్యా మొగంకేసి చురచురా చూడడంలోనే ఈవిషయం వ్యక్తమవుతుంది.

పేముకుర్చీలు ఆసరాగా వేసిన పడకబల్ల మీద చింపిరి గుడ్డలదొంతులలో పాల్ కసరత్తు—చేతులతో పాదంపట్టుకుని దానిని నోట్లోపెట్టుకునేయత్నం—చేయడంలో నిమగ్నుడై ఉన్నాడు. కాని ఎర్రటిబండపాదం చెప్పినట్లు వినడంలేదు. చిన్నారి పాల్‌కి అసంతృప్తి కలుగలేదు. ఆమోదసూచకంగా ఏవేవో ధ్వనులుచేయసాగాడు.

"సరే, నా స్తికపుచచ్చినాడా! యిక వీణ్ణేంజేయదలిచావ్?" అని నిలదీసి అడిగింది మేర్యా అరెఫీకి ఎదురుగా కూర్చుని మొహంతుడుచుకుంటూ, "నేను సాకలేను. ఉహుం— సాకలేను. ఆ ముసిలి కిటయేవ్‌కి అప్పగించు. నెలకు రెండు రూబుళ్ళు యిస్తే సాకుతుంది. పిల్లాడికి నెలదాటింది. మంచి

ఆరోగ్యంగానే వున్నాడు. అల్లరికం కాదు. తిప్పలుపెట్టడు. దానికి అప్పగించు".

"సరిగా చూడక పూడ్చిచంపితే?"

"పూడ్చిచంపుతుందీ! యెందుకు చంపుతుందీ?"అంటూ మేర్యా గోజిల్లసాగింది.

"యెందుకా? ఆడదిగదూ, సరే, సరే..."

"నోట్లోనించి మాట పెగిలిచావదేం? నేను తీసికెళ్ళి అప్పగించివస్తా. అంతే. ఆమెకి వీడు డబ్బయిఒకటోకొడుకు అయివూరుకుంటాడు. హాహాహా...ఊఁ-పూడ్చిచంపుతుందేం? చంటిబిడ్డల్ని సాకగలిగేదెవరు? నీబోటిదెయ్యాలా? స్త్రీ! స్త్రీ అంటే ఆదిశక్తి! నీలాంటిదెయ్యాల్ని యెవరు సాకుతారు? కమ్మరికొలిమిలో వేసి నిప్పుల్లో సాగకొట్టరా? అసలు యీ విషయంమీద మాటాడడానికి నీకేం హక్కువుంది?"

"అలా కరవవస్తావేం?" అన్నాడు అరెఫీ అసలు విషయానికి సంభాషణ మళ్ళించాలని యత్నిస్తూ. మేర్యా అతని మీద అదోరకమైనదృష్టి నిగిడ్చింది. ఆ దృష్టినుంచి తప్పించుకోవాలని యత్నిస్తూ అన్నాడు: "నాభావం అది కాదు. నేను అనుకుంటున్నాను..."

"ఇక చాలు నోర్మూయ్! నిన్ను సంతోషపెట్టడానికని నా పద్ధతులేమీ మార్చుకోను...తెలిసిందా? యెవరితో మాటాడుతున్నావో యెరుగున్నావా? యెంత ముఖ్యమైన మనిషి! నా భాష నువ్వు పొడుచుకుచచ్చేటంతయిదిగా వుందా? యింకోవిధంగా నీతో నేను మాటాడగలననుకున్నావా? నీలాంటివాడ్ని గంటలకుగంటలు చితకతన్నుతూండాల్సిందే!"

"సరే సరే. తిన్నగా మాటలురానీ!"

చీటికీమాటికీ కయ్యానికికాలుదువ్వే ఈ స్త్రీని నోటికి వచ్చినట్లు తిట్టాలనుకున్నాడు అరెఫీ. ఈ ఉద్దేశం అణచివేసుకోవాలని ఎంతో యత్నించాడు. కాని సాధ్యంకాలేదు. ఒళ్ళు ఇంకా మండింది.

"ఊం—యేంచెయ్యమంటావో చెప్పు, వెళతాను. ఇక నీ నోటిధాటికి తట్టుకోలేను!"

"అబ్బో! యెంత సుకుమారం! తెలివితక్కువ దద్దమ్మా!"

ఈ మాటలతో మర్యాదమూకుడు తగ్గింది. నిఘంటువులోనితిట్లు ఆఖరయాయి. ఆమె ఒక్కనిమిషమంతకూడా ఊరికే కూర్చోలేదేమో, గదిలో హడావిడిగా తిరుగుతూ ఒకేసమయంలో అనేకపనులు చూసుకోసాగింది. ఒకవేపున వంటపని, ఒకవేపున కుట్టుపని; ఒకనిమిషం ఒకపిల్లవాడికి పాలుపట్టడం, తర్వాత ఇంకొకడికి; స్టవ్ మీద కొందరిని, స్టవ్ వెనక కొందరినీ తెరవెనక కొందరినీ పడుకోబెట్టడం, వాళ్ళనుకేక వేయడం, ఆమూలకి ఈమూలకి తిరిగి, గొంతుచినిగేటట్లు ఏడ్చే పిల్లలను సముదాయించడం—ఇన్నిపనులూ ఒక్కతే ఒకేసమయంలో చూసుకుంది. చివరికి వచ్చి అరెఫీకి ఎదురుగా నిలబడి, నడుం మీద చేతులుఆనించి, ఈ క్రిందిఉపన్యాసం దంచింది.

"ముందు సార్జెంటుదగ్గిరికివెళ్ళి 'పిల్లవాడిని నేనే తీసుకుపోతా'నని చెప్పు. తర్వాత రెండురూబుళ్ళు తెచ్చి ఒకనెల బత్తెంకింద నాకివ్వు. అది ముసిలి కిశేయవాకి యిస్తాను. చిన్నిచొక్కా, దుప్పటి కొనడానికి, యింకా వాటికీ వీటికీ

యింకో రూబులు యిచ్చుకో. ఊఁ-యిక వెళ్ళు. పో, విసుగెత్తుతోంది, చాలు. మొద్దుమొహమా వెళ్ళు!"

అరెఫీ లేచి దీర్ఘంగా నిట్టూర్చి మాటాడకుండా వెళ్ళిపోయాడు.

సాయంకాలం ముసిలి కిటేయునా మేర్యాని చూడడానికి వచ్చింది. ఆమెఎడమకన్ను గుడ్డి. రంగులోనూ ఆకారంలోనూ మొహం ఎండుముల్లంగిగడ్డలా ఉంది. బూడిదరంగు గడ్డం ఆమె మొహానికి శోభ నలవరుస్తోంది. కీచుగొంతు. అవసరమైనా కాకపోయినా మాటమాటకు ఆ దేవత సాక్షి, ఈ దేవత సాక్షి అంటూ దేవతలపేర్లు ఎత్తుతూంటుంది.

మేర్యా కొద్దికొద్దిగా పరిస్థితిని వివరించి, ఇలా నడుచుకోమని సలహా చెప్పి, "జాగ్రత్త! అంతకంటె హెచ్చు వెళ్ళావో! హద్దెంతవరకో గుర్తుంచుకో" అని అదమాయించి వేలితో బెదరించింది.

ముసిలి కిటేయునా ముద్దయిపోయి వంగి నమస్కారించింది. తననుతాను కించపరుచుకుంటూ, బానిసలాగా పండ్లికిలిస్తూ మెల్లగా అంది:

"మేర్యా టిమొఫెయెవ్నా! నాసంగతి నీకు తెలియందేముంది? ఇంకోళ్ళవిషయంలో అయితే యేమోగాని, నీ విషయంలో..." ఇలా ఇంకా ఎంతో చెప్పాలనిఉంది గాని, శక్తిలేదని సూచిస్తూ తలవంకించింది.

"అద్దదీ! నాకు తెలుసు. మేకతోలుకప్పుకున్న నక్కవి! అవునవును."

ముసిలిదానిని పొగడడానికి కాకపోయినా, ఈ మాటలు ఒత్తిఒత్తి పలికింది.

ఇంతసేపూ చిన్నారిపాల్ మెదలకుండా పడుకునే ఉన్నాడు. ముసిలి కిటేయవా 'శ్రీరామరక్ష' అంటూ ఎత్తుకోగానే మాత్రం ఇష్టంలేనట్టు ఏడుపు మొదలుపెట్టాడు. ఎలా వ్రాసిపెట్టిఉంటే అలా జరుగుతుందని అనుకున్నవాడి లాగా వీధిలోకి వెళ్ళేవరకు ఊరుకున్నాడు. సూర్యకిరణాలు వచ్చి కళ్ళల్లోపడ్డాయి. తప్పించుకోవాలని మొహంచిట్లించాడు. కాని ఎక్కువ లాభంలేకపోయింది. ఎండ మొహంమీద వచ్చి పడింది. చెంపలు కందిపోయాయి. ఎండ భరించలేక మళ్ళీ బిగ్గరగా ఏడవడం ప్రారంభించాడు.

"దొంగ నాగన్నా! యింటోవున్నంతవరకు కిక్కురుమన కుండా పడుండి, వాకిట్లోకి రాగానే యేడుపులంకించుకున్నావా? ఊం—నోరుమూసుకుని పడుండు."

ముసిలి కిటేయవా రెండుచేతులతో పిల్లవాడిని ఊపుతూ నడవసాగింది. పొద్దస్తమానం ఆకలోఅని ఏడుస్తూ ఒక్కనిమిషంకూడా హాయిగా కూర్చోనీయని అయిదుగురు పసిపిల్లలను సాకటంతోనే ఆమెకు రాత్రింబగళ్ళు సరిపోతుంది. "అరి భగవంతుడా! యింకోడు వచ్చిపడ్డాడు. వీడితో ఆరుగురు!"అనుకుంది. వాళ్ళతో వేగడం కష్టమే! వాళ్ళమూలంగా వచ్చేడబ్బుతో కడుపునిండదు గాని, ఆకలితో చావనక్కర లేదు.

సూర్యకిరణాలు ఆ యింట్లోకి మసకమసకలాడే కిటికీ అద్దాలగుండా వచ్చిపడుతున్నాయి. అద్దం పగిలిందేమో,

పగుళ్ళకు జిగురుపూశారు. కిందుగా రెండుగదులు. ఆ గదు
లలోనుంచి వచ్చే నవాసాగరపుఘాటు భరించలేక సూర్యకిర
ణాలు వెనక్కు తగ్గినట్లుంది. ఇంటికప్పు పొగచూరి
పోయింది. గోడకాగితాలుమాసి, చిరిగిపోయాయి. నేల బాగా
బీటలువారి కిర్రుమంటోంది.

మొదటిగది—అదే పిల్లలగది—బహు నిరాడంబరంగా
ఉంది. బాగా పొడుగూ వెడల్పూ ఉన్న బల్లలమీద చెత్తా
చెదారం పడవేశారు. ఇక ఆ గదిలో ఇంతాఅంతా మురికి
గాదు! ఈగలుకూడా బతికేటట్టులేవు. ఆ వాసనతో కాసేపు
చక్కర్లుకొట్టి, తాళలేక, రెండోగదిలోకో హాలులోకో
ఝుమ్మంటూ ఎగిరిచక్కాపోయేవి.

పిల్లలగదికి రెండోగదికి మధ్య చెక్కగోడ. చెక్క
గోడకి అడ్డవిష్టంగా తలుపు. గుమ్మానికిసూటిగా మేజాబల్ల,
మేజాబల్లమీద రంగుమాసి ఒకవేపుకు వంగిపోయిన టీపాయి.
ఆ టీపాయికి అంగవైకల్యం సంప్రాప్తించింది. ఎక్కడబడితే
అక్కడ సొట్టలు. ఎప్పుడూ గుడగుడమంటుంది. కిశేయవా
ఇంటి 'సౌభాగ్యానికి' తగ్గినట్లే ఉంది ఆ టీపాయి.

ఆ రెండుగదులలో ఒకదానిలోనూ ఎవరూలేరు. ఆశా
భంగంపొందిన ఈగలమోత, టీపాయిగుడగుడ తప్ప మరే
శబ్దం వినిపించడంలేదు. కాని గుమ్మంమూల చీకటికోణంలో
చూస్తే ఎవరూ లేరనేభావం మటుమాయమవుతుంది. ఆ
చీకటిమూల బల్లమీద ఏదోప్రాణి కదులుతోంది. నిలువంపుగా
వంగిన కాలు గాలిలో ఆడుతోంది. చెవియొగ్గివింటే వినిపించీ
వినిపించని మూలుగు వినిపిస్తుంది.

ఈ కాలు, దీనిలాగానే వంగి వచ్చబడి ఎండిపోయిన ఇంకోకాలు ఏడ్నర్థంపిల్లవాడివి. ఎక్కువగా విసిగించినప్పుడు కోపేయమవా ఆ పిల్లవాడిని 'ములకాడ!' అని తిట్టేది. ఆమె సాకుతున్న పిల్లలందరికీ ఏదో ఒకమారు పేరు తగిలించేది. 'ములకాడ' అనేపేరు ఎండిపోయిన ఆ కుర్రవాడికి తూచినట్లు సరిపోయింది. ముసలితనంలోలాగా ఆ పిల్లవాడి మొహం ముడతలు పడింది. మనిషి ఎండిపోయాడు. ఎప్పుడూ ఏదో ఒక రోగం మూలంగా వికారపురూపు ఏర్పడింది. మొహం శుష్కించి పోయింది. కలవరపాటు అతని మొహంలో గడ్డకట్టుకుపోయినట్టా అనిపిస్తుంది. తనను వికలాంగుణ్ణి, కురూపిని ఈప్రపంచంలో పడవేయడానికి బాధ్యులు ఎవరు? నిర్దాక్షిణ్యంగా తనను ఇంత అపహాస్యంపాలుగావించిన దెవరు? ఎందుకు? ఈవిషయాలు తెల్సుకోవాలని యత్నిస్తున్నట్టు కనిపిస్తాడేగాని వృథాప్రయాస అని అతనికి నమ్మకంకుదిరినట్లు తోస్తుంది. అందుకనే పూర్తిగా కుంగిపోయాడు.

రోజులకురోజులు ఆమూలనే ఇలా ఆ పిల్లవాడు పడి ఉన్నాడు. వంగిపోయినకీళ్ళను ఒకదానినివిడచి ఒకదానిని నిలకడగా చాలాసేపు చూసుకుంటూ పొద్దుపుచ్చేవాడు. లోతుకళ్ళు. దృష్టినికేంద్రీకరించి తేరిపారజూస్తూండేవాడు. రోగిష్టిపిల్లలందరికళ్ళల్లోలాగానే అతనికళ్ళల్లోనూ గంభీర విషాదచ్ఛాయలు వెలుగొందుతూండేవి. కాళ్ళు పరీక్షగా చూసుకుని, మెల్లగా గొణుక్కునేవాడు. పాలిపోయిన పెదవులు, బోసినోరు. నాలుకమీద పసుపురంగుపూత. పాపం! కాళ్ళు కదలవు. ఉంగరాలుచుట్టుకుపోయాయి. మణికట్లు చంకలకు

తగులుతున్నాయి. మోకాళ్ళపైభాగం తిన్నగానేఉన్నా కింద మాత్రం అర్ధచంద్రాకారంగా వంగి, మోకాళ్ళమీదకు వచ్చి పడుతున్నాయి. కాళ్ళను పరీక్షగా చూసుకునీ చూసుకునీ మధ్యమధ్య అతనికి విసుగెత్తేది. కలవరపాటుతో కప్పుకేసి చూసేవాడు. సూర్యకిరణాలు కిటికీలోనుంచివచ్చి నీళ్ళతొట్టె మీద పడి, ప్రతిబింబించి కప్పును చేరుకునేవి. అస్తమానం సూర్యకిరణాలకేసిచూస్తూ కూర్చుంటే, ఏమిఒరుగుతుందని అనుమానించి, దృష్టిని కప్పుమీదనుంచి కాళ్ళమీదకు మళ్ళించే వాడు. సూర్యకిరణాలమీదకంటె కాళ్ళమీద ఆసక్తి ఎక్కువయింది. ఈ లౌకికప్రపంచానికి సంబంధించినవన్నీ మటుమాయమవుతాయి; చక్షుశ్శక్తి, ఆలోచనాశక్తి ఉడిగిపోతుంది అని భావించాడేమో! సూర్యకిరణాలమీద ఆసక్తి నశించింది. తొందరలోనే పైగదిలోనుంచి కిందిగదిలోకి అతనిని మార్చారు.

పద్దెనిమిదినెలలనుంచి అతనిని ముసిలి కిటేయవా సాకుతోంది. కాని, రెండునెలలకుమాత్రమే ఆమెకు డబ్బుముట్టింది. ఎప్పుడు విరగడైపోతాడా అని ఆదుర్దాతో ఎదురుచూస్తోంది.

ఒకమాటు ఆమె అతనియింటికి వెళ్ళింది. ఆ పిల్లవాడి తల్లికి పాపం! పాండురోగం. నడుం వంగిపోయింది. కుట్టుపని చేసుకు జీవిస్తోంది. కిటేయవా వెళ్ళేసరికి ఆమె కొనప్రాణంతో మంచంమీద పడిఉంది.

"ఊఁ—" అంటూ కిటేయవా ఆ మంచంమీదనే కూర్చుంది. ఆ తల్లి అటుఇటు కదలలేనిస్థితిలో ఉంది. "కంటానికి వోపికవుందిగాని, సాకడానికి లేదేం? ఛీ! నీ పాపాలు మోయడానికి నాకేంపట్టింది? యిస్తే డబ్బు యియ్యి, లేదూ

నీ పిల్లవాడిని నువ్వు తీసుకుతెచ్చుకో. నే నేం ధర్మసత్రం పెట్టలేదు.”

ఆ తల్లి నీలికళ్ళు నిండా విప్పింది. ఆ కళ్ళల్లో కాంతి లేదు. అపరిమితమైనదుఃఖం, భయం వాటిలో ప్రతిఫలించాయి.

“అమ్మమ్మా!”అంది మెల్లగా. మాట సరిగా పెగల డంలేదు. “యిచ్చుకుంటా. ఒక్కొక్కపెన్నీ కూడా వదలకుండా యిచ్చుకుంటా. నా చర్మంవొలిచి అమ్మి మరీ నీకు చెల్లిస్తా. వేశ్యావృత్తికి దిగుతా. కాస్త వోపికపట్టమ్మా! నామీద, ఆ పసిగుడ్డుమీద కాస్త దయజూపు...కాస్త దయజూపు!”

ముసిలి కిటేయవా ఆమె మాలుగు విందు. పాలిపోయిన తొస్సుబుగ్గలమీద కన్నీళ్ళు కాలువలుగట్టడం చూసింది.

“పాపిష్టిముండలు! సిగ్గుమాలినముండలు! మిమ్మల్ని చితకదన్నినా పాపంలేదు; పాపంలేదు” అని మందలించింది కిటేయవా.

“అబ్బ! అమ్మమ్మా! నన్ను ప్రేమించాడు. పెళ్ళాడ తానని వొట్టేసుకున్నాడు...”

“ఆఁ-యిందులో కొత్తేంవుంది, పాతపాటేగా! వెయ్యి సార్లు విన్నా!”

ముసిలి కిటేయవా ఆ పాతపాట వినడమేగాదు, స్వయంగా పాడినట్టుకూడాఉంది. మొహంచిట్లించుకుని, రోగిని ముద్దిడుకుని, ముందు ఆరోగ్యంవిషయం జాగ్రత్తగాచూసు కోమని ముదలకించి వెళ్ళిపోయింది. కాని, ఆ తల్లి కిటేయవా మాటలు చెవినిపెట్టలేదు. పాపం! మరణించింది. 'ములకాడు' ముసిలి కిటేయవాపోషణలోనే ఉండిపోయాడు. త్వరలోనే

ఆ పిల్లవాడంటే ముసిలిదానికి వెగటుపుట్టింది. ఒకమూల పార వేసి, ప్రకృతే అంతా తీరుస్తుందని ఆశించింది. ఏమైనా అట్టే కాలం బతకదనే నమ్మకంతో తననుతానే ఓదార్చుకుని అంతరాత్మను శాంతింప జేసుకుంది.

ఆమె అధీనంలో ఇంకా నలుగురుపిల్లలు ఉన్నారు. వాళ్ళపోషణకు డబ్బుమట్టుతూఉండేది. నాలుగోకుర్రవాడు బయటికి వెళ్ళి, ముష్టిఎత్తి డబ్బుతెస్తూండేవాడు. వాడు తెచ్చేది వాడిపోషణకు సరిపోగా, మిగిలేది. ఆ కుర్రవాడు బొద్దుగా సుందరంగా ఉండేవాడు. చెంపలు గులాబీరంగు. ఆకళ్ళు. పేరు గుర్కా బుల్. మాంచి సాహసి. కిటేయువాకి వాడంటే మహాఇష్టం.

"నువ్వు ఒకటోరకం కేడీవిగా తయారవుతావ్, గుర్కా!" అనేది కిటేయువా, ముష్టినుంచి వాడుతిరిగిరాగానే. వచ్చీరావడంతో చేతిసంచీలోనుంచి రొట్టెముక్కలు, టీపాయి మూతలు, తలుపుగుబ్బలు, బొమ్మలు, తూనికరాళ్ళు, కుందెలు, పెనాలు మొదలైనవి తీసి బయటపెట్టేవాడు.

"ఓ-యెలాంటి కేడీని అవుతాననుకున్నా! వాకటేవిటి, గుర్రాలనికూడా దొంగిలించేస్తా".

"నిన్ను పోలీసులు సైబీరియా పంపిచేస్తే?" అని అడిగింది కిటేయువా వల్లమాలిన దయతో.

"పారిపోయివస్తా" అని తడుముకోకుండా జవాబిచ్చాడు గుర్కా.

కిటేయువా ఏవో కోపెక్కులు చేతిలోపెట్టి వెళ్ళి ఆడుకోమని పంపించింది.

తక్కినముగ్గురూ ఒకటే మచ్చు. నిర్దిష్టమైన వ్యష్టి లక్షణాలు వారిలో ఇంకా ఏర్పడలేదు. ఆహారంఇవ్వడం ఆలస్యమైతే ముగ్గురూ ఒకేమాటు పెద్దపెట్టున ఏడ్చేవారు. అతిగా తినిపించినా ఏడ్చేవారు. ఒక్కొకప్పుడు ముసిలి కిటేయవా పాలు తాగించడం మరిచిపోయి, జ్ఞాపకంవచ్చినప్పుడు బలవంతాన తాగించేది. ఇక అప్పుడు ముగ్గురూ ఒకటేఏడుపు. ఇంకా అనేక కారణాలవల్ల అస్తమానము ఏడ్చేవారు. కాని ఈ కారణాలు వ్యష్టిగాగాని, సమిష్టిగాగాని ఆమెను అంతముఖ్యమనిపించేవికావు. ఆమెకూడా గొంతుచించుకుని అరిచేది. ఆ అరుపులో ఆ పసిపిల్లల ఆరునొక్కరాగం అణగారిపోయేది. మొత్తంమీద చెప్పాలంటే, ఆ పిల్లలు చడీచప్పుడూ లేకుండా ఎన్నడూ పడిఉండేవారుకారు. అదిపెట్టు, ఇదిపెట్టు, పాలుపట్టు, చొక్కాకుట్టించు, గాలిలోతిప్పు అని తెగరొష్టుపెట్టేవారు. కాని, వారికి ఆ వస్తువులు అడిగేహక్కు లేదు. వా రింకా అంత పెద్దవాళ్ళు కాలేదు. జీవితం ఇపుడిపుడే ప్రారంభమవుతోంది. ముసిలి కిటేయవా దృష్టి ఎంతసేపూ లాభాలార్జించడంమీదే కాబట్టి, వారికి కడుపునిండా తిండిపెట్టేదికాదు. అవసరమైనవి స్వయంగా సంపాదించుకునేసత్తువ, ఆత్మవిశ్వాసం వారికి కలగాలనే ఆమెకోరిక.

ముసిలి కిటేయవా కార్యక్రమం :

ఉదయాన అందరికంటె ముందుగా గుర్కాబుల్ నిద్ర లేచేవాడు. అతను నలుగురితోబాటు గాక కిటేయవాగదిలో పడుకునేవాడు. కళ్ళు తెరిచీ తెరవగానే పక్కమీదనుంచి దిగ్గున లేచి, తలగడాకింద వెదకి కోడిఈక పైకితీసేవాడు. ఏమాత్రం

చప్పుడుచేయకుండా బొటనవేళ్ళమీద నడిచి, పిల్లలగదిలో ప్రవేశించేవాడు. తలుపుతీసేటప్పుడుకూడా చప్పుడుగాకుండా జాగ్రత్తపడేవాడు. నేలమీద అతిజాగ్రత్తగా నడిచేవాడు. వేసవిలో నేలమీదికొయ్యచెక్కలు ఎండి కిర్రుమనేవి. శీతాకాలంలో చెక్కలు ఒకదానికొకటి కొట్టుకునేవి. ఈవిధంగా నిద్రపోతున్న పిల్లలచెంతకు దొంగలా చేరుకునేవాడు. వంగి, ఆ పిల్లలలో ఒకడిముక్కులోకి ఈకపోనిచ్చి గిలిగింతపెట్టేవాడు. దాంతో వాడు తల అటూఇటూతిప్పి, వికటంగా మొహం చిట్లించి పిడికిలితో ముక్కురుద్దుకునేవాడు. నవ్వుఆపుకోలేక గుర్కాపొట్ట ఉబ్బిపోయేది. చివరికి నిద్రలేచి, ఆ పిల్లవాడు ఏడుపుమొదలుపెట్టేవాడు. ఇంతలో తక్కినపిల్లలుకూడా లేచి, మొదటివాడిని అనుకరిస్తూ గోలపెట్టేవారు. 'అమ్మమ్మా' అని గుర్కా పెద్దగా కేకవేస్తూ, ఒకపిల్లవాడిదగ్గరనుంచి ఇంకొకడి దగ్గరకు పరుగెత్తేవాడు. పాములాగా బుసకొడుతూ, మొహం చిట్లించుకుంటూ, పిల్లలముక్కులలో ఊదుతూ గుర్కా తనివి తీరా వినోదించేవాడు.

ఇంకేముంది, నలుగురూ ఒకేమాటు గొల్లుమని సప్తతాళాలతో ఏడుపు ప్రారంభించేవారు. దగ్గేవారు, తుమ్మేవారు ఉక్కిరిబిక్కిరై ఏడ్చేవారు. ఇంతెందుకు, వారిపని పెనంమీద వేయిస్తున్నట్లుండేది.

కాని 'ములకాడ' మాత్రం ఇవేం అంతగా పట్టించుకునేవాడుగాదు. ఎడతెగకుండా కాళ్ళను పరీక్షించుకునే అతని చూపుకు గుర్కా భయపడిపోయేవాడు. ఒకమాటు అతనిపని పట్టించాలనే తలంపుతో దగ్గరకు వెళ్లేసరకి, గుర్కామీద

దృష్టినిలిపిచూశాడు. ఆ చూపు చంటిపిల్లవాడిచూపులాగా లేదు. పోలీసువాడిచూపులాగా ఉంది. గుర్ఖాకి పోలీసులంటే సరిపడదు. పోలీసు ఎదురైతే పక్కకు తప్పుకునేవాడు. 'ములక్కాడ' చూసినచూపుకు గుర్ఖా వెనకడుగువేసి మళ్ళీ అతని జోలికి పోలేదు.

"ఓహో హో! యేడుపు మొదలెట్టారు!... ముష్టికి బయలుదేరారు!... మొత్తుకోనీ!... మొత్తుకోనీ!" ముసిలి కిటేయవా నిద్రలేచి రకరకాలుగా తిట్టిపోసేది.

గుర్ఖా మహా గంభీరంగా పక్కగదిలోకి వెళ్ళి, గాలి గుమ్మటంలాగా బుగ్గలుపూరించి, టీపాయి హాలులోకి ఈడ్చుకువచ్చి, అనవసరంగా అటూఇటూ జరిపి, రణగొణ ధ్వనిచేసేవాడు. గుర్ఖాకి చప్పుడుచేయడం అమితఇష్టం. ఎంత పెద్దచప్పుడైతే అంత ఎక్కువగా సంతోషించేవాడు.

ముసిలి కిటేయవా పసిపిల్లలపక్కదుప్పట్లు తీసివేసేది.

"ఊఁ అరవండి, దెయ్యపు వెధవల్లారా! ఊఁ ఆపులించండి, కప్పవెధవల్లారా!"

ఇంట్లో ముసిలికిటేయవా మాటల్లో దేవతలపేర్లు ఎత్తేది కాదు. తాను మానవసేవలో మాడిపోయిన వీరవనితనని భావించేది.

పసిపిల్లలు మూలిగేవారు. గుర్ఖా బొబ్బరించి వాళ్ళను కొట్టేవాడు. ముసిలి కిటేయవా తిట్టిపోసేది. ఈ గందరగోళానికి ఇరుగుపొరుగువారు తెల్లవారిందని నిశ్చయించుకుని నిద్రలేచేవారు.

దుప్పట్లుమార్చి, స్నానంచేయించి, పొట్టలునింపేవరకు

అంటే సుమారు రెండుగంటలసేపు ఈ ఏడుపూ గల్లంతూ సాగుతూనేఉండేది. అప్పుడు టీతాగడానికి కూర్చునేది. అప్పటికే గుర్కా టీతాగడం పూర్తిచేసి, సంచి టోపీగా మార్చి పెట్టుకుని, భిక్షానికు బయలుదేరేవాడు.

టీ తాగినతర్వాత కిటేయవా పిల్లలందరినీ దొడ్లోకి తోలుకుపోయి సన్నటి పొడిఇసకతో నింపిన పెట్టెలమీద కూర్చుండబెట్టేది. మూడుగంటలసేపు, మధ్యాహ్నభోజనాల వేళదాకా పిల్లలు ఎండలో మాడిపోయేవారు. ఆసమయంలో కిటేయవా దుప్పట్లు ఉతికేది, కుట్టేది; తిట్టేది. మళ్ళీ తిండితిని పించి మచ్చమాసిపోతోందని విసుక్కునేది.

ఒక్కొకపుడు ఇద్దరుముగ్గురు స్నేహితురాండ్రు చక్కా వచ్చేవారు. వారివృత్తులు వేరువేరు, ఒడ్డూపొడుగులు వేరు వేరు. వారిలో ఎవరితో సంబంధంపెట్టుకున్నా జైలుప్రాప్తి, ఆసుపత్రిప్రాప్తి సంభవిస్తుంది.

వచ్చేటప్పుడు ఆ స్నేహితురాండ్రు రెండుమూడు సారాసీసాలు పట్టుకువచ్చేవారు. కాసేపటికల్లా వీధివీధంతా జాన లీలతో హోరెత్తిపోయేది. ఇంకా కొంచెంసేపయేసరికి పాటల ధోరణి మారేది. 'రక్షించండి బాబోయ్!' అని కేకవినవచ్చేది. ఆ స్నేహితురాండ్రిద్దరూ కుసిలి కిటేయవా జుట్టుపట్టుకుని నేలమీద బరబరా ఈడ్చేవారు. లేదా, కిటేయవా, ఆ స్నేహితురాండ్రలో ఒకతె కలిసి రెండో స్నేహితురాలిని చావ బాదేవారు. పర్యవసానంమాత్రం ఎప్పుడూ ఒకటే—మొదట అనుభవించి నిద్రపోవడం, ఆతర్వాత లేచి సమాధానపరచడం.

అటువంటపుడు పిల్లలు ఒంటరిగా ఉండిపోయేవారు.

ఏడుపులు వినిపించేవి. సమయానికి ఎవరో ఒకరు వచ్చి ఆపకపోతే ఆకలికి అల్లాడుతుంటారో, ఏడ్చి ఏడ్చి కడుపునొప్పితో మరణించేవారే. ఏదేమైనా, ఆమె స్నేహితురాళ్లు కొంత కొట్టుకుని, అలసిసొలసిపోయేసరికి దొడ్డితలుపు తెరుచుకుని గొడ్డు పాటి ఆడమనిషి చక్కా వచ్చేది. ఆమె మొహంనిండా స్ఫోటకం మచ్చలే.

వచ్చి ఆవులించి, చేతితో నోరుమూసుకుని ఆకాశం వంక శూన్యదృష్టులు బరపేది. ఇసుక పెట్టెలలో ఒక దానిదగ్గరకు వెళ్లి పిల్లవాడిని పైకితీసి తాను అందులో తిష్టవేసేది. మెల్లగా గుండీలు ఊడదీసి, పిల్లవాడితల వక్షానికి అదుముకునేది. ఆకలితో అవురావురంటూ పిల్లవాడు పాలుతాగేవాడు.

ఇదంతా పసిపిల్లలమీద జాలితో చేస్తోందని అనుకోవడానికి ఆమె మొహంలో జాలి ప్రతిఫలించేదికాదు. మొహం నిండా స్ఫోటకంమచ్చలు కళాకాంతులు లేవు.

ఇలా ఒక్కొక్కరికీ పాలుఇచ్చి చివరికి 'ములక్కాడ' ఉన్న గదిలో ప్రవేశించి పిల్లవాడిని ఎత్తుకుని కిటికీదగ్గరకు తీసుకువెళ్ళేది. పిల్లవాడు కళ్ళుచికిలించి వెలుతురుపడకుండా మొహం తిప్పేసుకునేవాడు. దొడ్లోకితీసుకుని వెళ్ళి ఇసుకపెట్టెమీద కూర్చుని పాలుఇచ్చేది పాలుతాగుతూంటే పిల్లవాడితల, చెంపలు నిమిరేది. పాలుతాగడం పూర్తికాగానే అతనిని పెట్టెలోపడుకోబెట్టి గొంతువరకు ఇసుకకప్పేది.

ఇలా చేసేసరికి 'ములక్కాడ'కు సంతోషంగా ఉన్నట్టు తెలిసేదికాదు కళ్ళు తళతళా మెరిసిపోయేవి, [illegible] వదలిపోయేది. 'ములక్కాడ' సంతోషించడం చూసి ఆమె

ముఖ

చిరునవ్వు నవ్వేది. ఆనవ్వు ఆమె మొహానికి అందం తెచ్చిపెట్ట డానికి బదులు మరింత వికృతపర్చేది. ఇలా పిల్లవాడితో చాలాసేపు కాలక్షేపం చేసేది. ఎండకు, ఇసుక వేడికి పిల్లవాడు మాడిపోయి ఏడుపు మొదలుపెట్టగానే ఎత్తుకుని ఊపేది దాంతో పిల్లవాడు తుష్టిపొంది నిద్రపోయేవాడు. నిద్రలో చిరునవ్వు నవ్వేవాడు. ఆమె 'ములకాఁడ'ను ముద్దుపెట్టుకుని గదిలోకి తిరిగి తీసుకువెళ్ళి పడుకోబెట్టేది. ఆతర్వాత మళ్ళీ దొడ్లోకివచ్చి పిల్లలను కనిపెట్టిచూసేది. మొహంలోమాత్రం ఎక్కడా చలనం కనిపించేదికాదు. నిద్రపోకుండా మేలుకొని ఉంటే వారితో ఆడుకుని మళ్ళీ స్తన్యం ఇచ్చి, దొడ్డిదోవనే వెళ్ళిపోయేది. వెళుతూ బయటినుంచి సగం తెరచిన తలుపు గుండా తొంగిచూసేది. చీకటిపడి కిటేయవా ఇంకా కైపు లోనే ఉంటే, తిరిగివచ్చి పిల్లలనుపడుకోబెట్టి మరీ వెళ్ళేది.

ఇక్కడ నే నేదో దేవతని వర్ణిస్తున్నాననుకోకండి. ఆమె నలుగురూలాంటి సామాన్యస్త్రీ. పైగా మొహంనిండా స్ఫోట కంమచ్చలు. లంకగుమ్మడికాయలంత స్తనాలు. అంతేకాదు, ఆమె మూగి. ఒక తాగుబోతు కమ్మరిభార్య. ఒకమాటు ఆమెభర్త ఆమెను తలమీద మోటుగా కొట్టేసరికి, ఆదెబ్బకు నాలుక రెండుగా కరచుకుంది. మొదట్లో అతను చాలా బాధ పడ్డాడు గాని, తర్వాత తర్వాత 'మూగిదెయ్యం' అని పిలువ సాగాడు.

వేసవికాలం ఈవిధంగా గడచిపోయేది. ఇక శీతా కాలంలో జీవితమే వేరు. ఇసుకపెట్టెలు దొడ్లోబదులు స్టవ్

మీాద పడిఉండేవి. పసిపిల్లల శరీరం పెరగడానికి ఇసుక చాలా ముఖ్యమైందని ముసిలి కిటేయవా అభిప్రాయం!

ఇక పాల్ విషయం : తక్కినవారిని పెంచినట్టే ఆమె అతనినీ పెంచుతోంది. భేదమేమీాలేదు. కాని అప్పుడప్పుడు నల్లటి పెద్ద గడ్డంమనిషి వచ్చి పాల్ పండుకున్న ఇసుకపెట్టె మీాదికి వంగేవాడు. నల్లటి లోతుకళ్ళు అతనివంక చాలాసేపు శ్రద్ధగా చూసేవి

పిశాచంలాంటి ఆ మనిషిని చూసి, మొదట పాల్ భయపడ్డాడు గాని, క్రమక్రమంగా అలవాటుపడడంమూలాన భయంతీరిపోయింది. ఇంకేం, చిట్టిచేతులు మబ్బుగడ్డంలోనికి పోనిచ్చి కితకితలుపెట్టేవాడు. గడ్డంమధ్యలో తెల్లటి పెద్దపెద్ద పళ్ళు. గొణుగుడుకు పాల్ భయపడేవాడుకాదు. ఒకొకప్పుడు రెండు బలీయమైనచేతులు ఇసుకమీాదనుంచి అతనిని పైకెత్తి ఎగరవేసేవి. చిన్నారి పాల్ మొహం ముడుచుకునేవాడు. భయంతో మెదిలేవాడుకాదు. ఎగరవేయడం ఆపగానే పెద్ద పెట్టున కీచుమని ఏడ్చేవాడు. ఏడ్చేటప్పటికి ఎదురుగా నిలబడ్డ ఆ నల్లటి బ్రహ్మాండాకారం బిగ్గరగా,

"యేయ్ ! వినపడడంలా ?" అని అరిచేది.

"వినిపించింది బాబూ, వినిపించింది ! యిమ్, యిమ్ !" అంటూ కిటేయవా కోపంతో జవాబిచ్చి, ఎక్కడనుంచో ఊడిపడేది. "అబ్బే, మరేం పరవాలేదు బిడ్డా, మరేం పరవా లేదు ! ఒహోహో !"

"అలా గొల్లుమంటున్నారేం ?" అని ముంగిటలోనుంచి మంద్రస్థాయిలో ప్రశ్న ఉరుములాగా వినిపించేది.

"అవును, గొల్లుమంటున్నారు తాతయ్యా, గొల్లుమంటున్నారు. అంతా గొల్లుమంటున్నారు" అని వణికేకంఠంతో వ్యంగ్యంగా జవాబు.

"వాళ్ళని శుభ్రంగా వుంచవ్! మురికివెధవలు!"

"అవును. మురికివెధవలు, మురికివెధవలు!"

మంద్రస్వరం కలవరంతో గొణుగుడుగా మారింది. ముసిలమ్మ దగ్గింది.

"యింకా కొంచెం బాగయేఅవకాశం లేదా?"

"లేకేం, వుంది, వుంది, వుంది!" అని ముసిలమ్మ బొంగురుగొంతుతో అరిచింది వేళాకోళంగా.

"అలాఅయితే బాగుపడేమార్గం చూడరాదూ?" బెదిరిస్తున్నట్లు మంద్రస్వరం వినిపించింది.

"ఓ—అదా! నేనేమో పెద్దదానినయిపోయాను. తోడూ నీడా యెవరూ లేరు. పైగా బీదరాలను. అదీ సంగతి! అదీ సంగతి!" అంది ముసిలమ్మ వినయంగా.

విరామం.

"ని...ని...నిద్ర...ని...ని...ద్ర" అని గాలిలో ఈల వేసినట్లు వినిపించింది.

"సరే, వస్తా, జాగ్రత్త!" మంద్రస్వరంస్థాయి హెచ్చింది.

"ఓ-జాగ్రత్తతీసుకుంటాం, జాగ్రత్తతీసుకుంటాం" అంది బొంగురుగొంతుతో మెత్తగా.

వెనుదిరిగి వెళ్ళిపోతున్న మనిషి అడుగులచప్పుడు భారంగా వినిపించింది.

# 3

నాలుగుసంవత్సరాల అనంతరం అరెక్షీ గిబ్లీ చిన్నారి పాల్‌ని తనగుడిసెకు తీసుకువచ్చాడు. పాల్ కాళ్ళు పొట్టి, పెద్దతల, లోతుకుపోయినకళ్ళు, మొహంనిండా అసహ్యంగా స్ఫోటకంమచ్చలు.

పాల్ అతిగా మాటాడేపిల్లవాడు గాదు. అతనికొక్కడికే గోచరించే దేనికేసో ఎప్పుడూ చూస్తున్నట్లు కనుపించేవాడు. అందుచేత గిబ్లీ ఒంటరిజీవితవిధానానికి ఏమాత్రం విఘాతం కలగలేదు. ఈ నాలుగుసంవత్సరాలలో అరెక్షీగడ్డం, తల నెరిసి, వెండితీగలచుట్టలా ఉన్నాయి. గాంభీర్యం పూర్వంకంటె హెచ్చింది. మహాత్ములజీవితగ్రంథాలు చదవాలనే ఆకాంక్ష పెచ్చుపెరిగింది.

పాల్‌జీవితం సాఫీగా ప్రశాంతంగా గడిచిపోతోంది. ఉదయాన్నే సూర్యునితొలికిరణాలతో, పక్షులకలరవంతో మేల్కొనేవాడు. కళ్ళు తెరిచి పక్కమీద పడుకొనే ఆ పక్షులు పంజరాలలో ఒకకడ్డీమీదనుంచి ఇంకొకదానిమీదికి దూకడం, నీళ్ళల్లోపడి కొట్టుకోవడం, గింజలుకొరికి తినడం, ఒక్కొక్కటీ ఒక్కొక్కవిధంగా పాడడం చూస్తూ వింటూ చాలాసేపు గడిపేవాడు. ఆ పక్షులు మంచి హుషారుగా, మంచి పట్టుగా పాడేవి. కాని ఏమాత్రం రమణీయంగా ఉండేదికాదు. బంగారుపిచ్చుకల ఈలలు విసుగుపుట్టించేవి. జీనునాయిపిట్ట అపస్వ కీచుమంటూ అసహ్యంగా ఈలవేసేది. ఈ రెండుపిట్టల అరుపులూ కలిసి కట్టలుతెంచే విచిత్రమైనధ్వని ప్రవాహంగా బయలుదేరి పొగచూరిపోయిన ఆ చిన్నగదిని నింపేవి.

ఈ రెండుపిట్టలూ గాక ఇంకో పెడిసెపిట్టకూడా ఉంది. అది ఎక్కువగా అరిచేదిగాదు. పైగా వికలాంగి. కిటికీదగ్గర వేలాడే పెద్దతీగపంజరంలో దానికాపురం. ఒంటికాలితో కడ్డీ పట్టుకుని తలఆడిస్తూ శరీరం ఒకపక్కనుంచి ఇంకోపక్కకు తిప్పి దొర్లేది. హఠాత్తుగా ఈలవేసేది. దాంతో తక్కినపక్షులు కంగారుపడి నోరుమూసుకునేవి. రకరకాల శృతులలో పాట కట్టిపెట్టి, ఈ ఈల ప్రాముఖ్యం తెలుసుకోవాలని యత్నిస్తు న్నట్లు చుట్టూ చూసేవి. పెడిసెపిట్టకు పక్కనేఉన్న జీనువాయి పిట్ట రొమ్ముమీాది ఎర్రటిరంగుచూసుకుని తా నొక సేనాధి పతినని మిడిసిపడుతూ ఒళ్లుతెలియని కోపంతెచ్చుకుని, ఉద్రే కంతో పొంగిపోయేది. చిందులు తొక్కుతూ పెడిసెపిట్టవేపు పంజరంలో తలదూర్చి పక్షిజాతికి తగనివిధంగా పటపట శబ్దం చేసేది. బుసకొట్టేది. ముక్కుతెరిచి మొద్దునాలుక జూపేది కాని, పెడిసెపిట్టమాత్రం ఒకవేపునుంచి ఇంకోవేపుకు ఊగుతూ దానిసంగతే పట్టించుకోకుండా వేదాంతిలాగా తలతిప్పుతూ ఊరుకునేది. పంజరంలోకి ఏ బొద్దింకో పాక్కుంటూ వచ్చి నపుడుమాత్రం మహా చురుకుగా ఉండేది. అయితే ఈ చురుకుదనం రెండుమూడుసెకండులవరకు మాత్రమే! పెడిసె పిట్ట నడవడిలోనే ముఖ్యంగా ఆ ఈలలో ఏదో లోతైన సంశ యం నిబిడీకృతమైఉండేది. అంతేగాదు, ఆ ఈలలో పక్షులను మైకంలోముంచేశక్తికూడా ఉంది. రక్తాన్ని ఉడికించి, ఆశను రేకెత్తించే ఉపన్యాసాలమధ్య వయోవృద్ధుడు మంచి తెలివైన మాట వదలినట్టుండేది. ఒకొకపుడు రెక్కలుఆడించి పంజరంలో గంతులువేసేది. ముక్కుతెరిచి ఈకలు పెరికికొని ఈలవేయ

బోయేదానిలా తయారయేది. కాని ఈల వేసేది కాదు. ఈల వేసే వేళ కాలేదనో. ఏమిచేసినా ప్రస్తుతవ్యవస్థ మార్చడం తన తరంకాదనే గట్టినమ్మకంతోనో మళ్ళీ మామూలు వేదాంత ధోరలోపడి మెదలకుండా ఊరుకునేది.

పాల్‌కు పెడిసెపిట్టలో అరెఫీమామయ్యపోలిక కనిపించింది. అందుకని తక్కినవాటికన్న దానిని ఎక్కువ మక్కువతో చూడసాగాడు. అరెఫీమామయ్యకుకూడా పెడిసెపిట్టఅంటే మహా ఇష్టం. దానిపంజరం ముందుగా శుభ్రంచేసి గింజలు, నీళ్ళు పోసేవాడు.

ఉదయం అరెఫీమామయ్య ఇంటికివచ్చేవరకు పాల్ పక్కమీదనుంచి లేచేవాడుగాదు. ఎందుకనోగాని అరెఫీకి ఆ గుడిసె అంటే గిట్టేదికాదు. సాధ్యమైనంతవరకు బైటనే కాలం గడిపేవాడు. అరెఫీమామయ్య మెల్లగా తలుపుతోసి బహు జాగ్రత్తగా గదిలోకి తలపొనిచ్చి,

"యింకా లేవలా?" అని అడిగేవాడు.

"ఆఁ-లేచా!" అని పాల్ జవాబు.

ఆతర్వాత అరెఫీమామయ్య టీకాయడానికి వెళ్ళేవాడు. టీపాయి చాలా పాతది. అన్నీ అతుకులే. తగరపురేకుముక్కలు కలిపి చేసిన బావతు. ఒకవేపు పిడిపోతే తీగతో గుర్రపునాళం బిగించికట్టాడు. టీపాయికింద నిప్పువేసి నీటిమోతవచ్చేవరకూ పంజరాలు శుభ్రంచేసి, గుడిసె ఊడ్చేవాడు. మాట మెత్తగా ఉండాలని మరీ మంద్రస్వరంలో

"లేచి మొహంకడుక్కుని ప్రార్థనకానీ" అని కేకవేసేవాడు.

పాల్ లేచి, మొహంకడుక్కుని ప్రార్థనచేసేవాడు. నెమ్మదిగా ప్రశాంతంగా, గంభీరంగా తనుచేసేపనులఅవసరం, ప్రాముఖ్యం గురించినపెద్దవానిలాగా ప్రవర్తించేవాడు. ఈ ప్రవర్తన, తున్నతల, గంభీరంగా మెరిసిపోయేకళ్లూ చూస్తే అచ్చంగా చిట్టెలుక అనుకోవలసిందే! మొహంకడుగుకుని, తల దువ్వుకుని అరెఫీపర్యవేక్షణలో కృత్రిమంగా అణచుకున్న స్వరంతో ప్రార్థనచేసేవాడు పాల్. ఆతరువాత అష్టవంకరలు పోయిన టీపాయిముందు మేజాబల్లమీద కూర్చునేవాడు. మొహంకడిగి జుట్టుదువ్వుకునేసరికి అతనివెర్రిఆకర్షణ మాయ మయేది. గాంభీర్యం హాస్యాస్పదంగా తయారయేది.

మౌనంగా ఇద్దరూ టీతాగేవారు. పగలు చాలా భాగం అలా మౌనంగా గడిపేవారు. టీతాగినతర్వాత అరెఫీ వంట చేసేవాడు. అంటే శీతాకాలంలో స్టవ్ వెలిగించి కుండలో నీళ్ళుపోసి కూరముక్కలు, మాంసముక్కలు పడవేసేవాడు. వట్టిచేతులతోనే కుండ స్టవ్ మీద పెట్టేవాడు. ఇక వేసవిలో గుడిసెవెనక దొడ్డిలో నెగడువేసి అందులో ఉర్లగడ్డలు కాల్చే వాడు. ఆడవాళ్ళదగ్గర వంటనేర్చుకోవడం అవమానంగా భావించి, ఇటువంటి సామాన్యవంటకాలు తయారుచేసేవాడు. ఏమైనాసరే, ఆడవాళ్ళు ఉపయోగించే గరిటెలు, అప్పడాల కర్రలు, కవ్వాలు ఇంట్లోఉన్నా ఉపయోగించేవాడుగాదు.

పాల్ చారల మట్లాగూ, ఎర్రటిచొక్కా తొడుక్కుని అరెఫీవెనకే దర్జాగా తిరుగుతూ, అతనుచేసే ప్రతిపనీ కనిపెట్టి చూస్తుండేవాడు. ఎప్పుడోగాని ప్రశ్నలువేసేవాడుగాదు. అరెఫీ 'ఆ ఊ' అని ముక్తసరిగా జవాబిస్తూండడంవల్ల పాల్‌కి సంభా

ఒణుకుదిగాలనే ఉత్సాహం కలిగేదికాదు. అరెఫీ గుడిసెలో తచ్చాడుతూంటే చూస్తుండేవాడు. ఆతర్వాత వీధిలోకి వెళ్ళే వాడు. వీధిలోకి వెళుతూంటే 'ఆట్టేదూరం వెళ్ళకు' అని అరెఫీ ఆదేశం వెనకనుంచి వినిపించేది.

వారిగుడిసె పట్టణంచివర పొలాలమధ్య ఉంది. కిటికీలో నుంచి చూస్తే ఒకపొలం, దానిగుండా ప్రవహించే చిన్ననది కనిపిస్తాయి. ఆ నదినీళ్ళు బూడిదరంగు. నదిఅవతల ఇంకో పొలం. వేసవిలో అది పచ్చపచ్చగా ఆకర్షణీయంగాఉంటుంది. శీతాకాలంలో చలిగా బిక్కుబిక్కుమంటూంటుంది. అంచులు దిఙ్మండలాన్ని మోస్తున్నట్టుంటాయి. పగటిపూట అక్కడ చీమచిటుక్కుమనదు. కారుచీకటి వ్యాపిస్తుంది. కాని, సాయం కాలంపూట సూర్యాస్తమయసమయంలోమాత్రం ఎర్రని పచ్చని కిరణాలు పడి వెలుగొందుతూంటుంది.

పాల్ నదిఒడ్డుకు వెళ్ళి తుప్పలమధ్య గుట్టలమీద కూర్చుని నీళ్ళల్లోకి పుడకలు విసిరివేసి అవి దూరానికి కొట్టుకు పోతూంటే చూసి సంతోషించేవాడు. సూర్యకిరణాలు నీళ్లతో ఆడుకునేవి. గాలి అలలమీద నాట్యంచేసేది. కెరటాలు ఒడ్డుకు కొట్టుకుంటూచేసే మర్మరనిస్వనానికి పాల్‌కి నిద్రపట్టేది.

ఆ సమయంలోగనక అరెఫీ ఇంటిదగ్గర ఉంటే వచ్చి పాల్‌ని తీసుకువెళ్ళేవాడు. ఇద్దరూ భోజనంచేసేవారు. పాల్ మళ్ళీ నదీతీరానికివెళ్ళి సాయంకాలంవరకూ అక్కడే గడిపే వాడు. ఒంటరిగానో, టుల్కాఅనేబాలికతోనో ఆడుకునేవాడు. టుల్కా బహు బీదఇంటిపిల్ల. మెల్లకన్ను, దొంగబుద్ధి. శుభ్రంగా ఉండేదికాదు. ఎప్పుడూ గడబిడచేస్తూండేది. అరెఫీకి

ఆ బాలికఅంటే కంటగింపు. గుడిసెదగ్గరకు వస్తే దూరంగా
తరిమివేసేవాడు.

సాయంకాలంపూట పాల్ అస్తమయమసూర్యుని, అప్పటివరకు
కళకళలాడుతూ అంధకారంలోమునిగి మరణిస్తున్నట్లున్న అడ
వినీ చూస్తూ కూర్చునేవాడు. ఆతర్వాత ఇంటికి వెళ్ళి పండు
కుని నిద్రపోయేవాడు. అరెఫీ ఇంట్లోఉంటే మాత్రం ప్రార్థన
చేసి మరీ పడుకునేవాడు. ఇంట్లోలేకపోతే ప్రార్థనచేయకుండా
కట్టుబట్టలతోనే పడుకునేవాడు.

ఇలా విసుగ్గా ప్రశాంతంగా రోజులకురోజులు గడచి
పోయాయి. రోజులతోవ్యవహారం అంతేగా! వారాలు, నెలలు,
సంవత్సరాలు...ఇలా అంతులేనిగొలుసుగా రోజులు తయా
రవుతాయి. పాల్ పెరిగి పెద్దవాడయాడు. గడ్డురోజులు దాపు
రించాయి. నది ఎక్కడకు వెళుతోంది? అడవిఅవతల ఏము
న్నది? పెద్దపెద్ద మేఘాలు స్వేచ్ఛగా ఆకాశంలో ఎందుకు
తేలియాడుతున్నాయి? రాతిముక్క పైకిఎగరవేస్తే ఎందుకు
కిందపడుతుంది? ఈ ప్రశ్నలు వేసుకుని పాల్ ఆశ్చర్యచకితు
డయేవాడు. ఒకదానికొకటి కరుచుకున్నట్లుండే ఇళ్ళతో నిండిన
పట్టణంలో ఏంజరుగుతోంది? పట్టణానికి అవతల యేంజరుగు
తుందో! పగలు అల్లకల్లోలంగా, రాత్రిళ్లు ప్రశాంతంగాఉండే
ఈ విశాలప్రపంచంలో ఏంజరుగుతోంది? ఇలాంటిసందేహాలు
పాల్ని వేధించజొచ్చాయి. కాని, అరెఫీని ఈవిషయాలు అడగ
లేదు. ఎప్పుడూ మౌనంగాఉండే మనిషికి ఇలాంటివిషయాలు
తెలియవనే భావించిఉంటాడు. అరెఫీ మౌనం, చిరచిరలాడే
మొహం పాల్ని కలవరపర్చాయి.

ఎప్పుడైనా మైఖేల్ చుట్టంచూపుగా వస్తే, పాల్ అతనితో ఒకమూల కూర్చుని తనివితీరా మాట్లాడేవాడు. మైఖేల్ వాగుడుకు అంతూపొంతూ ఉండేదికాదు. వచ్చీరావడంతోనే అరెఫీని,

"యేం ఋషిపుంగవా! యింకా బతికేవున్నావ్? పెళ్ళి ప్రయత్నం చెయ్యడంలేదాయేం?" అని అడిగేవాడు. అరెఫీ అతనిమాటలు చెవినిపెట్టకుండా ముభావంగా కూర్చునేవాడు. మైఖేల్ గప్పాలు ప్రారంభమయేవి.

కాని అరెఫీమూపే ముభావం మైఖేల్ని నిరుత్సాహపరచేదికాదు. నున్నటిమొహం జేబురుమాలుతో తుడుచుకుని, బల్లమీద సుఖంగా కూర్చుని 'పాడిందే పాడేవాడు!' కోపం వచ్చినపుడు అరెఫీ 'పాడిందేపాడరా పాచిపళ్ళదాసరీ!' అని దెప్పిపొడవడం మామూలు.

"భాయీ, యివాళ పీకదాకా తినేశాను. మేర్యా జర్మనీగోధుమపాయసం వండింది. ఓహోహో! యేం రుచి యేం రుచి!...పాలు, యెండుద్రాక్ష! ఓ! బలే మజాగా వుందిలే! వంటంటే మేర్యాదేవంట! ఒక్క వంటలోనేగాదు, కుట్టుపని వగైరాలలో అందెవేసినచెయ్యి! యేపనిబడితే ఆపని యిట్టే చెయ్యగలదనుకో! నాపెళ్ళాం-ఓ-బహు యోగ్యురాలు! నువ్వు అటువంటిదాన్ని కట్టుకోవాలి, అరెఫీ! అటువంటి దాన్ని కట్టుకోవాలి!"

"కుక్కలాగా మొరుగుతుందనా?" అని చక్కగా ఎత్తిపొడిచేవాడు, టీపాయిదగ్గర గొడవచేస్తూనో, మేజాబల్ల దగ్గర కూర్చుని సాసరులో మీసాలు తడుపుకుంటూనో.

మైఖేల్ ఆశ్చర్యంతో కనుబొమలు ఎగరవేసి, మొరుగు తుందంటావా? యేమిటి? సరే, మొరుగుతుందేఅనుకో! నిజం. మొగుడూ పెళ్ళాలమధ్య ఆమాత్రం లేకుండా యెలా కాపరంచేస్తారు? తప్పదు. యెవరిమట్టుకువారు అధికారం చెలా యిద్దామని చూడడమేగాని, లొంగివుందామనే వుండదు. వుదాహరణకు నావిషయమే తీసుకుందాం. నేను లొంగివడి వుంటానా? ఊహుఁ– ప్రాణంపోయినాసరే వుండను. మేర్యాని నేను గదమాయించినపుడు అది కుక్కినపేనులా పడివుండక పోతే, ఛడీమని లెంపవాయిస్తాను. అంతేనా?”

“నువ్వు ఒకటికొడితే అది రెండు కొడుతుంది” అని అరెఫీ ముభావంగా జవాబిచ్చాడు.

“రెండుకొడుతుందేం? సరే, కొట్టిందేఅనుకుందాం... రెండుకొడితేమాత్రం, అది నాపెళ్ళాం కాకపోతుందా, నేను దానిమొగుణ్ణి కాకపోతానా? నన్ను ఒకటికిరెండు కొట్టేహక్కు దానికీ వుంది. అప్పటికైనా నేను లొంగుతాననుకున్నావా? ఊహుఁ–చిడకబాత్తాను...”

“కిందటితడవలాగా అప్పడాలకర్రతో వీపుచిట్లకొడు తుంది...” అన్నాడు అరెఫీ ఏమాత్రం తగ్గకుండా.

“అప్ప...డాల...కర్ర!...నీమొహంముండ! ప్రతిరోజూ నన్ను అప్పడాలకర్రతో బాదుతోందనుకున్నావా? యేదో ఒక రోజున అలా జరిగింది, అంతే. అప్పడాలకర్ర! యిప్పుడా గొడవ యెందుకులే?”

ఒకరూ మాటాడలేదు. స్నేహితులిద్దరూ టీతాగి, ఒకరిమొహంకేసి ఒకరు చూచుకున్నారు.

"సరేగాని, పక్షులెలావున్నాయ్? యింకా బతికే వున్నాయా?"

"నీకళ్ళతో నువే చూడరాదూ?"

"సరే, మంచిది. పక్షులు–బలే! నేనూ కొన్ని పక్షుల్ని సంపాదిస్తా!"

"ఊఁ–సంపాదించు. నీపెళ్ళాం వాటిని చక్కగా వండి పెడుతుంది!"

"అబ్బే! అలా యెన్నటికీ చెయ్యదు. దానికి పక్షులంటే యిష్టం. అంతెందుకు, మొన్నీమధ్య అది ఒక బాతును కొన్నది. యెంతయిదిగా పెంచిందనుకున్నావ్!" మైఖేల్ కి హఠాత్తుగా ఉత్సాహం రేకెత్తింది. "బలే చురుకైందిలే! జిత్తులమారి కూడానూ. యెవడైనా తాగి దానికంటపడ్డాడో తక్షణమే వాడిని తిట్టేస్తుంది. 'నువ్వు తాగుబోతువి. నేను పోలీసు పెళ్ళాన్ని. కిక్కురుమన్నావా, ఆయన్ని పిలుస్తా. ఆయన నిన్ను ఠాణాకు పట్టుకుపోతాడు. ఠాణాకు వేంచెయ్యాలనివుందా యేం?' అంటుంది. మొన్నీమధ్య ఒకరైతు తాగి దానికంట పడేసరికి సరిగ్గా ఈమాటే అంది. ఇంకేం, పట్టేస్తుందేమోనన్న భయంకొద్దీ బాతుని ముప్పయికోపెక్కులకి నాపెళ్ళానికి అమ్మాడు. ఆ బాతు యెలావుందనుకున్నావ్? ఓ–బాగా కండ పట్టి, గర్వంతో మిడిసిపడుతూ అచ్చంగా మనసార్జెంటులాగా వుంది. నిజం భాయీ! నాపెళ్ళాం, దేవతే అనుకో. అలాంటి దాన్నే గనక నువు పెళ్ళాడితే యిక చెప్పాలి! నీ పంటపండింద నుకో! నిన్ను చక్కగా అదుపులో పెడుతుంది. మరి నోరు మెదపవు!"

"ఆఁ—పెళ్ళాడితే యేం వొరుగుతుందేం?" అని అరెఫీ అడిగాడు, అంతా తెలిసే.

"యేం వొరుగుతుందా? ఆడది! ఆడది యింటోవుంటే వేరే యింక చెప్పాలా? టఫీమని పిల్లలు పుట్టుకొస్తారు. యిల్లు శుభ్రంగా వుంటుంది. తిట్టడానికి, సమాధానపడడానికి మని షంటూ వుంటుంది!"

ఆతరువాత స్త్రీలగుణగణాలనుగురించి విసుగూవిరామం లేకుండా, మైఖేల్ వర్ణించిచెపుతూంటే అరెఫీ వినసాగాడు. ఆడవాళ్ళలోట్లు మంచివిగాతోపింపజేసేటంతనేర్పుగా మైఖేల్ చిత్రించి చెప్పాడు. అతనికి ఈ భూప్రపంచంలో అతిప్రేమా స్పదమైనవి రెండే రెండు. ఒకటి స్త్రీ, రెండు ఆహారం. స్త్రీలు అతనిజీవితానికి బీజాతురాలు. జీవితంలోని వివిధరంగాలను అను సంధించే ఏకత్వం ప్రసాదించేది స్త్రీలు. స్త్రీ ఆదిశక్తి. పురుషు నికి కావలసినబలం, ఉత్సాహం కలిగిస్తుంది. స్త్రీలనుగురించి అతను ఏకధాటిని మూడుగంటలసేపు మాట్లాడగలడు. అతని శృంగారవాక్యాలు అరెఫీని కలతపెట్టేవి. స్నేహితునిమాటలు చెవినివడకుండా మేజాకిందకు పాక్కుంటూ పోయి, దాక్కో డానికి యత్నిస్తున్నాడా అనిపించేటంతగా విచారంతో కుంగి పోయేవాడు అరెఫీ. చివరకు భరించలేక లేచి నిలబడి,

"యిక నన్ను వదిలిపెడుదూ, అంతే చాలు. నువు మనిషిప్రాణం నిలువునా తీసేయగలవు!" అని గద్దించాడు.

ఇలా గద్దించినా మైఖేల్నోరుమాత్రం మూతపడేది కాదు. వాగ్ధాటి కొంత తగ్గేది. ఉహుఁ, చుట్టూ ఒకమాటు చూసి మళ్ళీ ఆ'పాటే' మొదలుపెట్టాడు.

"మీా స్టవ్‌కి సున్నంకొట్టాలి. దానివంక చూాడు. ఛీఛీ! యెంత అసహ్యాంగావుందో! యింట్లో ఆడదిఅంటూ వుంటే..."

కాని ఈమాటలు విని అరెఫ్ఫీ దగ్గి, కోపంవెళ్లడించడానికి కాలో చేయో ఆడించేవాడు.

"కోప్పడకు భాయీా! కాస్త తమాయించు. యెప్పుడో ఒకదానిని కట్టుకుంటావులే! నీలాంటివాడు బతుకుబండలు చేసుకోవడం సాధ్యంకానిపని!" •

"మైక్, యిక చాల్లే!" అంటూ అరెఫ్ఫీ మేజామీాద పిడికిలితో బాదాడు.

"సరే,సరే. యిక ఆవిషయం యెత్తనులే. నీదుంపతెగ!"

కొన్నినిమిషాలు మౌనం.

"నేను యింటికి వెళుతున్నా. గస్తీవెళ్ళేవేళ అవుతోంది. మేర్యా నాకోసం కనిపెట్టుకుని వుంటుంది. యీరాత్రి యెటువంటిభోజనం అనుకున్నావు! మాంసం ముక్కలుతోకగోధుమపాయసం కలిపి కూరిన పందిపొట్ట. పైన మాంసపుసారంపూత. నోట్లోవేసుకుంటే చాలు యిట్టే కరిగిపోతుందనుకో! అబ్బ! యిక్కడ మీారుతినేది తిండా, గడ్డా? కాని, యింట్లో...సరే సరే. ఆ విషయం యింక యెత్తనులే. వెళుతున్నా! వెళుతున్నా! శెలవు. యెప్పుడైనా వచ్చి మమ్మల్ని చూసిపోతూావుండు. పాల్ యేడీ? అరే దెయ్యం! యెక్కడున్నావురా? యిక్కడెక్కడా లేనట్లున్నాడే? పోనీ, యెలా వున్నాడు? కులాసాగా వున్నాడా? వీధిలోనే మకాం అనుకుంటా. పాల్ బతుకు యేంబతుకు? యింటోనేగనక ఆడది..."

చివరకు ఎలాగైతేనేం అరెఫీసణుగుడుపడలేక మైఖేల్ వెళ్ళిపోయాడు. మైఖేల్ వచ్చి వెళ్ళినతర్వాత చాలాసేపటి వరకు అరెఫీ తలకిందులైపోయేవాడు అతనికి చుట్టూ వాతావరణం చెడిపోయినట్టు అనిపించేది.

మైఖేల్ మాటలు ఎప్పుడూ ఒక్కతీరుగానే ఉండేవి. మొదటిమాటలు వింటేచాలు, చివరిమాటలు పాల్ చెప్పేయగలిగేవాడు. సన్నగా జిడ్డుగా మొహం, వెండిగుండీల లాంటి కళ్ళు, మంద్రస్వరం ఒకటేమిటి అతనివాలకం, పొట్టి కాళ్ళు, చేతులు, అంటకత్తిరించుకున్నఅడ్డతల పాల్ కి నచ్చలేదు. మైఖేల్ ధోరణిని పరికించడంవల్ల, అతనిపట్ల అరెఫీవైఖరి గ్రహించడంవల్ల పాల్ కి అతనంటే అసహ్యం ఏర్పడింది. 'జిత్తులమారి నక్కపిల్ల' అని పేరు వచ్చిపడింది. గడ్డం నల్లగా ఉన్నా, రాక్షసకాయమైనా, భయంగొలిపేటంత మానంవహిస్తున్నా మైఖేల్ కంటే అరెఫీయే అందగాడనే నిశ్చయానికి వచ్చాడు పాల్.

ఆ ఇద్దరుస్నేహితులసంభాషణ విని, ఒకనిర్ణయానికి రాలేకపోయినా పాల్ ఎప్పుడూ అరెఫీపక్షమే వహించేవాడు. మైఖేల్ అంటే అతనికి నమ్మకంకుదరలేదు. స్త్రీలయెడల అరెఫీ అవలంబించినవైఖరే పాల్ కూడా అవలంబించాడు. టులాక్ పట్ల ఆ వైఖరే అవలంబించాలని యత్నించాడు. మొదట్లో ఆ బాలిక ఆశ్చర్యపోయింది. తర్వాత కోపంవచ్చి పాల్ మొహం బరికేసింది. దాంతో పాల్ కి స్త్రీలంటే గౌరవం ఏర్పడింది.

ఇంటికి వెళ్ళగానే అరెక్షీ ముక్తసరిగా గంభీరంగా అడిగాడు.

"యేమిటిది ?"

"మరేంలేదు, పడ్డాను; బల్ల చెక్క కొట్టుకుపోయింది" అని పాల్ సిగ్గుపడుతూ జవాబిచ్చాడు.

"ఓ_అలాగా!..." అరెక్షీ ముభావంగా అని, వెళ్ళి కడుక్కోమని చెప్పాడు.

ఇలా రోజులకురోజులు గడిచినాయి. పాల్ పెరిగి ఇంకా పెద్దవాడయ్యాడు.

ఇపుడు పాల్‌కి తొమ్మిదేళ్ళు. పొట్టి. మొహంనిండా స్ఫోటకంమచ్చలు. ఎడ్డివాలకం. ఎక్కువగా మాటాడేవాడు కాదు. కళ్ళు చిన్నపిల్లలకళ్ళలాగా ఉండేవికావు. వాటిలో ముభావం, ప్రతిభ ఉట్టిపడుతూండేవి. అరెక్షీ, పాల్ ఒకరినొకరు బాగా అర్థంచేసుకున్నారు. మౌనంగాఉన్నా ఒకరితో ఒకరు జోరుగా మాటాడుకుంటున్నట్టే ఉండేది. అరెక్షీ పాల్‌కి చదవను వ్రాయను నేర్పాడు. చర్చిబడిలోకి పంపాడుగాని, అది విషాద పరిణామాలకు దారితీసింది. బడిపిల్లలవైఖరిని పాల్ పదిరోజుల కంటె ఎక్కువ భరించలేకపోయాడు. పదకొండోరోజున "బడి వేళైంది, లే" అంటూ అరెక్షీ పాల్‌ని లేపాడు. పాల్ తలగడ మీదనుంచి తలఎత్తాడు. నిద్రలేకపోవడంవల్ల కళ్ళు ఎర్రబారినాయి. అరెక్షీమొహంలోకి చూసి, పుట్టినతర్వాత ఎన్నడూ మాటాడనంత జోరుగా

"నన్ను చంపినాసరే, యిక నేను బళ్ళోకి వెళ్ళేదిలేదు. అక్కడ నన్ను కుక్కకంటె కనాకష్టంగా చూస్తున్నారు. 'రాజ

కొడుకు, అనాథ, స్ఫోటకంమచ్చలదెయ్యం' అని గేలిచేస్తున్నారు. నువు యేంచేసినాసరే, యిక నేనుమాత్రం వెళ్ళను. యింటిపట్టునే వుంటా. వాళ్ళంటే నాకు అసహ్యం. పోట్లాడతా. వాళ్ళేకాదు, మనుషులంటేనే నాకు అసహ్యం. మొన్న పంతులిగారిఅబ్బాయిముక్కు చిదకగొట్టాను. పంతులుగారు నాచేత గంటసేపు మోకాళ్ళదండా వేయించారు. వాడిని మళ్లీ చిదకదంతాను. వాడినొకణ్ణేమిటి, అందర్నీ చిదకదంతా. ఊం— కానీ, కొడితే కొట్టు. నన్ను కొడితే వాళ్ళని యెవడూ కసురుకున్న పాపానపో లేదు. యిక యింటో నేపడివుంటే, మోకాళ్ళ దండా వెయ్యక్కర్లేదు. యేమయినాసరే నేను యిక బళ్లోకి పోను !"

అసంతృప్తితో ద్వేషంతో మరింతవికారంగా తయారైంది చిన్నారిపాల్ స్ఫోటకంమచ్చలమొహం. ఆ మొహం కేసి అరెఫీ తేరిపారజూసి మరి మాటాడలేదుకాని, పాల్ మాట్లాడడంమాని వేసి మొహం మొండిగా తలగడలో దాచుకునేసరికి, అరెఫీ మండిపోయాడు. "అయితే వెళ్ళవన్నమాట!" అని గద్దించాడు. అలా గద్దించేసరికి కిటికీఅద్దాలు వణికి పోయాయి. బడి వేపు ఉద్రేకంతో దృష్టిసారించాడు. పాల్ గజగజ వణికిపోయి, దుప్పటి ముసుగుపెట్టుకున్నాడు.

ఆతర్వాత బడికిసంబంధించిన ప్రస్తావనే రాలేదు. ఇంటి దగ్గరే ఏదో చదువుసాగుతోంది. పాల్ కి చదువుకోవాలని లేదు. ఎంతోకష్టంమీద మొక్కుబడిగా పుస్తకాలు తీసేవాడు. అరెఫీ ఉద్దేశాలు మంచివైనా అక్షరాలకు మాటలకు జీవంపోయలేక పోయాడు.

ప్రతిరోజూ ఉదయం టీతాగినతర్వాత మొహంముడు చుకుంటూ పాల్ అలమారాలోనుంచి పుస్తకాలు పైకితీసే వాడు. మేజాబల్లముందు కూర్చుని, మోకాళ్ళమీద మోచేతులు, అరచేతులలో గడ్డం పెట్టుకుని ముందుకూ వెనకకూ పక్కలకూ ఊగుతూ ఏదో అస్పష్టంగా కటువుగా గొణిగే వాడు.

ఈ వ్యావృత్తివల్ల కలిగినఫలితం ఏమంటే, పంజరం లోనిపక్షులు మౌనంవహించేవి. ఆదుర్దాగా విచారంగా ఒక దానినొకటి చూచుకునేవి. హఠాత్తుగా జీనువాయిపిట్ట ఈల వేసేది. తక్కినవికూడా చదువుమీదనుంచి పాల్ దృష్టిని మళ్ళిం చాలనే దురూహ పుట్టినట్టు ఈలలువేస్తూ కిచకిచలాడేవి. చివ రికి విజయం పక్షులదే.

పాల్ పుస్తకంమీదనుంచి కళ్ళు పైకెత్తి, తనూ మెల్లగా ఈలవేసేవాడు. ఒకనిమిషం ఆగి శృతికటువుగా మళ్లీ ఈలవేసి జీనువాయిపిట్టను వేధించుకుతినేవాడు. చాకూచాకూ గీసి తక్కినవాటిని కూడా గాబరాపెట్టేవాడు. చివరకు నమ్మ రానంత రణగొణధ్వని బయలుదేరగానే బల్లమీద నిలబడి పెడిసెపిట్టపనిపట్టించేవాడు.

పంజరంలోకి పుడక పోనిచ్చి, పెడిసెపిట్టముక్కుమీద తట్టేవాడు. దానికి బహు చిరాకుకలిగేది. ఒంటికాలిమీద పంజరంలో గంతులువేసేది. రెక్కలుకొట్టుకుంటూ ముక్కుతో ఆ వెధవపుడకను పట్టుకోవాలని యత్నించేది. కాని, పుడక జారిపోయేది. అలాంటపుడు ఆ పుడకమీద ఏమాత్రం ఆసక్తి

లేనిజాలిలాగా పశ్చాత్తాపపడిపోయేది. ప్రతిక పట్టుపడినపుడు చెవులు చిల్లులుపడేటట్టు అరిచేది.

దాంతో పాల్ సంతృప్తిపొంది, మళ్లీ పుస్తకాలు చేత బట్టేవాడు. కాని ఏంలాభం? దృష్టి పుస్తకాలమీద నిలిచేది కాదు. సోదగుండా చూడగలిగినవాడిలాగా సూటిగా ముందుకు తేరిపారజూచేవాడు. అలా తేరపారజూచినకొద్దీ అతనిచూపు ఇంకా ప్రశాంతంగా, ఇంకా ఆలోచనాపూర్వకంగా, ఇంకా గాఢంగా తయారయ్యేది. ఏమిటి ఆలోచిస్తున్నదీ అతనికే అర్థం కాదు. కొన్నికొన్ని ఆలోచనలకు అసలు రూపంఅంటూ ఉండదు. ముఖ్యమైనవికావని తోసిపారవేసి తప్పించుకోగల మనేనమ్మకానికి అవి దారిచూపుతాయి. పిరికితనం అజ్ఞానం నాటిలో బీజరూపంగా ఉంటాయి. కాని పాల్ ఆలోచనలు అటువంటివికావు.

పక్షులకిచకిచలువింటూ పాల్ రెండుగంటలసేపు కూర్చునేవాడు. ఇంతలో అరెఫీ పాఠంవచ్చిందా అని ప్రశ్నించేవాడు. పాల్ తొణకకుండా బల్లమీద కూర్చునే వేలుఒకపంక్తిమీద పెట్టి నొక్కుతూ,

"చేతితో వినెదము..." అని చదివేవాడు.

"ఆఁ, యేమిఁటేమిఁటి! ఆగు!" అంటూ అరెఫీ అడ్డువచ్చేవాడు. "అబ్బే! అలా వుండదే!" పుస్తకంతీసుకుని తనలో తాను చదువుకునేవాడు. పెదవులు నిశ్శబ్దంగా కదలాడేవి.

"ఉహుఁ—అలాకాదు. మళ్లీ చదువు"

"చేతితో వినెదము, చెవితో పనిచేయుదుము!"

"ఊఁ, సరిగా చూడు. చెవితో అని వుంటే, చేతితో

అని చదువుతావేం? సరేగాని, చెవితో యేంజేస్తామో చెప్పు?"

"చెవితోనా?" పాల్ కప్పువంకచూస్తూ ఆలోచించి 'వింటాం' అని చెప్పేవాడు.

"అద్దది! మరి చేతితో అని చదువుతావేం?"

పాల్ గోడకుజేర్లపడి, "నా కంతా తెలుసు. మనం చెవితో వింటాం, చేతితో పనిచేస్తాం. కలంతో రాస్తాం. యీ చెత్త చదవడం దేనికి? మాటలు బహు చిన్నవి. రకరకాలు."

అరెఫీ మాటాడకుండా ఆలోచించసాగాడు. పుస్తకం చూసి ఆ చిన్న చిన్న వాక్యాలు చదివాడు. కాని, ఒకనిశ్చితాభిప్రాయానికి రాలేకపోయాడు. పిల్లలఅభివృద్ధికి ఇవి ఎంతవరకు ఉపయోగిస్తాయనే సందేహం కలిగేది. ఇంకా కొంతదూరం చదివి ఆ రచయితప్రతిభకు ఆశ్చర్యచకితుడయాడు. చేతితో వినెదము, చెవితో పనిచేయుదును' అని ఆ రచయిత చెవిని పడితే ఎంత నొచ్చుకునేవాడో!

ఈవిధంగా పాఠాలగంట ముగిసేది. అరెఫీ పాతపాఠాలు, కొత్తపాఠం 'ఇక్కడనించి ఇక్కడకు' ఇంటిదగ్గర చదవమని చెప్పేవాడు. అంతటితో ఇద్దరికీ చెమటపట్టేది. భోజనాలకు కూర్చునేవారు. భోజనానంతరం అరెఫీ కాస్త నడుంవాల్చి, ఒక కునుకుతీసేవాడు. 'ఏదైనా అవసరముంటే వెంటనే లేపుసుమీ' అని ఆదేశించి మరీ పడుకునేవాడు.

ఇక పాల్ దుస్తులువేసుకుని, వీధిలోకి వెళ్ళేవాడు. వీధిలోవారందరితోటీ అతనికి ఎప్పుడూ కొట్లాటే. ఎప్పుడూ విచారంగా మౌనంగా ఉండేవాడేమో, అతనిఈడుపిల్ల లెవరినీ

ఆకర్షించలేకపోయాడు. వారిఉల్లాసం, ఆటలు చూసి అసూయ పడేవాడేగాని, వారితో రాజీపడాలని యత్నించేవాడుకాదు. స్నేహంకట్టాలసేయత్నాలు చాలాసార్లు జరిగాయిగాని, ఏదో ఒకకారణంవల్ల సాగలేదు. కొట్లాటలు, వైరం మిగిలాయి. పాల్ వారిఆటలలో సర్దాగా పాల్గొనలేకపోయేవాడు. ప్రతీదీ సావధానంగా పెద్దవాడిలాగాచూసేవాడు. అందువల్ల అతనంటే పిల్లలకు తుష్ణీభావం ఏర్పడింది. తనను తప్పించుకుతిరుగుతున్నారనే భావం పాల్ కి కలిగింది.

ఒకమాటు పిల్లలంతాకలసి కుక్క గొడుగులు తెచ్చుకోవడానికి అడవికి వెళ్ళారు. ప్రశాంతంగాఉండే అడవిలో వినవచ్చే విషాదధ్వనులంటే పాల్ కి ఎంతో ప్రీతి. ఆ ధ్వనులు అతనికి ఉత్సాహాన్నిచ్చేవి. ఎవరికీ తెలియకుండా మెల్లగా తప్పుకున్నాడు. చెట్లలో తిరుగుతూ, దేనికోసమో వెతుకుతున్నవాడిలాగా తలవంచుకుని, పాటపాడాడు. తియ్యని, వెచ్చని బూజువాసన, పాదాలకింద ఆకులగలగల, చిన్నచిన్న పురుగుల పరుగు అతని కెంతో ఆనందం చేకూర్చాయి. దూరాన్నుంచి,

"ఆ పక్షి యేడీ?" అని ఎవరో అరిచారు.

"యెక్కడికిపోతే యెవడికెక్కావాలి! మరేంతప్పిపోడులే! అంత అదృష్టంకూడానా?"

"పందిలాగా పూరుతున్నాడు. అరెఫీలాగా——"

"అసలు ఆపోలీసాడే వాడితండ్రేమో..."ఇలా అంటూ పిల్లలు బిగ్గరగా నవ్వారు.

పాల్ అయోమయావస్థలోపడ్డాడు. అవమానం భరించ

లేక, మెల్లగా అడవిలోనుంచి బయటికి జారుకున్నాడు. అవ మానం క్రోధంగా మారింది. పగతీర్చుకోవాలని బుద్ధిపుట్టింది. పగతీర్చుకోవడం తప్పుకాదని తోచింది.

అడవిఅంచుకు చేరుకోగానే మహా సంతోషిస్తున్న వాడిలా బిగ్గరగా,

"యేయ్, తొందరగా రండి, రండి! నాకేం దొరి కిందో వచ్చి చూడండి!" అని అరిచాడు.

పిలుపు వినబడగానే ఇద్దరుకుర్రవాళ్ళు పరుగెత్తుకుంటూ వచ్చారు. పాల్ వాళ్ళమీదపడి చితకగొట్టాడు. ఇంటికి చేరు కునేవరకు దోవలో పిల్లలు పాల్‌ని తిడుతూ గేలిచేశారేగాని, దగ్గరకు వెళ్ళలేదు. పాల్ మంచి బలిష్టుడు. అతనితో పోట్లా టకుదిగడం మంచిదికాదని అనుభవంమీాద నేర్చుకున్నారు.

పాల్ ఇంటికిచేరుకున్నాడు గాని, విచారంమాత్రం వదలలేదు. అరెఫీ ఇంట్లోలేదు. సాయంకాలమైంది. ఇంట్లో చీకటి. చడీచప్పుడూ లేదు. ఇటీవలనే పట్టుకొచ్చిన సీమ జీను వాయిపిట్ట, పచ్చజీనువాయిపిట్టఇంకా పంజరంలో వడుంటానికి అలవాటుపడలేదేమో ఆ ఇంటి ప్రశాంతతను భగ్నంచేశాయి. దాంతో పాల్‌దృష్టి వాటిమీాదికి మళ్ళింది. అవి పంజరంలో గంతులువేస్తూ, చువ్వలమధ్య తలదూరుస్తూంటే పాల్ వాటి వంకే చాలాసేపు చూశాడు. హఠాత్తుగా లేచి కుర్చీ మెల్లగా ఎక్కి కొక్కెంనుంచి పంజరం తీశాడు. తలుపుతెరచి తెరచిన కిటికీవేపు పెట్టాడు. ఇంకేముంది! పిట్టలు ఎగిరిపోయాయి. వాటి వెంటపడి పట్టుకోవాలని పాల్ తలపెట్టలేదు. పరధ్యాసగా

మేజాముందు చేతులమీద తలఆనించుకుని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

అరెఫీ ఇంట్లో అడుగుపెట్టగానే, "పత్తుల్ని నేనే వదిలేశాను" అని చెప్పాడు.

పాల్ శతమొండి. కళ్ళల్లో పోరాటసంకల్పం గోచరించింది.

అరెఫీ చుట్టూ గోడలవంక, పాల్‌వంక చూసి ముక్తసరిగా,

"యెందుకు వదిలేశావ్?" అని అడిగాడు.

"యెందుకంటే..." అని జవాబియ్యబోయాడు పాల్. స్వరంలో కళ్ళల్లో మొండితనం పొడగట్టింది.

"సరే సరే...నీ యిష్టం!"

"యింతకీ నన్ను తిట్టలేదేం?" అని నిలవదీసి అడిగాడు పాల్.

అరెఫీ కనుబొమలు, మీసాలు పైకెత్తి, పిల్లవాడి పసి మొహంలోకి దయతో చూస్తూ "యెప్పుడైనా నిన్ను తిట్టానా బాబూ!" అన్నాడు. అరెఫీకి విచారంవేసింది. అరచేతితో మోకాలుమీద రాసుకోసాగాడు.

"వున్న చిక్కంతా అదే! అంతా నన్ను తిడతారు. నువ్వూ తిట్టు, మరేం పరవాలేదు!"

అరెఫీ బల్లమీద కంగారుగా మెసలసాగాడు. పాల్ బాధపడుతున్నట్లు కనిపించాడు

మనుష్యులను కుంగదీసేటంత నిశ్శబ్దం రాజ్యంచేసింది. పంజరాలలో నివతులు సైతం భయపడిపోయి ఇకముం దేంజరు

గుతుందోనని నిరీక్షిస్తున్నట్లున్నాయి, కాని ఏమీ జరగలేదు. పాల్ పద్మాసనం వేసుకుని, గోడకు జేర్లబడి కూర్చున్నాడు. అంతే!

బూజుపట్టిన గోడగడియారం టిక్కు-టిక్కుమంటూ అనంతకాలప్రవాహంలో కలిసిపోతున్నట్లుంది. వెట్టిచాకిరి చేయలేక వివరీతంగా అలసిపోయినట్టు అనిపిస్తోంది. లోలకం సోమారిగా అటూఇటూ ఊగుతూ బరబరమని శబ్దంచేస్తోంది. ఆ శబ్దానికి గోడమీద బొద్దింక విశాలంగా మీసాలు ఆడించింది. కండ్లు మిరుమిట్లుగొలిపే సూర్యకాంతి కిటికీగుండా వచ్చి నేలమీద పడుతోంది.

"పక్షుల్ని వదిలివేశావన్నమాట! సరే. పంజరంలో కొట్టుమిట్టాడేవక్షిని వదిలేయవల్సిందే. బాగా మచ్చికపడి వుండిపోయేపక్షులో వుండనీయాలి. మంచిపక్షి యెప్పుడూ స్వేచ్ఛకోసం తహతహలాడిపోతుంది."

పాల్ అరెఫీకేసి చూసి, "యిదంతా యెవరికి చెప్తున్నావ్?" అని ప్రశ్నించాడు.

"వూరికేనే...మరేంలేదు. యేదో నోటికి అలావచ్చింది. అనేశాను. అంతే!" అని అరెఫీ సమాధానమిచ్చాడు. తప్పు చేసినవాడిలా కంగారుపడి, గడ్డంసవరించుకుంటూ, "సామాన్యంగా మనసులోమాట యెవడూ పైకి చెప్పడు. కాని మనం ఆలోచనలచుట్టూ గిరగిరా తిరుగుతాం. వాటిని కోల్పోతాం. అవి ముక్కచెక్కలైపోతాయి. ముక్కచెక్కలైంది ఖుక మనజాలదు."

"అయితే?" అని పాల్ తిరిగీ ప్రశ్నించాడు శ్రద్ధతో తల ముందుకుసాచి.

"యేంలేదు. యేమిటో చెప్పడం కష్టం. దానికేంగాని, అలెగ్సిన్ మహర్షి జీవితం చదువుదాంపట్టు."

"సరే, చదువుదాం."

ఆశాభంగంపొంది పాల్ బల్లమీద పడుకున్నాడు. అరెఫీమాటలలో ఏదో కొత్తవిషయం ఉన్నట్లు తోచింది. మాటలా కుప్పతిప్పలు. అదీ కొత్తసమాచారమే.

అరెఫీ అలమారులోనుంచి చినిగినపుస్తకాలు తీసి, వాటిలోనుంచి ఒకటి ఏరి మేజాబల్లమీద పెట్టాడు. కొద్ది నిమిషాలలో అతనిగంభీరమంద్రస్వరం ఇంటిని నింపివేసింది. పుస్తకంమీద ఆసక్తి హెచ్చినకొలదీ స్వరంలోకూడా గాంభీర్యం హెచ్చింది. చివరకు వణుకుతూ మరీ మంద్రంలోకి దిగింది. అటువంటప్పుడు బల్లమీదపడుకుని ఆ గ్రంథంలోని విషయాలను మనసులో చిత్రించుకోవడం పాల్‌కి మహాఇష్టం. మహర్షులను పొట్టివారుగా, బక్కపల్చనివారుగా, వారికళ్ళు భయంకరంగా తళతళా మెరిసిపోయేవిగా చిత్రించుకునేవాడు. ఎర్రటిచొక్కా తొడిగి, చొక్కాచేతులు పైకిమడిచి, క్రిరుమనే బూట్లు వేసుకున్న రైతులలాగా వీరులను భావించుకునేవాడు. మహారాజులను బాగా బలిసి, ఎప్పుడూ మండిపడితూండే కురచకాళ్ళ భూస్వాములుగా, క్రైస్తవులనుపీడించే రాక్షసులుగా మనసులో చిత్రించుకునేవాడు. మఠంలోని మతగురువు మొహం, కసాయిదుకాణంలోని గుమాస్తామొహం, పోలీసు సార్జెంటుమొహం, గొగొలోవ్ మొహం యథాతథంగా

చిత్రించుకునేవాడు. వారివారిగుణగణాలలోని ప్రధానాంశా లను, వారివారిఆకారాలలోని ప్రధానలక్షణాలను తీసుకుని, సృష్టికర్తకు వెరపుగలిగించేటంత రాక్షసాకారాలుగా వాటిని తీర్చిదిద్దేవాడు.

ఇలా చిత్రంతర్వాత చిత్రం చిత్రించుకుని, భయపడి పోయి పాల్ కళ్ళు తెరచి చుట్టూచూసేవాడు. ఎదురుగా అరెఫీ తుప్పతల, గోడమీద దానినీడ. నీడ బహు పెద్దగా భయం కరంగా వడేది. అరెఫీ మంద్రస్వరం ఇల్లంతటా ప్రతిధ్వనించేది. దీర్ఘంగా నిట్టూర్పులు, వాటిమధ్య మాటలు, సమాసాలు విస్పష్టంగా వినిపించేవి. అప్పుడప్పుడు పాల్ వాటిని వినేవాడు గాని, ఆ సామాన్యమైనమాటలు మహాత్యాగపురుషులచిత్రా లను ఎలా సృజించగలుగుతున్నాయో అర్థమయేదికాదు. ఆ మాటలు వినీవినగానే అవి వర్ణించేచిత్రాలు తనకళ్ళఎదుట ఎలా ప్రత్యక్షమవుతున్నాయో తెలుసుకోలేకపోయాడు. కథ చదవడం ప్రారంభించేవాడు. కలలుగనేవాడు. కథాసరళి మర పుకువచ్చేది. ఏవేవో ఆలోచనలలో మునిగిపోయేవాడు. నిద్ర పట్టేది. ఎదురుగా అరెఫీ. చుట్టూ ఏంజరుగుతోందో కూడా తెలుసుకోలేని తన్మయత్వంలో పుస్తకం చివరదాకా చదువుకు పోతూండేవాడు. చాలాసేపయినతర్వాత అట్టమీదఖాళీ స్థలంలో ఏదో చదువుతున్నవాడిలాగా తేరిపారజూసేవాడు. నిట్టూర్చి, చుట్టూ ఒక్కమాటుచూసి, లేచి, పాల్ దగ్గరకు వెళ్ళి అతిజాగ్రతగా ఎత్తుకుతీసుకువెళ్ళి స్టవ్ వెనక పక్కమీద పడుకోబెట్టేవాడు. పాల్ మీద శిలువగుర్తు వేసి గుడిసెబయటికి వెళ్ళి, బల్లమీద కూర్చునేవాడు.

అలా కూర్చుని నదికేసీ, అడవిఅంచులకేసీ, నక్షత్రా లతో మెరిసిపోయేఆకాశంకేసీ చాలాసేపు శ్రద్ధగా తేరిపార జూసేవాడు. అణగారిపోతున్న పట్టణరణగొణధ్వని వినేవాడు. దారినిపోయేస్త్రీలను అనుమానంతో పరికించేవాడు. ఇక బండి వాళ్ళు పెద్దగా చప్పుడుచేసుకుంటూ వెళుతూంటే 'మెల్లిగా, దెయ్యపువెధవా!' అని కఠినంగా మందలించేవాడు. నెమ్మదిగా బండినడుపుతూంటే ఇంకా కఠినంగా, 'యేమిట్రా తాబేటి నడక!' అని గద్దించేవాడు. నిజానికి కేకలువేయవలసినఅవసరం ఉండేదికాదు. కాని, అరెఫీ ఒక్కడినీ ఏదోఒకటి అనకుండా పోనిచ్చేవాడుకాదు. అతనిదృష్టిలో వాళ్ళంతా ఎందుకూ కొరగాని శుద్ధసోమరిపోతులు. వాళ్ళు వాళ్ళగుర్రాలబలిమి మీద జీవిస్తారు. వాళ్ళకంటె వాళ్ళగుర్రాలే మంచి తెలివైనవని అరెఫీ అభిప్రాయం. అవి బూతులు మాటాడవు!

ఒకొకకపుడు గంటలు గణగణా మోగించుకుంటూ అరెఫీ ముందుగా టాంగా దుముక్కుంటూ వెళ్లేది. బండివాడు ఎలు గెత్తి కేకలువేసేవాడు. స్త్రీలు ముచ్చటలాడుకునేవారు. పురు షులు బొంగురుగా తాగుమోతులులా నవ్వేవారు. అటువంట పుడు అక్కడిజనాన్నందరినీ ఠాణాకు ఈడ్చుకుపోవాలనేటంత కోపంతో అరెఫీ దిగ్గున లేచేవాడు. చాలాసేపటివరకు వారిని తీక్షణంగా చూస్తూ నిలబడేవాడు.

పాల్‌కి ఆరేళ్ళువచ్చి, వీధిలో ఆడుకోవడం ప్రారంభించ గానే అరెఫీ తక్కినపిల్లలను క్రూరంగా చూసేవాడు. అందు వల్ల తొందరలోనే పిల్లలంతా అతనికి శత్రువులుగా తయా రయారు. వారు పాల్‌ని క్రూరంగా చూస్తారనేవిషయం అత

నికి తోచలేదు. మొదట నమ్మలేదు కాని, యాదృచ్ఛికంగా ఒకమాటు తనపెంపుడుకొడుకుమీద పిల్లలు ప్రయోగించిన దూషణవాక్యాలు చెవులారా విన్నాడు. తనపాల్ని ఇంకె వరూ ప్రేమించడంలేదని తేలిపోయింది.

అనుకోకుండానే అరెఫీ పిల్లలతో పోట్లాటకి తయార య్యాడు. వీధిలో గోలచేయనిచ్చేవాడుకాదు; ఆడుకోనిచ్చే వాడుకాదు. పిల్లలను ఈవిధంగా హింసించడం పిచ్చిపనే. చివరికి తానువ్యవహరిస్తున్నది పైకికనిపించేటట్టుగా పిల్లలతో కాదనీ, పెద్దవాళ్ళ తెలివితక్కువభావాలు, దురభిమానాలు అలవర్చు కున్న యువకులతోననీ నమ్మసాగాడు.

ఈ నమ్మకంమూలంగా పట్టణవాసులతో తగాదాపడ వలసివచ్చేది. అటువంటపుడు పాల్మీద అనేక నేరాలు వినవలసి వచ్చేది. అపుడు ఇంకా విచారంతో కుంగిపోయేవాడు. మొహంనిండా లోతుగా ముడతలుపడేవి. ఆందోళనతో, భయంతో కళ్ళు మెరిసిపోయేవి. గడ్డంవెనకకు మొహంముడు చుకుపోయినట్లు అనిపించేది.

మహర్షి జీవితాలను చదివేటపుడు అతనిస్వరం గాంభీర్యం వహించేది. కాని ఒకొకపుడు విచిత్రంగా ఖంగుమంటూ వణికి పోయేది.

అరెఫీ పాల్లసంబంధంలో మార్పేమీరాలేదు. ఎప్పటి లాగానే మౌనం. అరెఫీ ఎప్పుడోగాని గొంతెత్తి పెద్దగా మాటాడేవాడుకాదు. బండివాళ్ళతోను, స్త్రీలతోను తప్ప తక్కినవాళ్ళతో మాటాడినట్లే పాల్తో మాటాడేవాడు. మామూలుసంభాషణపుడు స్వరం వణికిపోయేది. ఆస్వరంతోనే

సార్జెంటుతో మాటాడేవాడు. కావలామనుషులకు ఆజ్ఞలుజారీ చేసేవాడు. తాగుబోతులను బుజ్జగించి ఇంటికిపంపేవాడు. అడపాదడపా దారినపోయేబాటసారుల ప్రశ్నలకు జవాబిచ్చేవాడు. అరెఫీకాయం రాక్షసకాయం. నల్లటి ఒత్తుగడ్డంలో మొహం మాటుపడిపోయేది. అందుకని బాటసారులు ఎక్కువగా అతనిని ఏమడగడానికీ ముందుకువచ్చేవారుకాదు.

కాలంగడచినకొద్దీ గుడిసెలోకూర్చోడం అపురూపమైపోయింది. రాత్రిళ్లు కావలాకాయవలసినఅవసరం లేకపోయినా బయటికివెళ్ళి చెట్లకిందిబల్లమీద కూర్చునేవాడు.

సూర్యోదయం అయేవరకూ చెట్టుబోదెలాగా చలనం లేకుండా కూర్చునేవాడు, ఒకొకపుడు అక్కడే పడుకుని నిద్రపోయేవాడుకూడా. కాని సాధారణంగా నదిఅవతలివొలంలో ఒకేఒకచోట దృష్టినిలిపి తేరిపారజూస్తుండేవాడు. ఒకొకపుడు లేచి నదిదగ్గరకు వెళ్ళి రాళ్ళమీద కూర్చుని ఏదో వినసాగేవాడు. ఒడ్డుతో ఏదో గుసగుసలుపోతూంటే ఆ నది మెల మెల్లగా ఎక్కడికో తరలిపోతూంటుంది.

పాల్ పెద్దవాడైనకొద్దీ తనలోకితాను కుంచించుకుపోసాగాడు. ఎప్పుడూ మొహంముడుచుకుని నిశ్శబ్దంగా కాలం గడిపేవాడు. అందువల్లనే అతనిఈడువారికీ అతనికీ లంగరు అందేదికాదు. వారితోస్నేహంకట్టాలనే యత్నం మానివేశాడు. ఇదివరలో అలా యత్నించడంవల్ల ఆనందంకంటె దుఃఖమే సంప్రాప్తించింది.

ఒకమారు అట్టిప్రయత్నంచేసి విఫలుడై ఇంటికిచేరు

కున్నాడు. కళ్ళకింద నల్లటిచారలు. పెదవులమీద రక్తం. వళ్లు బిగబట్టాడు. మనిషి తలకిందులైపోయినట్లున్నాడు.

"మళ్ళీ పోట్లాడివచ్చావా?" అని అడిగాడు అరెఫీ బుజ్జగిస్తూ—"ఓ-నువు మహావీరుడివి, యెప్పుడూ పోట్లాడు తూనేవుంటావ్!"

పాల్ మాటాడకుండా బల్లమీదకూర్చుని పెదవిచప్ప రించి ఉమ్మివేశాడు. అతను అరెఫీ కెన్నడూ మొరబెట్టుకుని ఎరగడు. కన్నీళ్ళుపెట్టి ఎరగడు. శత్రువులతో తనకుతోచినట్టు వ్యవహరించేవాడు. వదిలిపెట్టేవాడుకాదు. పైగా ఎన్నడూ ఏడ్చికూడాఎరగడు. అందుకే అరెఫీకి అతనంటే అంత ఇష్టం.

"యీ తడవ యెవరిపనిపట్టించావ్? టుల్కాపనా? యేం?"

ఇంకొకప్పుడైతే అరెఫీ ఇంతకంటె ఎక్కువ అనేవాడు కాదు. కాని పాల్ మనసులో ఏదో బాధపడుతున్నట్లు గ్రహించి, అదేమిటో వెళ్ళకక్కించాలనే ఉద్దేశంతో యత్నిం చాడు. పెద్దప్రయత్నం అక్కర్లేకపోయింది. పాల్ తలవంచు కుని గద్గదికస్వరంతో—"నా తలిదండ్రు లెక్కడవున్నారు?" అని ప్రశ్నించాడు.

స్టవ్ముందు ఏదో పనిలోమునిగిఉన్నవాడల్లా పోలీసు సార్జెంటుముందులాగా టంచనుగా కూర్చున్నాడు. కళ్లు బాగా విప్పి, భయంతో పాల్ మొహంకేసి తేరిపారజూచాడు. పాల్ అరెఫీవైఖరి, మొహం చూడలేదు. జవాబుకోసం చాలాసేపు నిరీక్షించాడు. కాని లాభంలేకపోయింది.

"వారు యెలాంటివారు?" పాల్ తలఎత్తి పిల్లవాడిలా కాకుండా వికటంగా మందహాసంచేశాడు.

అరెఫీ సంబాళించుకుని,

"మీ అమ్మ ఒక గుడిసేటిది. నీతండ్రి ఒక దురాత్ముడు!" అని గర్జించాడు అరెఫీ. ఆగర్జనతో ఇల్లంతా హోరెత్తిపోయింది. పాల్ తలిదండ్రులను తెగతిట్టిపోశాడు. అటువంటితిట్లు అరెఫీనోటినుంచి పాల్ అదివరకెన్నడూ వినలేదు. ముందెప్పుడూ వినబోడు.

పాల్ తలవంచుకుని మరి మాటాడలేదు.

స్టవ్ మీదకుండవంక చూడనైనా చూడకుండా అరెఫీ బల్లమీద కూర్చుని, చుఁయ్ మంటున్న కట్టెలమీద నీళ్ళుజల్లసాగాడు. చాలాసేపటివరకు ఎవరూ మాటాడలేదు. ఇద్దరికీ ఆందోళనగానేఉంది.

చివరికి పాల్ భయపడుతూ భయపడుతూ "వారిని యెరుగున్నావా?" అని అడిగాడు.

"ఆఁ..." అని అరెఫీ బుసకొట్టాడు. "యెరక్కపోవడమేం? కన్నబిడ్డని కోరడిపక్కన వదిలేసిపోయారంటే యెంతటి వాళ్లో తెలుస్తూనేవుందిగా!"

"బతికేవున్నారా?"

"యేమో నాకు తెలీదు....బహుశా బతికివుండరు. నీ తల్లేమో నీకోసం బెంగపెట్టుకుని చచ్చిపోయివుంటుంది. నీ తండ్రి తప్పతాగి యే కోరడిపక్కనో కుక్కచావు చచ్చివుంటాడు!"

"వారిని చూశావా ?"

"నా జీవితంలో అటువంటి చిత్రాకారాన్ని ఎన్నడూ చూడలేదు. చూడడంకూడా నా !"

అరెఫీయేగనక వారినిచూసిఉన్నట్టయితే ఊరుకునేవాడు గాదని పాల్ గ్రహించాడు. గ్రహించి మళ్లీ ఎన్నడూ ఆ విషయం ఎత్తలేదు. ఏదో తెలియని అద్భుతభావం మనసును కలచగా ఒక్కసారిమాత్రం అరెఫీ తనంతటతానే ఆ విషయం ప్రస్తావించాడు.

"నువు సామాన్యులబిడ్డవుగావని స్పష్టమవుతూనేవుంది. నీ బుద్ధి వగైరా సామాన్యమైనవికావు".

పాల్ సామాన్యులపిల్లవాడు కాదనే నిశ్చయానికి అరెఫీ ఎలావచ్చాడో చెప్పడం కష్టం. అలా నిశ్చయించుకోవడానికి ఆధారాలేమీ కనిపించవు. అరెఫీ పాల్ని ప్రేమిస్తున్నాడని ఎవరికీ తెలియదు. అదే అతనిరహస్యం. ఆ ఒక్కమాటు తప్పితే మళ్లీ పాల్ తలిదండ్రులనుగురించిన ప్రస్తావన రాలేదు.

పాల్ కూడా ఈవిషయం ఆలోచించాడా? అనేక విషయాలనుగురించి ఆలోచించినవాడు ఈవిషయం ఆలోచించకుండా వుంటాడా!

మానవునిభావనాశక్తికి హద్దూపద్దూఉండదు. అందులో పసిపిల్లలభావనాశక్తికి అసలే హద్దూపద్దూఉండదు. పసిపిల్లల మనసు పెద్దవారిమనసుకంటె అగమ్యగోచరమైనది. జీవితపాగురలలోచిక్కిన పెద్దవారిలోఉండే ఈ చిన్నచిన్నలక్షణాలు పసిపిల్లలలో కనిపించవు.

# 4

ఒకమాటు గ స్త్రీనుంచి తిరిగివచ్చేసరికి పెడిసెపిట్ట విచిత్రంగా ప్రవర్తించటం అరెఫీ కనిపెట్టాడు. పెడిసెపిట్ట కదలకుండా పంజరంలో కూర్చునిఉంది. హఠాత్తుగా కడ్డీమీదనుంచి లేచి, తలకిందులుగా పడింది. నీళ్ళగిన్నెలో చాలాసార్లు మునిగింది. అలాంటపుడు ఒళ్ళంతా గట్టిగాదులుపుకుని ముక్కుతో పటపటమనిపించి, రెక్కలుకొట్టుకునేది. పూర్వం అలాపడ్డపుడు తేలికగా కడ్డీమీది కెగిరి కూర్చునేది. కాని ఇపుడు ఎగరడానికి కష్టపడవలసివస్తోంది. ఎలాగోఅలాగా కడ్డీమీదకు చేరుకోగానే పూర్వంలాగా కడ్డీమధ్యకూర్చోకుండా పంజరానికిఆనుకుని ముడుచుకుకూర్చుంది.

ఆరోజున ఒంటికాలిమీద కూర్చోవాలని యత్నిస్తూ రెక్కలు చిత్రంగా ఆడించింది. కాని నిలదొక్కుకోలేకపోతోంది.

"యిక బతకదు" అన్నాడు అరెఫీ పక్షివంక పరీక్షగా చూస్తూ.

"ఊహుఁ—" అన్నాడు పాల్. తక్కినవాటిమీదకంటే ఈ పక్షిమీద పాల్‌కి అభిమానం ఎక్కువ.

"బతుకుతుందనుకోను. ముసలిదై పోయింది!"

"దాన్ని ముట్టుకోకు. అలా వుండనీ"

కడ్డీమీద ఊగిసలాడిపోతున్న పక్షివంక పాల్ దీనంగా చూశాడు.

"బయట గాలిలోకి తీసుకువెళితే మంచిదేమో!" అని సూచించాడు అరెఫీ.

"అవును. మంచి దేననుకుంటా."

గొలుసుచిక్కంనుంచి పంజరంతీసి ఇంటిముందున్న చెట్లకిందకు తీసుకువెళ్ళారు. మార్చినెల పగలు దివ్యంగాఉంది. సూర్యకిరణాలు బురదనీటిమీద తళతళా మెరుస్తున్నాయి. పొడిమంచు కరిగిపోతోంది. ఎక్కడా మబ్బుతునకంటూ లేదు. దిఙ్మండలం ఎక్కడో దూరాన గోచరిస్తోంది. నదిఅవతల వంకరలుతిరిగే వెడల్పాటిరోడ్డు ఉంది. దానికిరువేపులా కరిగినమంచు సూర్యకాంతిలో మెరిసిపోతోంది. ఆకాశం నిర్మలంగాఉంది. వసంత సూర్యుడు హుషారుగా ప్రకాశిస్తున్నాడు.

కాని ఇవేవీ పెడిసెపిట్టకు ఉల్లాసం కలిగించలేదు. చుట్టూ విచారంతో చూసి, తలఆడించి, మెల్లగా ఈలవేసి, కడ్డీమీద నుంచి పడి, పాల్ పంజరంతలుపు తీసేలోపలే మరణించింది.

పాల్ చటుక్కున వెనకడుగువేశాడు. పక్షి మరణ వేదనపడుతూ కాలు ముందుకు సాచింది. పాల్ దీనంగా దానికేసిచూస్తూ నిలుచుండిపోయాడు. ఆఖరికి ఒక్కసారి వణికి పక్షి బిగుసుకుపోవడం చూసేసరికి పాల్ కళ్ళవెంట బొటబొటా కన్నీరుకారింది. పంజరంలోనుంచి దానిని బయటికితీసి చేతితో దువ్వాడు. కన్నీరు దానిఈకలమీద రాలింది.

"ఓ-యేడవగలవన్నమాట! నేను చచ్చిపోతే యేడుస్తావుగా!" అన్నాడు అరెఫీ ప్రశాంతంగా పాల్ మీదికి వంగుతూ.

పాల్ పక్షిని నేలమీద పారవేసి, అరెఫీమెడ కావలించుకుని, తల వక్షంమీదపెట్టి వెక్కి వెక్కి ఏడుస్తూ ఏదో గొణిగాడు.

"అబ్బే! ఏడుస్తారా! మరేంపరవాలేదు. ప్రపంచంలో యింకా మంచివాళ్లు లేకపోలేదు. నువు బతకగలవు. కాకపోతే చాలా కష్టపడాలి. నువు మొండివి; లొంగవు, వంగవు. యిది చాలా విచారకరమైనవిషయమే. కాని అదీ ఒకందుకుమంచిదే. వంగితే ప్రతివాడూ నీమీద సవారీచేస్తాడు. మరేంపరవాలేదు. నువు తట్టుకోగలవు. ముఖ్యమైనవిషయం యేమేంటే, చదువుకోవాలి!"

ఈవిధంగా పౌరుషంగా గొడ్డలిపెట్టులా అరెఫీ మాటాడేసరికి పాల్‌కి ఉపశమనంకలిగింది.

ఇద్దరూ కలిసి చెట్ల వేరులమధ్య బొరియ తవ్వి అందులో పెఢిసెపిట్టను పాతిపెట్టారు. బొరియచుట్టూ నత్తగుల్లలు పేర్చిపైన మట్టిపోశారు.

ఈ సంఘటన పాల్‌ని అమితంగా కలచివేసింది. పక్షి గోరీమీద శిలువచేసిపెట్టడానికి అరెఫీఅనుమతి కోరాడు. కొయ్యచెక్క తీసుకుని దానితో శిలువచేయడంలో నిమగ్నుడైనాడు. అరెఫీ బల్లమీద ఒకమూలకూర్చుని పాల్‌ని కనిపెట్టిచూస్తున్నాడు. ఆలోచనలతో బుర్ర బరువెక్కి నుదుటిమీద ముడతలుపడ్డాయి.

"తొందర్లోనే నేను చచ్చిపోతాననిపిస్తోంది. ఒక్కొక్కపుడు నా పనేం బావుండడంలేదు. అందుకని నే చెప్పదలచింది శ్రద్ధగా విను".

పాల్ కత్తి మేజామీదపెట్టి, శ్రద్ధగా వినసాగాడు.

"మైఖేల్ దగ్గిర నావి ముప్ఫయిఅయిదు రూబుళ్ళు యిర వయికోపెక్కులు వున్నాయి. అవి నా కతను బాకీ. పెట్టెలో పదిహేడున్నరూబుళ్ళున్నాయి. అవి నీ కివ్వను. పోస్టాఫీసుకు తీసికెళ్ళి సేవింగ్సుబాంకులో వేస్తాను. వాళ్ళు డబ్బుతీసుకుని ఆకుపచ్చటి చిన్నపుస్తకం యిస్తారు. అది నువు జాగర్తపెట్టు. యిక నీవిషయం. నిన్ను ఒకదుకాణంలో ప్రవేశపెడతాను. అక్కడ నీపని మహా ఛండాలంగానే వుంటుంది, పాల్! అవును. ఛండాలంగానేవుంటుంది. అబ్బ! మనుషులు కుక్కల్లా యెలా ప్రవర్తించగలుగుతారో! తాగుతారు, తిడతారు; లుచ్చాలు! అదేం వేడుకగావుంటుందనుకున్నావేం? నిన్ను కొడతారు. తిడతారు...అబ్బ!"

అరెఫీ చర్రున లేచి టోపీతీసిపెట్టుకుని బయటికి వెళ్ళి పోయాడు. పాల్ పతిగోరీమీదికి శిలువచేయడానికి కూర్చు న్నాడు. అరెఫీమాటలు గుర్తుకువచ్చి కుంగిపోయాడు.

రాత్రి పొద్దుపోయినతర్వాత అరెఫీ గుడిసెకు తిరిగి వచ్చేసరికి పాల్ నిద్రపోతున్నాడు. ఆతర్వాత అరెఫీ ఎన్నడూ తనచావునుగురించి పాల్ ముందు ప్రస్తావించలేదు.

రెండునెలలు గడిచాయి. హఠాత్తుగా పాల్‌కు చదువు కోవాలనేఆకాంక్ష విపరీతంగా కలిగింది. పుస్తకాలు ముందు వేసుకుని రోజులకురోజులు గడపసాగాడు. కాని ఎంతోకష్ట పడితేగాని చదువువంటపట్టేదికాదు. తరుచు ఓర్పు నశించేది. మొహంమీద చెమట కాలువలుకట్టుతూంటే ఏదో మాట నేర్చుకోవాలని తంటాలుపడేవాడు. హఠాత్తుగా ఆమాట

తనకు తెలిసిందేనని స్ఫురణకువచ్చేది. ఒళ్లుమండి తనకుతానే 'యిటువంటిమాటలు యిక్కడ యెందుకు రాసినట్టు?' అని ప్రశ్నించుకునేవాడు.

ఒకమాటు చదువుమీద 'కోపంవచ్చి, పుస్తకాలన్నీ కావేషంకొద్దీ వ్రాసినవేననీ వాటిల్లో తనకుకావలసిందేమీ లేదనీ పాల్ అరెఫీతో చెప్పాడు.

"అయితే నీకుకావలసిదేవిఁటి?" అని అడిగాడు అరెఫీ.

"నాకా?" అంటూ పాల్ ఆలోచించాడు.

"సరే, చూడండి, యిక్కడ: 'పిల్లలారా! పొద్దెక్కింది. గడియారం రెండుగంటలకు రెండునిమిషాలు తక్కువ అని చూపుతోంది' అని రాసివుంది. ఆతర్వాత, 'కాలు, కాగు, తల, వల!' యివన్నీ నాకెందుకు అక్కరకు వస్తాయి?"

"యేవిఁటో అంతా కలగూరగంపగావుంది. సరే. యింకా కొంచెం చదివిచూడు"

పాల్ ఇంకా కొంత చదివాడు గాని, సంతృప్తికలగ లేదు. మనసును కలవరపెడుతున్న ప్రశ్నలకు సమాధానం దొరకలేదు. ఆరోజున రెండుకథలు చదివి మామూలుగానే ఆశ్చర్యపోతూ "దీనివల్ల యేంవౌరుగుతుంది?"అని ప్రశ్నించాడు.

దూరాన్నుంచి పిల్లలకేకలు, కేరింతలు వినిపించాయి. గుడిసెకిటికీలోనుంచి ఉల్లాసంగా సూర్యుడు కాంతినిప్రసరించాడు. పాల్ కి ఇంకా మందుకొచ్చింది. పుస్తకాలమీద దృష్టి నిలుపలేకపోయాడు. పక్షులు పంజరాలలో గంతులువేస్తూ హుషారుగా కిచకిచలాడసాగాయి. పాల్ వాటిని క్రీగంటితో

చూస్తూ ఒకప్పుడు తాను వాటిన్నిటినీ స్వేచ్ఛగా వదిలివేయా లని తలపోయడం జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. దూరాన ఎక్కడో భారీ బగ్గీ అటువేపు వస్తున్న శబ్దమయింది. పాల్ కిటికీలోనుంచి చూశాడు. వీధిలో రొట్టెలవాడు నడిచివెళుతున్నాడు. వాడిని చూసేసరికి ఆకలయింది. ఆరోజున ఎందుకనో అరెఫీ యింకా ఇంటికి చేరుకోలేదు.

బగ్గీ క్రమక్రమంగా ఇంటిని సమీపిస్తోంది. అదిగో, మలుపు తిరిగింది. అందులో ఒక పోలీసుజవాను కూర్చుని ఉన్నాడేగాని అరెఫీ లేడు. ఆ కూర్చున్నది మైఖేల్! అత నెందుకు వస్తున్నాడో? అనుకుని పాల్ వెళ్ళి, గుమ్మంలో నిలబడ్డాడు. దూరాన్నుంచే పిలుస్తున్నట్లు మైఖేల్ చేయి ఊప సాగాడు. మైఖేల్ ఖంగాళీగాఉండడం పాల్ గమనించాడు. టోపీ ఒక వేపుకు ఒరిగి తలవెనకఉంది. కోటుకు గుండీలు పెట్టుకోలేదు. ఏదో ఘోరం జరిగిఉంటుందని పాల్ గుర్తిం చాడు.

"ఊం- తొందరగా యెక్కు!" అని మైఖేల్ కేక పెట్టాడు. "ఆసుపత్రికి తిప్పు" అని బగ్గీవానిని ఆజ్ఞాపించాడు, వెన్నుమీదపొడుస్తూ.

"యేం...జరిగింది?" అని బిగ్గరగా అడిగాడు తెల్ల బోతూ మైఖేల్ చొక్కా-చేయి లాగుతూ.

"ఘోరమే జరిగిపోయింది. అరెఫీకి పిచ్చెత్తింది. మనసు చలించింది. మతిపోయింది. తెలిసిందా? సార్జెంటుదగ్గరికి వెళ్ళి 'నన్ను హింసించి చంపు, నేను క్రైస్తవుడిని. హింసించి చంపు. నీతో మాటాడదలుచుకోలేదు నీతో నాకేమీ నిమిత్తంలేదు'

అన్నా[illegible] కానిమీాద గోగోలోవ్ మూతిమీాద ఒక్కటి కొట్టాను. కొట్టేసరికి యింకా రెచ్చిపోయి 'ఊఁ, కొట్టు, యింకా కొట్టు. నేను శాశ్వతంగా క్రైస్తవుడుగానే వుండి పోతా' అన్నాడు. అరి దేవుడా! యేవిటాపిచ్చిమాటలు! ఆతర్వాత అరెక్షే అలమారాలో వస్తువులన్నీ తీసి, కింద పారేసి కాలితో తొక్కాడు. 'మీా విగ్రహాలను యిలా నుసినుసి చేసేస్తాను' అని యిలాంటివే యేవేవో పిచ్చి మాటలు పేలాడు. వెంటనే తాళ్ళతో కట్టేసి పిచ్చాసుపత్రికి తీసుకు వెళ్ళారు. అక్కడికితీసికెళ్ళినా వాగుడు తగ్గలేదు. అదీ సంగతి. యిదంతా ఆ పుస్తకాలుచదవడంవల్ల దాపరించిందనుకో. చదువుకుంటే చివరికి మిగిలేది దుఃఖమే. ఆలోచించడం మొదలుపెట్టావో యింకేవన్నా వుందా? యెలా? యెందుకు? అని ప్రశ్నించుకున్నావో మతికాస్తా పోతుంది. యేం చేస్తాం? నాకు పాతస్నేహితుడు. యిలా అయిపోయాడు పాపం!"

పాపం! పాల్ కుంగిపోయాడు. మొహంలో ఎక్కడా నెత్తురు చుక్కలేదు. మనసు చింతతో అలుముకుపోయింది. నిశ్శబ్దంగా కూర్చుని వినసాగాడు. గతంలో నిన్న మొన్న అటువంటున్న, నిత్యం తానుచూసిన అరెక్షేరూపం జ్ఞప్తికి వచ్చింది. అరెక్షేలో అసాధారణమైన మార్పేమీా అతనికి గోచరించలేదు. కాకపోతే రోజురోజుకి చిక్కిపోజొచ్చాడు. కళ్ళు మాటిమాటికీ గుంటలువడసాగాయి. మందకొడిగా విచారంగా ఉండే కళ్ళు ఇటీవలే చలించసాగింది. పరమానందం అనుభవిస్తున్నపుడులాగా అసహజంగా మెరిసిపోజొచ్చింది. ఒకొకపుడు

ఎదురుగా ఏదో భయంకరమైంది కనిపించినట్టు [illegible]యే వాడు. అంతే!

మొన్న మొన్ననే అదైనా ఒకసారే అరేఫీ టా[illegible]ం టులో జీవితంగురించి, అక్కడ ఎండలు ఇసుకగురించీ, [illegible]క్కడ నివసించే క్రూరజనులగురించీ మాటాడాడు. అక్క[illegible] వారు చేసిన ఘోరానికి వారిని ఎలుకలనుచంపినట్టు చంపివే[illegible]ాలని కూడా అన్నాడు. ఇలా చెప్పి మళ్లీ మౌనంవహించాడు. ఆనాటినుంచీ నేటిఉదయంవరకు మామూలుగానే ఉన్నా[illegible]ు.

"అయితే నయంకాదా?" అని మైఖేల్ వేదాం[illegible] వ్యాసానికి అడ్డుతగిలాడు పాల్.

"ఆఁ-ఆఁ, తప్పకుండా నయమవుతుంది. యిక డాక్టరు సంగతి అంటావా? ఆనిమిషాని కేం జరుగుతుందో వాడి కేం తెలుస్తుంది? ఉహుఁ-తెలీదు. డాక్టరు నయం[illegible]గలడు. అంతే. అంతకుమించి యేంచెయ్యగలుగుతా[illegible]? [illegible]ంతకీ తలుపుతాళంవేశావా? డ్రైవర్, ఆపు! తలు[illegible]తాళ[illegible]నేనుందా? మాటాడవేం?"

"డాక్టరుగారు యేమన్నారు? చెప్పు. యేమ[illegible]రు? అరె, బగ్గీ ఆపుచేయమన్నావెందుకు? ముందు [illegible]దాం. తొందరగా వెళదాం, మైఖేల్ మామయ్యా!"

"వెళదాం వెళదాం అంటావేమిటి, అ[illegible] [illegible]డిసె తలుపు తీసివుంటేనూ? బలే, వెళదాం వెళదా[illegible] అ[illegible]ాడు. వెళితే యిల్లు శుభ్రంగా దోచేస్తారు. డ్రైవర్, బగ్గీ [illegible]కకు మళ్ళించు. ఊఁ-వెనక్కి! తెలివితక్కువ మొద్దా వె[illegible]

"మైఖేల్ మామయ్యా! వెనక్కి వద్దు. ముందు అరెఫీ మామయ్యదగ్గరకు వెళుదాం పద. గుడిసా! దానిదుంప తెగిరి, యెలా తగలడ్డాసరే"

"అదేంపనికిరాదు. నీకేం తెలుసు పసికుంకవి! నేను స్వయంగా వెనక్కి వెళ్ళొస్తా. డ్రైవర్! ఊఁ—పోనీ, తిన్నగా ఆసుపత్రికితీసుకెళ్ళు. ఊఁ—పోనీ, పిచ్చిఆసుపత్రికి. పాల్, నువ్వు అక్కడికివెళ్ళగానే అడుగు."

కాని ఆనిమిషంలోనే బగ్గీ బర్రున బయలుదేరింది. ఏం అడగాలో పాల్‌కి తోచలేదు. ఊరికే చలించిపోతూ 'ఊఁ— తొందరగా పోనీ' అని బగ్గీవాడిని మందలించసాగాడు.

"తొందరగానే చేరుకుంటాను" అని బగ్గీవాడు జవాబిచ్చాడు. పెదవులుచప్పరించి, కొరడావిదిలిస్తూ గుర్రాన్ని పెద్దగా కేకలేస్తూ తిట్టసాగాడు. "యెక్కడి కా పరుగు? నీకూ పిచ్చెక్కిందాయేం?" కళ్లెంలాగిపట్టి గుర్రంతలను అటూ ఇటూ తిప్పాడు. గుర్రానికి కోపంవచ్చి తోకఆడించింది. అసంతృప్తితో సకిలించింది.

అప్పటివరకు పాల్ మనసు నావరించిఉన్న అంధకారం ఈ విషాదవార్తతో పటాపంచలైపోయింది. జీవితంలో మొదటిసారిగా వాస్తవికదృష్టి ఏర్పడింది. సహజంగా—అనుమానం, అవిశ్వాసం పెచ్చుపెరిగాయి. అతిజాగరూకతతో మెలగసాగాడు. లోపలనుంచి నిరంతరం ఉబుకుతూ గుండెనుబద్దలు చేసే దుఃఖాన్ని దిగమింగాలని శక్తికొలదీ యత్నించాడు. ఇపుడు ఒంటరివాడైపోయాడు. రక్షణలేదు.

బగ్గీవాడు, వీధి, వీధిలోనడిచేజనం ఒకటేమిటి ప్రతీదీ

నిన్నటికంటె చిత్రంగా కనిపించసాగింది. ఏదో అవాంఛనీయ మైన ఉపద్రవభయం అతనిలో రేగింది. నిన్న వెచ్చగా ఆకర్ష ణీయంగా, ప్రకాశమానంగాఉన్న ఆకాశం నేడు పాల్‌కు ఎట్టి సంబంధంలేనిదానిలాగా నిర్దాక్షిణ్యంగా ముభావంగా గోచ రించసాగింది.

"నయమవుతుందా.?" అని బగ్గీవాడిని పాల్ అడిగాడు తీగకోరడిదగ్గరకు బగ్గీ చేరుకుంటూండగా. దానివెనకనే పసుపు పచ్చరంగు ఆసుపత్రిభవనం ఉదాసీనంగా, దుర్భేద్యంగా ఉంది.

"ఓ, నయమవుతుంది. యెడమ వేపుకు దయ్యాపూ, యెడమ వేపుకి. కొరగానికొయ్యా, యెడమ వేపుకి!"

ఆ దెయ్యపుగుర్రం ఎడమ వేపుకు తిరిగే లోపలనే పాల్ బగ్గీలోనుంచి కిందికిదుమికి, బాణంలాగా రివ్వున పచ్చనిగోడ లోని ఒక నల్లటిప్రదేశానికి పరుగెత్తాడు.

గుమ్మం తెరచిఉంది. లోపలకు ప్రవేశించాడు. ఇక్ ఇప్పుడు ఎక్కడకు వెళ్ళడం?

"యేవిఁటి?" అని ఎవరో ఎక్కడనుంచో అడిగారు.

పాల్ తలవంచుకుని తనతో మాటాడుతున్న వ్యక్తివంక చూడకుండాఉండాలని యత్నిస్తూ తొందరతొందరగా "పోలీసు జవాను, పిచ్చెత్తింది - యిక్కడికి - యివాళే తీసుకొచ్చారు. నాకుచూపండి, యెక్కడున్నాడు?" అని గొణిగాడు.

"ఓ-తిన్నగా, తిన్నగా వెళ్ళు. నీకేమవుతాడు? మీ నాన్నా?"

పాల్ తలఎత్తి చూశాడు. ఎర్రచొక్కాతొడిగిన ఆ వ్యక్తి వెనుదిరిగి వెళ్ళిపోతున్నాడు.

"మీనాన్నా?" అని ఆవ్యక్తి పాల్ కేసి తిరగకుండా మళ్లీ అదేస్వరంలో అడిగాడు. హఠాత్తుగా ఆవ్యక్తి టకీమని ఆగిపోయాడు. ఆగిపోయేసరికి పాల్ మొహం అతనివెన్నుకు పొడుచుకుంది.

"యిదుగో, నికొలన్ నికొలయేవిచ్, ఆ పోలీసుజవాను కొడుకు!"

కళ్ళజోడుపెట్టుకున్న ఇంకోవ్యక్తి పాల్ని సమీపించి గడ్డంపుచ్చుకుని.

"యేంకావాలి బాబూ!" అని అడిగాడు, మెల్లగా మృదువుగా.

పాల్ ఆశ్చర్యంతో అతనిని తేరిపారజూశాడు. ఆవ్యక్తి మొహం చిన్నది. సన్నగా పాలిపోయిఉంది.

"అయితే యేంకావాలో చెప్పు?"

"ఆయన్ని చూడాలనివుంది..."

"ఉహుఁ—వీల్లేదు, వీల్లేదు"

పాల్ మొహం ముడుచుకుంది. మెల్లగా ఏడుపుమొదలు పెట్టాడు. తల గిర్రునతిరిగిపోయింది.

"అలాఅయితే నేనెలా..." అంటూ పాల్ ప్రారంభించాడు కన్నీరుపెట్టుకుంటూ.

కాని ఆవ్యక్తి అక్కడలేడు. వెళ్ళిపోయాడు. ఎర్ర చొక్కావ్యక్తిమాత్రం ఉన్నాడు. చేతులు వెనకకుకట్టుకుని పెదవికొరుక్కుంటూ పాల్ ముందునిలబడి కనిపెట్టిచూస్తున్నాడు. పాల్ గోడను గట్టిగాఆనుకుని ఏడుస్తున్నాడు.

"ఉహుఁ—ఏడవకు. నాతో తొందరగా రా. డాక్టరు గారికంటపడంలే. ఊఁ—తొందరగా రా!" పాల్ చేతిని గట్టిగా పట్టుకుని నడవచివరకు లాగుకుని వెళ్ళాడు.

"అదుగో చూడు!"

వెనకనుంచి పాల్‌ని పట్టుకుని పైకెత్తి తలుపుకుఅమర్చిన గుండ్రటిగాజుఫలకందగ్గరకు తీశాడు. తలుపు వెనకనుంచి అరెఫీ మంద్రస్వరంలో రాగాలుతీయడం వినిపించింది.

పొడుగాటి తెల్లఅంగరఖా తొడిగికొని అరెఫీ గదిలో నిలబడిఉన్నాడు. చేతులు వెనకకు గట్టిగా బిగించుకున్నాడు. పొడుగాటిటోపీ మెడమీద వడుతోంది. తల, మొహం నున్నగాగొరిగారు. అసలే చెవులు పెద్దవేమో, ఇప్పుడు ముందుకు పొడుచుకువచ్చినట్లున్నాయి. చెంపలు పచ్చబడి లోతుకుపోయాయి. దవడఎముకలు కొనతేలాయి. కళ్ళు విశాలంగా తెరుచుకుని లోతుకుపోయిఉన్నాయి. ఒకకన్నుకింద ఎర్రటి గాయపుచార కనిపిస్తోంది. ఎడమ చెంపమీదిగాయంనుంచి రక్తం బొట్లుబొట్లుగా కారుతోంది. రక్తపుచార చెంపలదగ్గర నుంచి మెడదాకా వ్యాపించి, అంగరఖాకాలరులోకి చొచ్చుకుపోయింది. అరెఫీ చిక్కి-శల్యమై పీనుగలాగా ఉన్నాడు.

"నన్ను యీ చెరసాలలో బంధిస్తావా?" అంటూ రాగాలుతీశాడు అరెఫీ. కళ్లు విపరీతంగా మెరిసిపోతున్నాయి." భగవంతుడిసేవలో నేను బాధపడుతున్నాను. అనంతకాలం బాధపడుతూనేవుంటాను. అయితేనేం, నేను మీవిగ్రహాలను నాశనంచేశాను. మీపూజాపీఠాలను నేలమట్టంచేశాను. నేలమట్టంచేశాను. నానోరు మీరు కట్టేయలేరు. మిమ్మల్ని తిట్టి

పోస్తూనేవుంటాను. పాపకర్ములారా! మీరు భగవంతుని సత్యస్వరూపం మర్చిపోయారు. చీకటిలో తడుముకుంటు న్నారు. చెడిపోయారు. శాపం, శాపం, శాపం! అంతేకాదు, మీరు యువకులఆత్మలను చెడగొట్టేస్తున్నారు. యిక మీకు విముక్తిలేదు. నాశనంఅయిపోయారు. నన్ను యింతగా హింసి స్తున్నారెందుకు? నన్ను చావగొడుతున్నారెందుకు? సత్యం కోసం, నాహృదయంలోనివసించే భగవంతుడికోసం..."

ఈవిధంగా అరెఫీ గర్జించాడు. స్వరం మళ్ళీ మంద్ర స్థాయికి చేరుకుంది. గుసగుసలుపోతున్నట్లుంది. దాంతో చలి జ్వరంలోలాగా పాల్ నిలువెల్లా వణికిపోయి, భయంతో వెన కడుగు వేశాడు.

"చావుకుసిద్ధంగావున్నారు. పాషండులారా! కీర్తి కాంతకోసం యెదురుచూస్తున్నాను. కటికవాళ్ళేరీ? శాపం! శాపం! శాపం?

పిచ్చిగా భయంకరంగానే కేకలు వేసేసరికి తలుపులు అల్లల్లాడిపోయాయి. తలుపులోనిగాజుపలక వణికిపోయింది.

"యిక చాలు. తొందరగా యింటికి వెళ్ళు. ఆలస్యం చేస్తే డాక్టరుగారు వస్తారు."

అరెఫీ కేకలు వింటూనే పాల్ ఏదో మైకంలో నడిచి బైటకు వెళ్ళాడు. అరెఫీ పెట్టిన శాపనార్థాలు అతని చెవులలో గింగురుమంటున్నాయి. గుసగుసలు మారుమోగుతున్నాయి. అరెఫీకోల మొహం బ్రహ్మాండమంతగా కనిపించసాగింది. కళ్ళు సూర్యుడంతగా పెరిగిపోయినట్టు, అంతకాంతితోనూ వెలు గొందుతున్నట్లు అనిపించింది. ఆ కంటివెలుగులో ఉత్సాహం

లేదు. చింత కానవచ్చింది. ఇంతలో హఠాత్తుగా ఆ మొహం చిన్న చిన్న మొహాలు అనేకంగా విడిపోయింది. ఆ చిన్న చిన్న మొహాలు వేలకువేల నిశితదృష్టులుగా అతనిహృదయంలోకి చొచ్చుకుపోయి నిరాశానిస్పృహలను పాదు కొల్పాయి.

గతంలో అరెఫీతో గడిపిన వృత్తాంతాలు – ఆరోగ్యంగా, గడ్డంపెరిగి, హూనంగా ఉన్న నాటి–చిత్రాలు అతనికళ్ళముందు తారాడజొచ్చాయి. ఈ చిత్రాలు అతనికళ్ళముందు తారాడేవి, మరుక్షణంలో మాయమయేవి. కొత్తచిత్రాలు పొడగట్టేవి. అవీ మాయమయేవి. ఆ పిల్లనాడిమనసు సుడిగుండంలో చిక్కుకుంది. గతం మెరుపులా అతనికళ్ళముందు మెరిసేది. ఆతర్వాత హఠాత్తుగా అతను అంధకారంలోపడిపోయేవాడు. ఏమీ పాలుపోయేదికాదు. చిత్రాలు కనపడేవికావు. మళ్ళీ గతవృత్తాంతాలు ఒకవరుసక్రమంఅంటూ లేకుండా అతని ముందు దూసుకుపోయేవి. అవి జ్ఞాపకంవచ్చినపుడు విచారం, బాధ కలిగేవి. అరెఫీమీద జాలీ, తననుగురించిన భయం, ఇంకా అనేక అవ్యక్తభావాలు ఒకదానితర్వాతఒకటి అతని మనసును ఆక్రమించేవి. కలిసిపోయి ఒకేఒకరాతిబండగా ఏర్పడి, అతని తలను, బుజాలను, వక్షాన్ని అణచివేసినట్టు అనిపించేది.

ఎదురుగా నది. చలిగాగాలి వీచింది. చీకటిముసుగులో గుసగుసలుపోతూ ఆ నది ఎక్కడికో పరుగత్తి కానరాకుండా పోతోంది. పైన ఆకాశం. ఆకాశంనిండా దట్టంగా మబ్బుతునకలు. ఆ మబ్బుతునకల మధ్యనుంచి రెండుమూడు చిన్నచిన్న

నక్షత్రాలు మినుకుమినుకుమంటున్నాయి. ఆకాశం—ఆకాశం అంతా పాతగిలిపోయి, చినిగి భూమిమీద కూలిపోవడానికి సిద్ధంగాఉందా అనిపిస్తోంది. నది ప్రశాంతంగా నిద్రిస్తూ కలలు కంటూంది. దానికెరటాలలో మబ్బుతునకలు, నక్షత్రాలు ప్రతిఫలిస్తున్నాయి. నదిఅవతల దిఙ్మండలంవరకు చీకటివ్యాపించి అతి ప్రశాంతంగా ఉంది.

పాల్ గుడిసెదగ్గరకు పరుగెత్తాడు. కాని గుడిసె తాళంవేసిఉంది. కాసేపు గుడిసెముందు కదలకుండా నిల బడ్డాడు. ఆతర్వాత చెట్లపక్కన వెల్లకిలాపడుకుని ఆకాశంలో మబ్బులు మెల్లమెల్లగా పారాడడం చూడసాగాడు. గాఢ నిద్రపట్టింది. నిద్రలో పీడకలలు!

# 5

వెన్నుపోటుతో పాల్‌కి నిద్రమెలకువవచ్చింది. ఒక్క క్షణం కళ్ళుతెరిచాడు. సూటిగా వచ్చి మొహంమీద పడు తున్న సూర్యకిరణాలబారినుంచి తప్పించుకోవడానికి మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు. ఆసమయంలో ఒక సుపరిచితమైన మొహం కనిపించింది.

తక్షణమే అంతా జ్ఞాపకంవచ్చింది

"యిక లే" అని ఒకయువతికంఠం ఖంగునమోగింది.

తొందరగా లేచాడు. మేర్యా అతనివంక జాలిగా పరీక్షగాచూస్తూ నిలబడిఉంది.

"మాయింటికి వచ్చేయ్. పాపం! యెక్కడపడినిద్ర పోయావో చూడు! రాత్రి మాయింటికి వచ్చేయకపోయావా

పాల్ జవాబు చెప్పలేదు. అతనికి మేర్యాఅంటే ఇష్టం లేదు. ఆమెవిగ్రహం బహు పెద్దది. బలమైంది. ఎప్పుడూ తిడు తూంటుంది. కళ్ళు బూడిదరంగు. బొంగురుగొంతు. ఈ కారణాలవల్ల మేర్యాఅంటే అసహ్యం. ఆమెచురుకుతనం, జాగరూకత, కజ్జాకోరుతనం అతనికి నచ్చలేదు.

ఇద్దరూ బయలుదేరారు.

"నువేం బెంగెట్టుకోవద్దు. అంతా సవ్యంగా జరిగిపోతుంది. భగవంతుడు, మంచివాళ్ళు నీకు సహాయంచేస్తారు. నీకేం పరవాలేదు కాని, జాగర్తగావుండు. సంగతిసందర్భాలు కనిపెడుతూవుండు. అర్థంచేసుకుంటూవుండు. చురుగ్గావుండు. బతకడం యెలానో నేర్చుకో. నేర్చుకోవడం కష్టమేననుకో! యెప్పటికపుడు యేమరుపాటులేకుండా బతకాలి. లేకపోతే నిన్ను తెలివితక్కువదద్దమ్మకింద కట్టేస్తారు. బహుశా యిదంతా నీ మంచికే వచ్చిందేమో! అరెఫీవల్ల నీకు వొరిగిందేవిఁటి? నిన్ను శ్రద్ధగాచూశాడా? కావలసినచదువు చెప్పాడా? బుర్రలో యింతకూరితే సరా! నువు చిన్నపిల్లవాడివిగదా! నిన్ను చిన్నపిల్లవాడిలాగానే చూడాలిగాని, పెద్దవాళ్ళనిచూసినట్లుచూస్తే యెలా? నిర్మొహమాటంగా చెప్పాలంటే, అరెఫీ పట్టి తెలివితక్కువదద్దమ్మ!

"బతుకుతెరువు చూసుకోవాలిగాని, వూరికే పుస్తకాలు తెగచదివితే యేంవస్తుంది? పుస్తకాలుచదవడం మహాగొప్పతెలివేం? నీబతుకు నువుబతుకుతూ యితర్లతో సాధిగా బతకాలి. బాగా బలం సంపాదించుకో; గౌరవం సంపాదించుకో.

యివి నీపుస్తకాలకంటె యెక్కువనుకో. పధ్నాలుగుసంవత్స రాలు పోలీసుపని చేశాడుగదా, యేంవొరగబెట్టాడు!"

ఇదంతా వింటూంటే పాల్‌కి కోపంవచ్చింది. మేర్యా మెట్ట వేదాంతానికి అసమ్మతిసూచకంగా గొణిగాడు. కాని, అరెకీని తిట్టిపోస్తూ 'వట్టి తెలివితక్కువదద్దమ్మ' అనేసరికి ఉండ బట్టలేక ధైర్యంగా ఇక కట్టిపెట్టమని చెప్తున్నట్టు ఆమె దుస్తులుపట్టుకుని గుంజాడు.

కాని ఆమెవాగ్ధోరణి ఆగితేనా! ఇదేమాత్రం గమనించ కుండా ఆవేశంతో,

"యెవర్నీ నమ్మద్దు. నిన్ను బుజ్జగించారా, అదంతా కపటమనుకో. నిన్ను పొగిడారా అదీ కపటమేననుకో. నిన్ను తిట్టేమాత్రం యేదో మోతాదుయెక్కువైనా, కపటం కాద నుకో. ముఖ్యమైనవిషయం యేమిటంటే ప్రతివాడితోను జాగ ర్తగా మెలగాలి. యెవరితోనైనా వ్యవహరించేముందు కాస్త ఆగి 'మనదగ్గిర్నించి యేం గుంజాలని చూస్తున్నాడు?' అని ఆలోచించు. యేమీ లేదనుకుంటే వ్యవహారంసాగించు. కాని అప్పుడైనా బహుజాగర్తగా వ్యవహరించాలి. నీబుద్ధిని యెన్నడూ నమ్మకు. కొత్తవాళ్ళని అనుమానించినట్టే నీబుద్ధినీ అనుమానించాలి. మనిషి తనమంచేమిటో తనంతటతాను తెలుసుకోలేడు 'యిలా' అనుకుంటాడు. కాని గురితప్పిపోతుంది. యింకేంవుంది, చిక్కుల్లో పడిపోతాడు!"

ఆమెవాదనలో ఆమెకే ఆసక్తికలిగి మేర్యా ఎవరితో తాను మాటాడుతున్నదీ మరచిపోయి, సవివరంగా విషయాలు చర్చించసాగింది. హఠాత్తుగా అంది.

"ఆడవాళ్ళవిషయంలో మరీ జాగ్రత్తగావుండు"

ఇలా చెపుతూ యాదృచ్ఛికంగా తనమాటలు వింటున్న పాల్ కేసి చూసింది. మగవాడిలాగా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళుతూంటే ఆమెతోపాటు నడవలేక పాల్ ఆమె పక్కన కదంతొక్కుతున్నాడు. ఎర్రటిచొక్కా, బోసికాళ్లు, స్ఫోటకంమచ్చల మొహం, నిద్రకళ్లు, చెదిరిపోయినజుట్టు, ఆమెవిగ్రహాంముందు పాల్ విగ్రహాం ఎందుకూ కొరగానిదిగా ఉంది.

కేకరింత విపరీతంగా రావడంవల్ల ఆమెఉపన్యాసధోరణి కట్టుపడింది. ఇంటిదోవలో పాల్ తో మరిమాటాడలేదు.

తాణాభవనంనడవలోకి చేరుకునేసరికి మైఖేల్ కుండపట్టుకుని వారికి ఎదురుగా వచ్చాడు.

"ఓ—వచ్చారా! బలే! భోజనాలవేళ అయింది. మేర్యా! యెక్కడికి వెళ్ళావ్" అని అడిగి పాల్ కేసి తిరిగి, "యెక్కడ నిద్రపోయావ్?" అని ప్రశ్నించాడు.

"అక్కడ...గుడిసెదగ్గర."

"అరె!" అన్నాడు మైఖేల్ ఆలోచనాపూర్వకంగా, వారివెనకనే గదిలోకి వెళుతూ.

మేర్యా కోటుతీసి వేసి స్టవ్ లో పొడుస్తోంది.

"యిదిగో, తాజా జున్ను. యెక్కడ పెట్టను?"

"యెక్కడిది?" అని మేర్యా మొహం చాటంతచేసుకుని అడిగింది. భర్తచేతిలోనుంచి కుండతీసుకుని వాసనచూసి, "బలే! తాజా జున్ను!" అంది.

"ఎవరో బీదరైతుఒకడు బహుమతిగా యిచ్చాడు

వుపకారంచెయ్యమని—" అంటూ వివరించి భార్యకేసి చూసి టక్కుగా కన్నుగీటి, లొట్టలు వేశాడు.

"ఓ–దిష్టిపెడతా!" అంటూ ప్రేమతో మేర్యా భర్త మెడమీద గిల్లింది.

"యేమిటీ ఆగడం! సరేగాని యింకా వుంది. యిక భోజనానికి లేద్దాం. నాకు కడుపునిండా తిండిపెట్టావా చెపుతా."

"సరే, రండి" అంటూ ఇచ్చకాలు మొదలుపెట్టింది మేర్యా, జిజ్ఞాసతో.

మైఖేల్ జేబులోచేయిపెట్టి చిల్లరడబ్బులు గలగల లాడించాడు. నిగనిగలాడే మొహంలో గాంభీర్యం వెల్లి విరిసింది.

"యెంత?" అని మేర్యా సంతోషంతో చెవిలో అడిగింది.

"ఒకటిన్నరరూబుళ్ళు, అయిదు కోపెక్కులు, బుట్టెడు దోసకాయలు!"

"ఓష్ యింతేనా?" అంటూ రాగాలుతీసింది మేర్యా ఆశాభంగంతో. "బుధవారంనాడు ఇంకా యెక్కువ తెస్తివే!"

"సరే. ఆరోజు బుధవారం. యివాళ శుక్రవారం. సంతమీద సంత! కొత్తసార్జెంటు కోర్పెంకోనా కేసి యివాళ అనుమానంతో చూశాడు. వాడిదుంపతెగ! ఆ యిటుకకొట్టు దాన్ని పెళ్ళిచేసుకున్నాడు. యింకేం, కావలసినంతడబ్బు! యిపుడు హఠాత్తుగా మడికట్టుకున్నాడు. నేను అలాంటిపెళ్ళి చేసుకుంటే బాగుండిపోయేది!"

"ఓరి కుక్కలకొడకా! నీకు యీ యినపకొరడాతో పెళ్ళిచేస్తానుండు!"

ఆ భార్యాభర్తలు ఇలా మాట్లాడుకుంటూంటే పాల్ గుమ్మంలోనిలబడి వారిని కనిపెట్టిచూశాడు. వారికి తనజోలే పట్టనట్లు అనిపించింది. ముందుముందు తనపాట్లుఎలాఉంటాయో ఊహించుకోవాలని యత్నించాడు గాని, లాభంలేకపోయింది.

భార్యాభర్తలసరసాలకు అడ్డుతగిలి "మనం తొందర్లోనే అక్కడికి వెళతామా?" అని అడిగాడు.

"యెక్కడికి? యెక్కడికి?" అని మైఖేల్ అడిగాడు పాల్ కేసి తిరిగి.

"ఆసుపత్రికి."

"అక్కడికివెళ్ళడం దేనికి? నీ కేమయినా మతిపో యిందా? ఆ బల్ల చెక్కమీద కూర్చో. కాస్సేపటిలో భోజ నాలుచేద్దాం. మా పిల్లకాయలు బళ్ళోనించి ఇప్పుడే వస్తారు. వాళ్ళతో బయట ఆడుకుందువుగాని!"

పాల్ బల్ల చెక్కమీద కూర్చున్నాడు. విచారం ముంచెత్తింది. చుట్టూ ఏంజరుగుతున్నదీ వినిపించడంలేదు, కనిపించడంలేదు. భోజనానికి లెమ్మన్నారు. వెళ్ళి బల్లముందు కూర్చున్నాడుగాని తినలేకపోయాడు. చెంచా బల్లమీద పెట్టేశాడు.

"యేమిటిది?" అని మేర్యా అడిగింది కఠినంగా.

"నాకు తినాలనిలేదు" అని పాల్ తొణకకుండా జవా బిచ్చాడు.

ఆ భార్యాభర్తలు ఒకరితర్వాతఒకరు ఉపన్యాసం

దించారు. అయితే గుమగుమలు. బొచ్చెడు కాబేజిపులుసూ ఖాళీచేయడానికి ఈ ఊపన్యాసాలు అడ్డురాలేదు.

"శాపం!" ఈ మాట పాల్ చెవులలో సుత్తిదెబ్బల లాగా మోరెత్తింది.

"శాపం!" అనుకున్నాడు మెల్లగా. అరెఫీ తొస్సు బుగ్గల వెర్రిమొహం ఊహించుకున్నాడు. పాల్ పెదవులు కదిలాయి. మనిషి వణికిపోయాడు. మొహంలో నెత్తురుచుక్క లేకుండాపోయింది. క్షణంలో మళ్లీ ఉష్ణకెరటంగా చర్రున వచ్చిపడింది. ఒకమాటు పాలిపోవడం, ఒకమాటు ఎర్రబడడం! చెంపలమీంది, నుదురుమీంది స్ఫోటకంమచ్చలు ఎర్రటి మచ్చలులాగా తయారయాయి.

"యేవిటాగొనుగుడు? నక్కవెధవ!" అంటూ మైఖేల్ అరిచాడు.

"సరే. నేను వెళుతున్నా" అంటూ పాల్ లేచాడు.

"ఎక్కడికి?" అని మేర్యా నిగ్గదీసి అడిగింది.

"గుడిసెకు."

"అక్కడికెందుకు? యిపుడు అక్కడ యింకోపోలీసు వుంటున్నాడు. నిన్నెరగడు. తరిమేస్తాడు. కూర్చుని జాగర్తగా మసలుకో!"

పాల్ కూర్చున్నాడు. మైఖేల్ తెరవెనకకు వెళ్ళి పక్కమీంద వాలాడు. వాలేసరికి మంచం గీచుకుని ఏడ్చినట్లు చప్పుడైంది.

"పక్షుల్ని యేంజేశారు?" అని ఒకక్షణంతర్వాత పాల్ ప్రశ్నించాడు.

తెర వెనకనుంచే మైఖేల్, "అన్నిటినీ వదిలిపెట్టేశాను. నీ సామానంతా యిక్కడికి తీసుకువచ్చాను." అని జవాబిచ్చి మత్తుగా ఆవలించాడు. "ఉహుఁ. అక్కడ యిక నువ్వు వుండడానికి వీల్లేదు."

"పెట్టె యెక్కడపెట్టారు?" అని పాల్ మళ్ళీ అడిగాడు ఒక్కక్షణంతర్వాత.

అప్పటికే మైఖేల్ గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. మేర్యా కిటికీదగ్గరకూర్చుని ఏదో కుట్టుతోంది. ఎవరూ పాల్ ప్రశ్నకు జవాబీయలేదు. పాల్ ఒకమూలకువెళ్ళి పడకబల్లమీద ముడుచుకుని పడుకున్నాడు.

"యిక నా గతేమిటి?" అని ఆలోచించసాగాడు పాల్.

అతనికళ్ళముందు నది, దానిమీద తేలియాడే పుడకలు గోచరించాయి. వాటిలో కొన్ని ఒడ్డుకు కొట్టుకువచ్చాయి. వాటిని తిరిగీ తాను నదిలోకి విసరడం జ్ఞాపకంవచ్చింది. ప్రవాహంవెంటే పోకుండా ఒడ్డుకు పుడకలు రావడం పాల్‌కి ఇష్టం లేదు. నదిచివరికంటా పుడకలువెళ్ళాలని అతనికోరిక.

నది ఎక్కడికి వెళుతోంది? ఇంకోనదిలోకలిసి వెళ్ళి సముద్రంలోపడుతోంది. ఈవిషయం అరెఫీ చెప్పాడు. సముద్రంలో ఇంతా అంతానీరు గాదు. ఒడ్డంటూ కనిపించదు. ఒక రోజుగాదు, రెండురోజులుగాదు. రోజులకురోజులు ప్రయాణం చేసినా అంతుఉండదు. ఈవిషయం నిజమేనా? లేక అది అరెఫీ ఊహా? పాపం! అరెఫీకి పిచ్చెత్తింది! ఎప్పుడూ పిచ్చిఉండేదా?

పాల్ ఆ మూల ఇలా కూర్చుని అరెఫీనిగురించి, సము

ప్రసంగించింది ఆలోచించాడు. కాని ఆ ఆలోచనాపరంపర చివ రికి 'రేపు నా గతి యేంకాను?' అనే ప్రశ్నగా పరిణమించేది.

గుసగుసలు వినిపించి అతనిఆలోచనలకు అంతరాయం కలిగింది. అతను నిద్రపోతున్నాడనుకుని తెరవెనక ఆ భార్యా భర్తలు అతనివిషయం మాట్లాడుకుంటున్నారు.

"పెట్టె యెక్కడుందని అడిగాడు" అంది మేర్యా.

"యేమిటీ?" అని మైఖేల్ అడిగాడు బెదిరిపోతూ.

"పెట్టె యెక్కడుంది అని అడిగాడు!"

"దెయ్యపువెధవ" అన్నాడు మైఖేల్ ఆశ్చర్యంతో మెల్లగా. మనం తొందరగా వాడిని సావెలిచ్‌దగ్గరికి తీసుకు వెళ్ళడం మంచిది. పెట్టెలో డబ్బుందని వాడికి తెలుసునని స్పష్టమవుతూంది. మేర్యా! రేపు తీసుకువెళ్లు!"

"ఆఁ–వాడిమొహం! రేపు! మహా తొందరపడుతు న్నాడు. బెదిరిపోయాడు. నీ కంత భయమెందుకు?"

"అందుకే. పెట్టెయేదీ, డబ్బుయేదీ అని హఠాత్తుగా అడిగాడనుకో. ఊఁ–అపుడు యేం జవాబు చెబుతావ్?"

"తెలివితక్కువదద్దమ్మ!" అంటూ మేర్యా వికటంగా దీర్ఘాలుతీసింది. ఆ తర్వాత మరి పాల్‌కి వారిగుసగుసలు విని పించలేదు.

ఈ సంభాషణవల్ల పాల్ మనసులో నూతనభావలేవీ రేకెత్తలేదు. తన డబ్బు కాజేయాలనిచూస్తున్నదని అర్థమైంది. కాని ఈ విషయం పట్టించుకోలేదు. అతనికి డబ్బుమహిమ తెలియదు. అంతేగాదు, అరెఫీదురవస్తనుగురించి రేపటిగతిని గురించి తప్ప ఇంకోవిషయంమీాద ఆలోచనపోవడంలేదు.

అతనికి మేర్యా, మైఖేల్ అంటే ఎన్నడూ ఇష్టంలేదు. ఇవాళ అయిష్టత మరింత పెరిగింది. వారికి తనంటే ఇష్టంలేదనీ, తనతో వారికి అగత్యంలేదనీ తేలిపోయింది. ఇక వారితో ఒట్టే అట్టేకాలం ఉండడం పడదు. వారిమధ్య ఇంకొక్క రోజయినా గడపలేనని నిశ్చయించుకున్నాడు.

గురకపెట్టడంలో ఒకరితోఒకరు పోటీపడుతున్న ఆ దంపతులంటే అయిష్టత, వారు మెలకువగాఉన్నప్పటికంటె ఎక్కువైంది. మాల అటూఇటూ ఊగుతూ కూర్చున్నాడు. 'రేపు మనగతేమిటి?' అనే ఆలోచననుంచి తప్పించుకోలేక పోతున్నాడు. రేపు ఏంజరుగుతుందో తెలియదు.

తెరవెనకనుంచి ఆవలింతలు మూలుగులు వినిపించాయి. మైఖేల్ తడబడుతూ ఇవతలికి వచ్చాడు. జుట్టు చిందరవందరగా ఉంది. నిద్రమత్తుతో మొహంపీక్కుపోయింది.

పాల్ కేసి తిరిగి, "నిద్రా?" అని మైఖేల్ అడిగాడు.

"ఊహుం—లేదు. నిద్రపోవడంలేదు"

"మాపిల్లలు వచ్చారా?"

"రాలేదు!"

"లేదు, లేదు — యిదేనా జవాబు! బహుశా వాళ్ళు పిన్నిగారింటికి వెళ్ళివుంటారనుకుంటాను. టీపాయి పెలిగించే వేళయింది. గస్తీకి తొందరగా వెళ్ళాలి."

ఇలా అని మైఖేల్ నడవలోకి వెళ్ళాడు. మేర్యా మెల్లగా పక్కమీదనుంచి లేచింది. పాల్ కేసి తేరిపారచూసి తలదువ్వుకోనారంభించింది. 'వత్తుజుట్టు. బాదంరంగు, నక్క-

వెం(టుకకూడా నెరవలేదు, మంచియవ్వనంలో వుంది' అను కున్నాడు పాల్. అరెషీజుట్టు ముగ్గుబుట్ట అయిపోయింది!

"సరేగాని. పాల్! యేమిటి ఆలోచిస్తున్నావ్? ఇక బతుకు యెలా వెళ్ళబుచ్చుదామనుకుంటున్నావ్?" అని మేర్యా హఠాత్తుగా అతనికేసి తిరిగి అడిగింది. దువ్వెన జుట్టుగుండా జారకుండా ఊడపీకుతోంది. మేర్యా మొహంచిట్లించింది.

"నాకేం తెలీదు" అంటూ పాల్ తల ఆడించాడు.

"అ-లా-గా!" అంటూ దీర్ఘాలుతీసింది మేర్యా. "నీకు కాకపోతే యెవరికి తెలుస్తుంది? నిద్రమత్తుమొహమా!"

ఆమె నిట్టూర్చి మరి మాటాడలేదు. పాల్ కూడా ఏమీ మాటాడలేదు. మైఖేల్ టీపాయి లోపలికి తీసుకువచ్చేవరకు ఇద్దరూ మౌనంవదలలేదు. మేజాబల్లముందు కూర్చుని మాటాడుకోకుండా టీతాగారు.

"సరేగాని అబ్బాయ్!" అంటూ ప్రారంభించింది మేర్యా మూడోసారి కప్పులో టీపోసుకుంటూ. వేడివేడి టీ తాగేసరికి ఆమెకి ముచ్చెమటలు పట్టాయి. జాకెట్టుపైగుండీలు రెండూ తీసివేసుకుంది.

"నే చెప్పబోయేది జాగ్రత్తగా విని, బాగా గ్న్యాపకం పెట్టుకో!" అంది గంభీరంగా. భావగర్భితంగా ఒక్కనిమిషం ఆగి, మళ్ళీ మొదలుపెట్టింది—"రేపు నిన్ను చెప్పాలుకుట్టే ఒకతనిదగ్గరికి తీసుకెళతాను. అతణ్ని నేను బాగా యెరుగున్నా. అతడిదగ్గిర పనినేర్చుకో. మంచిగావుంటూ, అల్లరిచిల్లరగా తిరక్కుండా పనినేర్చుకో. యజమానికి, పనివాళ్ళకి అణకువగాఉండు. అపుడు నువు మొగాడివిగా యెలాబతకాలో తెలు

స్తుంది. మొదట్లో పని కొంచెం కష్టంగా సేవుంటుందనుకో. కాని ఓర్పువహించి వుండు. అదే అలవాటయిపోతుంది. వాళ్ళకి మాత్రం నీఅంతఅప్పుడు తేలిగ్గావుంది! యిక శెలవుదినాల్లో మాయింటికి వస్తూవుండు. మేమే చుట్టాలం, ఆప్తులం అనుకో. వచ్చి మాతో కలిసి తాగు, తిను. ఓ-సువ్వెప్పుడు వచ్చినాసరే, సంతోషంగా నిన్ను ఆదరిస్తాం. తెలిసిందా?"

పాల్‌కి అర్థమయింది. అర్థమయినట్లు తలపంకించాడు.

"నీవిషయంలో శ్రద్ధతీసుకున్న వాళ్ళని మరవవద్దు. అంటే మమ్మల్ని మరవవద్దు. మేమూ నిన్ను మరిచిపోం!" అన్నాడు మైఖేల్ పాఠంవివరించి చెప్తున్నట్లు. దీనిమీద పాల్ భావాలు కనిపెట్టాలనే ఉద్దేశంతో ఓరకంటితో చూశాడు.

"యెందుకు మరిచిపోకూడదు?" అని అడగదలచినట్లు పాల్ కళ్ళుపైకెత్తాడు. కాని, అడగకుండా యెక్కడో చూడ సాగాడు.

ఆశాభంగంతో మైఖేల్ నిట్టూర్చి, ఉద్రేకంతో సాసరు లోని వేడివేడి టీ ఊదసాగాడు.

మళ్ళీ నిశ్శబ్దం రాజ్యమేలింది. పాల్ ఆ దంపతులను క్రీగంటచూసి, వారిని కాస్త ఏడిపించాలని తలపోశాడు. ఏడి పించడానికి తనకు హక్కు ఉందనికూడా భావించాడు. మొదట ఏమీ పాలుపోలేదు. తర్వాత తర్వాత జ్ఞాపకంవచ్చింది.

"పెట్టె యెక్కడుంది?" అని హఠాత్తుగా అడిగాడు.

ఆ దంపతులు ఒకరిమొహంఒకరు చూసుకున్నారు.

"నాదగ్గిర వుంది. దాన్నిగురించి పెద్దగా గొడవపడ

సక్కర్లేదు యిక్కడ భద్రంగా వుంటుంది. నువు పెరిగిపెద్ద వాడివయినతర్వాత వచ్చి, 'నాపెట్టె నాకిచ్చేయ్'అని అడుగు. వెంటనే యిచ్చేస్తాను. 'పాల్, యిదిగో నీ పెట్టె. మేం తాకి కూడా యెరగం' అని చెప్పి మరీ యిస్తాను. అందులో ఇంతకీ యేం వున్నాయి, నీ పట్లాంలు, చొక్కాలేగా; వాటిని నీతో కూడా తీసుకుపో."

ఇలా ప్రసంగించి మైఖేల్ గాఢంగా నిట్టూర్చాడు. నున్నటిమొహంలో విచారం, భయం ద్యోతకమయ్యాయి.

మేర్యా మాటాడకుండా పాల్ని పరీక్షగా చూడ సాగింది.

"కాని అందులో డబ్బుంది. డబ్బేంజేశారు?"అన్నాడు పాల్ మెల్లగా.

"డబ్బు!" అన్నాడు మైఖేల్ ఆశ్చర్యంవెలిబుచ్చుతూ. మేర్యావంక తిరిగి అన్నాడు.

"యేమే, అందులో డబ్బు యేమన్నా వుందా? పెట్టెలో డబ్బుందా? యేమోనబ్బా! నీపెట్టెలో నాకు డబ్బేమీ కనిపించలేదు. ఊహుం—కనిపించలేదు, భగవత్సాక్షిగా!"

"యెందుకూ వొట్లు వేసుకోవడం? నువేమయినా అబద్ధా లాడుతున్నావన్నాడా? నీకు కనిపించలేదంటే కనిపించలేదు' అంతే. యీ మాత్రానికి వొట్టేసుకోవడమేమిటి?"

"భగవంతుడిని సాక్ష్యంవేసుకున్నాను, అంతే! అదేం పాపమా? పవిత్రగ్రంథంలో యేంచెప్పివుంది. 'వూరికే భగ వంతుడిమీద ప్రమాణంచెయ్యవద్దు'అని వుంది. నేను వూరికే

భగవత్సాక్షిగా అన్నానా? నే చెప్పింది బలపర్చుకోవడానికి అన్నాను. అంతే!"

పాల్ వారిద్దరినీ కనిపెట్టిచూశాడు. తన ప్రశ్నలకు మైఖేల్ కలవరపడి ఆచిక్కులోనుండి తప్పించుకోవడం ఎలాగో తెలియక కొట్టుమిట్టాడుతున్నాడని గ్రహించాడు. మేర్యా ఏమాత్రం తనకు ఆసక్తి లేనట్టు వ్యవహరించింది. దానితో పాల్ మండిపోయి,

"అందులో పదిహేడు రూబుళ్ళు ఉండాలి. మీదగ్గిర ముప్ఫయిఅయిదు రూబుళ్ళు వుండాలి. తెలిసిందా? అరెఫీ మామయ్య నా కీసంగతి చెప్పాడు. చెప్పికూడా ఆట్టేరోజులు కాలేదు."

ఆ దంపతులిద్దరూ విరగబడినవ్వసాగారు. పాల్‌కి అమిత ఆశ్చర్యం వేసింది. మేర్యా తల వెనకకు వంచింది. వక్షస్థలం ముందుకుసాచి మగవాడిలా విరగబడినవ్వుతూ వణికిపోయింది. మైఖేల్ నవ్వీనవ్వీ ఉక్కిరిబిక్కిరయాడు.

పాల్‌కి ఇదేమీ అర్థంకాలేదు. వారికేసిచూసి, వారితో పాటు నవ్వడమా మానడమా అని తటపటాయిస్తూ చిరునవ్వు నవ్వాడు.

"భలే! అరెఫీ భలేవాడు. ముప్ఫయిఅయిదు రూబుళ్ళు బలే బావుంది!"

"పిచ్చినాయనా! అరెఫీ చెప్పడం, నువు నమ్మడం! బలే! భేష్! పిచ్చినాయనా!"అరెఫీకి మతిపోయింది. తెలుసా?" అంది మేర్యా నవ్వు తెరలనుంచి తట్టుకుని వేళాకోళంగా.

వారినవ్వులోని అంతరార్థం అప్పటికి పాల్‌కి బోధ

పడింది. గట్టిగా నిశ్వసించి, కోపంతో వణికిపోతూ వారి మొహంమీదనే "అబ్బాయి! మీరిద్దరూ అబద్ధాలాడుతు న్నారు. లోపలపడుకుని మీరు మాటాడుకోవడం నేను వినలే దనుకున్నారా? అంతా విన్నాను. మీరు వచ్చిదొంగలు! మీ దంపతులిద్దరూ వచ్చిదొంగలు! అదీ అసలువిషయం! మీరు దొంగలు! దొంగలు!" తన మాటలను బలపర్చుకోవడానికా అన్నట్లు మేజాను ఒక్కతన్ను తన్నాడు.

మైఖేల్ తుళ్ళిపడ్డాడు. భయంవేసింది. మేర్యాకేసి గుడ్లప్పగించి చూశాడు. మేజాబల్లమీాద చేతులుపెట్టి, ఊపిరి బిగపట్టుకు కూర్చున్నాడు. కాని, మేర్యా వట్టి తెలివితక్కువ మొద్దుకాదని రుజువుచేసుకుంది.

"అద్గదీ!" అని అరిచింది. భయపడిపోయినదానిలా నటిస్తూ, ఆసనంలోనుంచి దిగ్గున లేచింది. ఇక పాల్ కేకలు పెట్టడంమూలంగా అలిసిపోయి ఆందోళనపడుతూ కూర్చు న్నాడు. కళ్లు కోపంతో చింతనిప్పులులాగా వెలిగిపోతున్నాయి.

"అరి దేవుడా! మైఖేల్! పరుగెత్తుకువెళ్ళి డాక్టర్ని తీసు కురా. ఊఁ— పరుగెత్తుకువెళ్ళు! వీడికీ పిచ్చెత్తింది! కళ్ళు యెలా మండిపోతున్నాయో చూడు! చూడు! అరి దేవుడా! గోరుచుట్టు మీాద రోకటిపోటు! పాపం! యేం పాపంచేశాడో, యిలా అనుభవిస్తున్నాడు! అరెస్టీకి పిచ్చెత్తడం భరించలేకపోయాడు. పిచ్చెత్తింది! పిచ్చెత్తింది!

ఇంత ఆందోళనలోకూడా పాల్ తనను వారు వట్టి తెలివితక్కువదద్దమ్మను చేశారని గ్రహించాడు. కోపంతో,

విచారంతో కన్నీళ్ళు పెట్టుకున్నాడు. జీవితంతో, ఈ జనంతో తను వేగలేనని గుర్తించాడు.

ఈ ప్రపంచంలో ఒంటరిగా జీవించడానికి మొదలుపెట్టిన మొదటిరోజు మొదటికన్నీరు!

బెదిరించారేగాని డాక్టరును పిలుచుకురాలేదు. నిద్ర పట్టేవరకు అతిశ్రద్ధ తీసుకున్నారు. పగలు ఎక్కువసేపు గడిపిన ఆ పక్కమీదే పడుకోబెట్టి నిద్రపుచ్చారు. నిద్రపడుతూ పడుతూఉండగా మేర్యా భర్తతో మెల్లగా,

"యీపిల్లవాడు తెలివితక్కువవద్దమ్మోంకాదు. నాలుక మహాచురుకు. అదీ వాకందుకు మంచిదే. చురుకునాలుకవాళ్లు చక్కగా బతకగలరు!"

నిద్రలో పాల్‌కి రాక్షసాకారాలు అనేకం కనిపించాయి. వాటిలోకొన్ని బ్రహ్మాండమయినవి. వికారమయినవి. కొన్ని చిన్నవి. అవి అతనిచుట్టూ ప్రదక్షిణంచేస్తూ పళ్లుపట పటాకొరుకుతూ వికటంగానవ్వాయి. వాటినవ్వుకు చుట్టు పట్లంతా ఊగిపోయింది. పాల్‌కూడా వణికిపోయాడు. ఆకాశానికిబదులు నల్లటిశూన్యం బ్రహ్మాండంగా పైన కనిపించింది. ఆ శూన్యంలోనుంచే ఆ రాక్షసాకారాలు గుంపులుగుంపులుగా ఒక్కొక్కటిగా కిందకి దిగాయి. ఆ దృశ్యం మహా భయంకరంగానూ ఉంది. వేడుకగానూ ఉంది.

ఉదయాన్నే పాల్‌ని నిద్రలేపి టీ ఇచ్చి, చెప్పులుకుట్టే వానిదగ్గరకు తీసుకువెళ్ళారు. పాల్‌మాత్రం ఉత్సాహంగా లేడు. ముందుముందు జీవితం బాగుపడుతుందనేఆశ కలగలేదు. నిజానికి ఈవిషయంలో అతను పొరబడలేదు.

వెళ్ళివెళ్ళి ఒక లోతట్టుగదికి చేరుకున్నారు. ఆ గది చీకటిచీకటిగా ఉంది. నలుగురుమనుషులు పాటపాడుతూ సుత్తులతో కొడుతున్నారు. పాల్ భుజంపట్టుకుని మేర్యా ఒకపొట్టివానితో మాటాడింది. అతను అటూఇటూ ఊగుతూ,

"ఓ, యిది స్వర్గమేననుకో. యిది మానవులనివాసం కాదు; దేవతలనివాసం! యిక ఆహారమా, ఓ! అడిగావూ, దివ్యంగా వుంటుంది! యే లోపమూ జరగదనుకో! యిక శెలవు."

మేర్యా వెళ్ళిపోయింది. పాల్ నేలమీద కూర్చుని బూట్లువిప్పుకుంటున్నాడు. బూటులో ఏదో పడి గుచ్చుకుంటోంది. ఇంతలో వీపుకువచ్చి ఏదో తగిలింది. వెనకకుతిరిగి చూశాడు. నేలమీద పాతబూటుమడమ కనిపించింది. గుమ్మంలో అతనిఈడుపిల్లవాడొకడు నాలుకజాపిపాడుస్నంటూ,

"చప్పిడిముక్కు చవటముక్కు
గంట్లుపడ్డా గండుమొహాము
నిన్ను నక్కా లెత్తుకొనిపోను! ఓ
సడ్డిముక్కు మడ్డిమొహాము
నిన్ను దెయ్య మెత్తుకొనిపోను!"

అని పాడసాగాడు.

పాల్ చర్రునతిరిగి నిట్టూర్చి బూటుఊడదీసుకున్నాడు.

"యిలా రా భాయీ!" అని కేకవేశాడు ఎత్తుతక్కువ తొట్టిమీద కూర్చున్నమనిషి.

పాల్ ధైర్యంగా అతనిదగ్గరకు వెళ్ళాడు.

"యిది పుచ్చుకో!" అంటూ ఆమనిషి పాల్ చేతికి

తాడు, మైనం పూసినచర్మంచివర అందించాడు. "యీవిధంగా మెలిపెట్టు, గట్టిగా మెలిపెట్టు."

ఆ దుకాణం లోపలిభాగం దీనంగా చూస్తూ [illegible] ఆ మనిషి చెప్పినరీతిగా మెలిపెట్టాడు. ఆ దుకాణంయొక్క యజమాని మిరాన్‌టొపొకోవ్–బొద్దుపాటిమనిషి. కళ్ళు పందికళ్ళలాగా బహుచిన్నవి. పెద్ద బట్టతల.

కాని అతను చెడ్డవాడుగాడు. సౌమ్యుడు. జీతాన్ని ఒక తమాషాగా పరిగణించేవాడు. ఎప్పుడూ తాగితూలాడుతుండేవాడు. ఎంత పెద్దతప్పు చేసినా, క్షమించగలిగేతత్వం గలవాడు. ఒకప్పుడు మతగ్రంథాలు చాలా చదివాడు. అతని మాటలలోనే ఆవిషయం ద్యోతకమవుతూంటుంది. ఇక ఇప్పుడో సారాబుడ్డిమీదిచీటీ తప్పితే మరేం చదవడు. తాగిఉన్నపుడు ఎంతైనా సహాయంచేసేవాడు. తెలివిగా ఉన్నప్పుడుమాత్రం నిక్కచ్చిగాఉండేవాడు. ఎన్నడూ [illegible]ని వారలకు అసంతృప్తికలిగించలేదు. తాగుడుమీది మోజు ఎక్కువ అయి, దుకాణంలో కూర్చోవడంలేదు.

అందుచేత దుకాణంబాధ్యత అంతా యాట్కిన్‌తాత భుజాలమీద పడింది. యాట్కిన్‌తాత పాతసిపాయి. కోయ్యకాలు. మాటలలో నడతలో నిజాయితీమనిషి. వినయవిధేయతలవిషయంలో క్రమపద్ధతివిషయంలో నిక్కచ్చిమనిషి.

యాట్కిన్‌తాత గాక ఇంకా ఇద్దరు సహాయకులున్నారు. ఒకతనిపేరు నిడాంకర్ మిలోవ్. రెండవఅతను గోల్యా షిష్కిన్. మొదటివానిజుట్టు నిప్పుఎరుపు, దుందుడుకుసంగీతం అంటే మహాఇష్టం. తాగుడంటే ఇంకా ఇష్టం. కుటుంబవ్యవహారాల

కళ్ళు వంచి, కనుబొమలు ముడిస్తే తనమొహం అమిత అందంగా ఉంటుందని అతనికి తెలుసు.

ఇక రెండవవానిమొహంలో కళాకాంతులు లేవు. ఎప్పుడూ కుంగిపోయినట్లు, రోగంతో బాధపడుతున్నట్లు ఉంటాడు. గుణం మంచిదికాదు. మెల్లగా బుజ్జగిస్తూ చెవిలో ఏదైనా చెప్పాడో అవతలవాడిని లోబర్చుకున్నాడన్నమాటే. వెంటనే ఏదో కొంటెపనిచేసి అతనిని చిన్నపుచ్చేవాడు. పని నేర్చుకోవడానికి చేరినమర్నాటినుంచే పాల్ కోల్కాని అస హ్యించుకోసాగాడు.

వీరుగాక ఆ దుకాణంలో అర్కియాష్కా అనే పిల్ల వాడుకూడా పనిచేస్తున్నాడు. అతనికి మనుషులను వేధించుకు తినడం సరదా. ఎప్పుడూ బూడిద, సర్బోను, మురికినీళ్ళు అంటు కొనిఉండేవి. అతనికి పాల్‌కి సరిపడేదికాదు. చివరికి కొట్లాట కూడా అయింది. ఆర్కియాష్కాకి దెబ్బలుతగిలాయి. వారం రోజులపాటు పాల్‌కేసి దీనంగాచూస్తూ ఏదోవిధంగా పగతీర్చు కోవాలని యత్నించాడు. కాని పాల్ అతనిదుశ్చేష్టలు లెక్క చేయకపోయేసరికి రాజీకి దిగాడు.

"అయిందేదో అయిపోయింది, ఇక రాజీపడదాం. నన్ను కొట్టావు. నువు యింకా బాగా ఆరోగ్యంగావుండబట్టి కొట్టగలిగావు. పదిరోజులపాటు యిక్కడవుండి చూడు, పుల్ల లాగా అయిపోతావు. అప్పుడు నేనే నిన్ను చితకతంతాను. సరేనా?"

చేయిజాపాడు. పాల్ మాటాడకుండా అతనిచేయి పుచ్చుకున్నాడు.

"అయినా నువిక్కడ చిన్న పనివాడివని మాత్రం జ్ఞాపకంవుంచుకో. తప్పకుండా జ్ఞాపకంవుంచుకో. అంటు చేత చెత్త పనంతా నువ్వుచేయాలి. తెలిసిందా? సరేనా?"

పాల్ అతని మడ్డిమొహంలోకి చూసి సరే అన్నాడు.

"అలా అయితే" అంటూ ఆర్కియాస్కా మొదలు పెట్టాడు ఆశ్చర్యపోతూ, "మంచిదే. సంతోషం. నువ్వు దుకాణం వూడ్చు, టీ కాచు, కట్టెలు కొట్టు, స్టవ్ వెలిగించు. దొడ్డి వూడ్చు. యిలాంటి చెత్తపనులన్నీ చేయి"

"మరి నువ్వో"

"నేనా ? అరే యేం వింతమనిషివి! చేయడానికి, నాకూ బోలెడంత వుంది. నిజానికి నీకంటె యెక్కువ పనివుంది."

ఈవిధంగా పని విభజనచేయడంవల్ల ఆర్కియాస్కాకి పని బాధ తప్పింది. అయిదురోజులవరకు పాల్ పనిభారంతో నానా అవస్థాపడుతూంటే చూసి సంతోషంగా చిరునవ్వు నవ్వుకున్నాడు.

కాని యాట్కిన్ తాత ఇదంతా కనిపెట్టి ఆర్కియాస్కాని దగ్గరకుపిలిచి బూటుఅచ్చుతో నెత్తిమీద ఒక్కటి కొట్టాడు. తెలివైనటక్కరివే గాని, చాలినంత తెలివిలేదు నీకు అన్నాడు. ఆర్కియాస్కా ఏఏపనులుచేయాలో నిర్ణయించి, పాల్నుకూడా పిలిచి "నువ్వు వట్టి తెలివితక్కువదద్దమ్మవి" అని చెప్పి అతనికీ కొన్నిఆదేశాలిచ్చాడు.

ఆనాటినుంచి ఎవరేపనిచేయాలో స్పష్టంగా తేలిపోయింది. చెప్పులవ్యాపారంతో సంబంధంలేని చెత్తపని పాల్కి అప్పగించారు. ఆర్కియాస్కాని పీపామీదికి ఎక్కించి, క్రమ

క్రమంగా వ్యాపారరహస్యాలు తెలియజేస్తున్నారు. అందువల్ల పాల్‌ని దబాయించేహక్కు ఆర్కియాహ్కుకు కలిగింది. ఒక్కొక్కప్పుడు అధికారిలాగా పాల్‌మీద కేకలు వేయడంకూడా సాగించాడు.

యాహ్కిన్‌తాత పరిస్థితిలో మార్పు ఎలాతీసుకు వచ్చాడా అని పాల్ చాలాకాలంవరకు ఆశ్చర్యపోతూనే ఉన్నాడు. అంతా ఆర్కియాహ్కు ఏర్పాటుచేసినట్లేఉంది. కాని యాహ్కిన్‌తాత అదంతా తనప్రతాపమేనని చెప్తూండే వాడు.

అరెఫీగుడిసెలో ప్రశాంతంగా అదీఇదీ ఆలోచిస్తూ జీవితంగడపడానికి అలవాటుపడ్డాడేమో, ఈ తిట్లు, ఈ పాటలు, పుగాకుపొగ, చర్మంవాసన పాల్‌ని కుంగదీసేశాయి. రోజులకు రోజులు ఒంటరిగానో లేక ఒక్క అరెఫీతోనో కాలక్షేపంచేసే వాడేమో, ఇక్కడ నలుగురుపనివారితో కలసిమెలసి ఉండడం కష్టసాధ్యమైంది. ఉదయంనుంచి రాత్రివరకూ ఆ నలుగురుపని వారూ పాడుకోవడం, పాల్‌కి అర్థంకానివిషయాలు ఏవో చెప్పుకోవడం, అకారణంగా నవ్వుకోవడం, బూతులుతిట్టు కోవడం వేడుకగా భావించేవారు. వారిబూతుమాటలు వింటూంటే పాల్‌కి వాళ్ళందరినీ పోలీసుఠాణాకు తోలుకుపోదా మనిపించేది. తనపైపనివారిని పాల్ విచారంతో ద్వేషంతో చూసేవాడు. వారిని అర్థంచేసుకోలేక కొంచెం భయపడ సాగాడు. పాల్‌వైఖరిని గమనించి, వారు ఇంకా నవ్వేవారు. ఒక్కొక్కప్పుడు కళ్ళు నిప్పులుకక్కేటంతవరకు తీసుకువెళ్ళేవారు.

పాల్ కళ్ళు నిప్పులుకక్కడం వారికి మరింత సంతోషం, ఉత్సాహం కలిగించేది. నానాటికీ పాల్ వారికి దూరమైపోసాగాడు.

తరుచుగా అతనిపుట్టుకనుగురించి వారు మళ్ళీమళ్ళీ చెపుతూండేవారు. ఒక స్ఫోటకంమచ్చలపసికూన కోరడిదగ్గర దొరికాడు అంటూ ప్రారంభించేవారు. దుకాణంయజమానిదగ్గర నుంచి పాల్‌పుట్టుకకుసంబంధించిన భోగట్టా సంపాదించారు. ఆ కథకి చిలవలుపలవులుఅల్లి చెప్పేవారు. పాల్‌కి అటువంటప్పుడు ముళ్ళమీదకూర్చున్నట్టుండేది. జీవితం నరకంఅని వివరంగా గుచ్చిగుచ్చి వర్ణించిచెప్పేసరికి పాల్ అదిరిపోయాడు. అప్పటి వరకు ఆవిషయాలే అతను వినలేదు, కనలేదు. వారు అతని తలిదండ్రులఆకారాలను, వృత్తిని నవ్వొపుట్టేటట్టు వర్ణించేసరికి పాల్ కుంగిపోయాడు. హృదయం కుమిలిపోయింది. ఉక్కిరిబిక్కిరిఅయిపోయాడు.

తలిదండ్రులనుగురించి ఇలా పదేపదే వర్ణించిచెపుతున్నకొద్దీ అతనిహృదయం ఇంకా ఎక్కువగా కుమిలిపోసాగింది. స్ఫోటకంమచ్చలమొహం భయంకరాకృతి దాల్చేది. ఇలా వేళాకోళంపట్టించి వదిలేసేవారు. అతనిఉనికే మరచిపోయేవారు. కాని ఇలా వేళాకోళంచేస్తున్నంతసేపూ మౌనంగా రోషంబిగపట్టుకుని పాల్ కూర్చునేవాడు.

క్రమక్రమంగా మౌనం హెచ్చింది. ఎప్పుడూ మొహం ముడుచుకోవడంవల్ల ముక్కుపైన లోతుగా శాశ్వతంగా ముడుత ఏర్పడింది. ఆ ముడత, మౌనం, తలవంచుకోవడం, తీక్షణంగాచూడడంమూలంగా అతనికి 'బుల్లితాత' అనే మారుపేరువచ్చింది. 'బుల్లితాతఅని పేరుపెట్టినందుకు పాల్

పు రేం బాధపడకుండా చిన్న పిల్లవాడిలాగా ఆ పేరుపెట్టి పిలిస్తే జవాబిచ్చేవాడు. ప్రతివాడూ అతనిని స్వార్థపరుడని, చెడ్డవాడని తలచేవారు. ఎపుడో ఒకపుడు చెడ్డపనిచేసితీరతాడనే అనుమానంతో చూసేవారు అతనిని.

ఒకమాటు నికాండర్ 'బుల్లి తాత' ఎవరినో చంపి ఉంటాడని ఇంకొకరిని చంపాలనే కోరిక చంపుకుతింటూందనీ లేకపోతే వంటమనిషి సెమెనోవాను ప్రేమించిఉంటాడని అన్నాడు. కాని కోల్కా షిష్కిన్ ఈవిషయం అంగీకరించలేదు. బాగా గర్వంఎక్కిపోయిందనీ, అపుడపుడు చితక తంతూంటే వదిలిపోతుందని చెప్పాడు. ఆర్కియాష్కా ఇంకో ఉపాయం చెప్పాడు. బుల్లి తాత కాలిమడమలు కోసి, గాయాలలో చిన్న చిన్న వంది వెంట్రుకలు కుక్కాలని సూచించాడు. అపుడు పాల్ మహా హుషారుగా పొద్దుటినుంచి సాయంకాలం వరకు నృత్యంచేస్తాడట!

యాట్కిన్ తాత ఇదంతా విని,

"వెధవల్లారా! పిల్లవాడు శుభ్రంగా పనిచేస్తాడు. వాడి జోలికి పోకండి. మీలాగా అల్లరిచిల్లరగా తిరగడంలేదనా? అందులో తప్పేంవుంది. మీలాగా యెగిరెగిరిపడేమనిషి కాదు. వాడిస్వభావమే అంత?"

ఇలాంటి మేకస్వభావంగల ఒక పటాలంసేనానికథ చెప్పాడు. ఆ సేనాని చేపబొమికె గొంతుకు అడ్డంపడి ఊపిరాడక చనిపోయాడట!

మొదటివారం పూర్తి అయేసరికి అక్కడి పనివారికి పాల్ మీద చెడుఅభిప్రాయం స్థిరపడిపోయింది. ఈవిషయం

పాల్ పసిగట్టాడు గాని, చేసేదేమీ లేదని గ్రహించాడు. చెప్పిందల్లా చక్కగా ఒళ్ళువంచి చేసేవాడు. మధ్యమధ్య తమాషాకి దుకాణంలోనివారు సానుభూతితో పల్కరిస్తే ఒకటి రెండు పొడిమాటలతో జవాబిచ్చేవాడు. దాంతో వారు అసంతృప్తిచెంది తిరిగీ వేళాకోళంచేయడానికి వేధించడానికి దిగే వారు. ఇది పాల్‌కి అర్థమయేదికాదు. చివరకు వారు మంచిగా ఏమిమాటాడినా అదంతా తనను వలలోవేసుకుని వేళాకోళం చేయడానికేనని నిశ్చయించుకున్నాడు. ప్రతివిషయాన్నీ అనుమానంతో విచారంతోచూసే పరిస్థితి తీసుకువచ్చారు.

ఈవిధంగా ఒక నెల సాగింది. తనను వేరువిధంగా చూస్తూండడవల్ల తను తక్కినవారివంటివాడు కాదనే అభిప్రాయానికి వచ్చాడు పాల్ క్రమంగా. కాని చివరకు అతని అనుమానానికి ఆస్కారం తగ్గిపోయింది. దుకాణంలోనివారు కూడా అతని మానానికి అలవాటుపడిపోయారు. 'శత్రులు మూలపెట్టారు' కాని పరిస్థితిమాత్రం మారలేదు.

పాల్ మాటాడకుండా తనపనేమిటో తాను చేసుకునే వాడు. అతనిని చితకగొట్టేవారు, తన్నేవారు, బాదేవారు, నెత్తిమీద మొట్టేవారు. చివరికి పాల్ ఇటువంటివాటికి అలవాటుపడిపోయాడు ఈ అల్లరిమూకి ఇంతకంటె ఎక్కువగా ఆదరిస్తారని ఆశించలేదు.

ఆదివారాలు చొక్కాలో నల్లరొట్టెముక్క దాచుకుని, షికారు వెళ్ళేవాడు పాల్. పట్టణమంతా మూడుసార్లు తిరిగాడు. ఇక అతనికి ఆసక్తిగొలిపేదేదీ పట్టణంలో కనిపించలేదు. అందుకని టూపారోక్కల్‌తోటకుమాత్రం వెళుతుండే

వాడు. స్నానాలకొట్లువెనక చక్కటిగొయ్యి ఉంది. అడుగున దట్టంగా కొబ్బరిలూ అవీ పెరిగాయి. పాల్ అక్కడికి వెళ్ళి వెల్లకిలా పడుకుని గంటలుగంటలకు ఆకాశంకేసిచూస్తూ కాలంగడిపేవాడు. చుట్టూ గాలికి బర్డాక్ లు అల్లలలాడేవి. తేనెటీగలు ఝుంఝుమ్మంటూ రాచఉసిరిపొదలచుట్టూ ప్రదక్షిణం చేసేవి. ఎర్రటిపురుగులు పాకిపోతుండేవి. అక్కడే పాల్ మెల్ల మెల్లగా ఆలోచించడం నేర్చుకున్నాడు.

దుకాణం అతనికి అర్థవంతంగా కనపడలేదు. అదొక అర్థంపర్థంలేని సమస్య. ఆ సమస్యను విప్పాలని అతనికి తలంపు కలగలేదు. గోతిలో కూర్చునిఉండగా దుకాణంలో సోమ వారం ఉదయంనుంచి శనివారందాకా గడిపినజీవితం సూక్ష్మ వివరాలతో కళ్ళకుకట్టేది. ఒకమాటు ఈ జీవితదృశ్యాన్ని తిల కిస్తూండగా ఒకప్రశ్న వేధించింది. ఇదంతా అవసరమేనా? ఇతరులకోసం బూట్లు తయారుచేయడం దేనికి? మనం బోసి కాళ్ళతో తిరగడమేం? యాట్కిన్ తాతలాగా తాగడం దేనికి? కోల్కాలాగా జూదమాడడందేనికి? ఆడపిల్లతో సంబంధం పెట్టుకోవడం దేనికి? ఆతర్వాత సోమవారంనాడు నికాండర్ వికటహాస్యంతో చెప్పినట్లు, ఆడవాళ్ళతో క్రీడలు, పోట్లా టలు, వారిదగ్గరనుంచి పారిపోవడం పోలీసులకు పట్టుబడకుండా పరిగెత్తడం దేనికి? మనం పనిచేయడం, దేనికి? సంపాదించింది తాగుడికి తగలేయడం దేనికి? యజమానిలాగా సోఫామీద పిచ్చుకు నవ్వుకోవడం దేనికి? దేనికి? దేనికి?

అరెఫీగనక ఆరోగ్యంగా ఉన్నట్లయితే ఈ సందేహా

లన్నీ తీర్చేవాడేనని పాల్ భావించాడు. కాని అరెఫీ ఇంకా ఆసుపత్రిలోనే ఉన్నాడు.

పాల్ రెండుసార్లు ఆసుపత్రికి వెళ్ళాడు. మొదటిసారి అతనిని అసలు లోపలికిరానీయనేలేదు. రెండోసారి వెళ్ళినపుడు ఇక అరెఫీకి నయంకాదనీ, మళ్ళీ మళ్ళీ రావడం అపాయకరమనీ చెప్పి పంపించారు. ఈమాటలు వినేసరికి పాల్ కి ఆశ్చర్యం వేసింది. డాక్టరు కేసి తేరిపారజూస్తూ నిలబడ్డాడు. అడుగుదామనుకున్న ప్రశ్న అడగలేకపోయాడు. కుంగిపోయి వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

మైఖేల్ ను చూడడానికి వెళ్ళకూడదని పాల్ నిశ్చయించుకున్నాడు. వెళ్ళినా అక్కడ ఉల్లాసంగా ఉండదని తెలుసు.

ఇలా రోజులకురోజులు గడిచాయి. పాల్ కి [illegible]త్తిందే గాని, ఇక్కడికి ఎందుకువచ్చానా అనిపించలేదు. ఏవిధంగా రోజులుగడపాలనే కోరికా జనించలేదు. మంద[illegible]నలు మాత్రం వచ్చిపడ్డాయి. క్రమేపీ యథార్థజీవితంతో సంబంధం లేని అవాస్తవిక స్వభావం వానికి అలవడింది.

జీవితం సాగిపోతూనేఉంటుంది. జనం [illegible]నే [illegible]కుంటూంటారు. నిజానికి అలానే జరగాలి. అలా[illegible]ంచిది. మధ్యమధ్య 'వెధవబ్రతుకు', 'కుక్కబ్రతుకు' అనేమాటలు వినవచ్చేవి. ఈమాటలు రోజూ వినేవే కాబట్టి అతనిమనసు మీద ఏమీపనిచేయలేదు. అంతేగాక, 'కుక్క[illegible]' అతని దృష్టిలో చెడ్డబ్రతుకు కాదు. అవి ఏనేమీ[illegible]గలేదు. స్వేచ్ఛగా సుఖంగా బతకుతాయి. జనులు [illegible] వాటిని

ముచ్చటలాడుతూంటారు. ఎంతో శ్రద్ధచూపిస్తారు. స్నేహితుడి లాగా చూచుకుంటారు.

పనిలో చేరిన మొదట్లోనే దుకాణంయజమానిని, పని వారిని, వారివారిప్రవర్తనలను, అర్థంచేసుకోవాలని పాల్ యత్నించాడు. కాని వారివైఖరి ఆసక్తిని నాశనంచేసివేసింది. దానిమీద పాల్ ఏదో లాంఛనంగా, బుగులుబుగులుగా, యాంత్రికంగా ప్రవర్తించసాగాడు. పనిరోజులు గడిపేందుకు ప్రత్యేకమైనకదలికలను జీవితవిధానాన్ని అలవర్చుకున్నాడు. ఒకమాటు కీఇచ్చి వదిలిపెడితే తుప్పవట్టేదాకానో, విరిగిపోయే వరకో తిరుగుతూండేయంత్రంలాగా పాల్ తయారయాడు.

అందరూ పాల్‌ని వెర్రివాడికింద జమకట్టేశారు. నిజం కూడా అంతే. తాపీగా మత్తుగా తిరగడంలో, ముక్తసరి జవాబులలో, నలుగురినీ ఆకర్షించేవాటిలో హుషారుగా ఆసక్తి తీసుకోకపోవడంలో ఒకవిధమైన వెర్రితనం గోచరిస్తుంది.

ఆదివారాలు తోటలోనిగోతిలో పడుకుని, ఊహా ప్రపంచంలో విహరిస్తుండేవాడు. ఒకేచోట గస్తీతిరిగేపోలీసు లాగా విశాలాకాశంలో సంచరించేసూర్యుడు అలసిపోవడేం? దోవతప్పడేం? అవకాశంచిక్కితే సూర్యుడిరంగు మార్చేద్దును; చంద్రుడుఉదయించినపుడే సూర్యుడూ ఉదయించేటట్టుచేద్దును అనుకునేవాడు. అప్పుడు తమాషాగా ఉండదూ?

రెండుసంవత్సరాలు గడిచాయి. పాల్ చిక్కిపోయాడు. ఎండిపోయాడు. మొహంమీదిస్ఫోటకంమచ్చలు యింకా స్పష్టంగా కనిపించసాగాయి.

ఈ రెండేళ్ళల్లో ఆర్కియాషా చిన్నపిల్లలుచేసేపని మాని, అసలువృత్తి నేర్చుకోసాగాడు. నిగాండకుడు చిన్న దుడుకుపనిచేసినందుకు మూడు నెలలు జైలుశిక్ష వేశారు. అతనిపని ఆర్కియాషాకి అప్పగించారు. కోల్కా పెళ్ళిచేసుకుని స్వంతంగా దుకాణం తెరవాలని ఆలోచిస్తున్నాడు. యాట్కిన్ తాత తెగతాగి, ఉబ్బసంగాదని, చేతులు వణకడం మూలాన పనిసాగడంలేదని గోలపెట్టసాగాడు. ఇదంతాచూసి యజమాని ఇంటివద్దనే తాగడం మొదలుపెట్టాడు. యాట్కిన్ తాత దుకాణం నిర్వహించలేకపోతున్నాడని గుర్తించి, నారా దుకాణానికివెళ్ళడం తగ్గించివేశాడు.

క్రమక్రమంగా చెప్పులుకుట్టేవృత్తిలోని రహస్యాలు పాల్‌కి బోధించజొచ్చారు. ఆర్కియాషా ప్రపంచగురుత్వం కింద పాల్ బూట్లకుఅట్టలువేయడం, మడమలకు చర్మం ముక్కలువేసి కుట్టడం నేర్చుకున్నాడు. యజమానితో దుకాణంలోనివనివారంతా ఆశ్చర్యపోయేటంత తెలివితేటలు, ప్రయోజకత్వం ప్రదర్శించాడు. దీనితో పాల్‌కి పరువుప్రతిష్టలు లభించాయి.

కొద్దికాలంతర్వాత షిష్కిన్ దుకాణంలో పనిమానుకుని వెళ్ళిపోయాడు. ఆర్కియాషాకిజీతం పెంచారు. ఆర్కియాషాపని పాల్‌కిఇచ్చి కొత్తకుర్రవాడిని పనిలోకితీసుకున్నారు.

పాల్ ఇపుడు నెలకు మూడురూబుళ్ళు సంపాదిస్తున్నాడు. ఆర్కియాషాసంగీతానికి,యాట్కిన్ తాతగొణుగుడికి తలఊపేవాడేగాని, మామూలు మౌనంమాత్రం విడనాడలేదు.

పని ఎక్కువగా లేనందున యజమాని ఇంకో పనివానిని పెట్టుకో లేదు. పని పేరుకుపోతే యజమాని తానే స్వయంగా చేసే వాడు. అలా పనిచేయడం అతనికి సంతోషంచేకూర్చేది; ఇంకా ఎక్కువ తాగడానికి కారణమయ్యేది.

"ఛీ, యేంబతుకు!" అని తిట్టుకునేవాడు చర్మంలో నుంచి మైనందారం లాగుతూ. పని చెయ్యడం, తాగడం! ఇదే బతుకు అనుకోవడం! బలేతమాషా! భోజనాలకి వేళకాలేదా? మిష్కా! వడ్డించమని సెమెనోవ్నాతో చెప్పు. నువ్వు సారా దుకాణానికి పరుగుచ్చుకువెళ్ళు. యిదిగో డబ్బు-తీసుకో. అర సీసా తీసుకురా. సరిపోతుందా, తాతా?"

తాత సంతృప్తితో మీసాలుఆడించాడు. యజమాని మందహాసంచేశాడు. ఇక మిష్కా. మిష్కాకి పదేళ్లు. నల్లటి ఉంగరాలజుట్టు, లేడిచూపు, అరసీసాసారా తేవడానికి కుప్పి గంతులు వేసుకుంటూ బయలుదేరాడు. దోవలో తారసిల్లిన వారిని వెక్కిరించసాగాడు.

ఇలా పదేళ్ళజీవితం గడిచింది. పాల్ ఒడ్డూపొడుగూ ఎదిగాడు. చూడముచ్చటగా ఉన్నాడు. పొడుగే; కొంచెం గూనె. మంచి కండపుష్టి. ఊదారక్తనాళాలు, గోధుమరంగు చేతులు బైటపడేట్టు చొక్కాచేతులు పైకిమడుచుకునేవాడు. బూట్లుతయారుచేయడానికి వంగి కూర్చున్నప్పుడు బాదంరంగు జుట్టుకిందుగా మెత్తని నూగుతో నిండినమెడ కనిపించేది. మెడ వంపుతిరిగి బాగా బలంపట్టింది. స్ఫోటకంమచ్చలచర్మంలో నుంచి గడ్డం ఇప్పుడిప్పుడే తొంగిచూస్తోంది. పైపెదవిని నూనూగు మీసం అలంకరించింది. ఈకాలంలోకూడా నలుగురితో కలిసి

మెలిసి హుషారుగా ఉండలేకపోయాడు. ఎప్పుడూ కనుబొమలు ముడుచుకుని, పూర్వంకంటె ఎక్కువవిచారంతో, అనుమానంగా చూడసాగాడు.

దుకాణంలో "బుల్లితాత" అనేపేరు ఇంకా మాసిపోలేదు. తెలివితక్కువవాడన్న అపఖ్యాతి చుట్టుకుంది. తాగుడు మొదలైన వ్యసనాలకు పాల్ లోనుకాలేదు. పనివాళ్లు అతని తత్వానికి అలవాటుపడ్డారు. వేళాకోళం మాని వేశారు. అతని బలంచూసి భయపడ్డారు. రోషంలేనివాడని చెప్పేవారు.

వారందరిపనులు పాల్ చేసేవాడుకాదు. పాల్ దేని కోసం బతికిఉన్నాడో వారికి అర్థంకాలేదు. ఆవిషయం పాల్‌కీ తెలియదు. నవ్వడానికి, ఏడ్వడానికి శక్తిలేనివాడిలాగా కనిపించేవాడు.

యజమానితల పూర్తిగా నెరిసిపోయింది. వయసుతో పాటు సత్తువకూడా తగ్గింది. "నేను చచ్చిపోయినట్లే లెక్క. యిక ప్రళయాంతంలోనే మళ్ళా బతకడం," అని పాల్‌తో ఒకసారి చెప్పాడు. అపుడు ఇష్టంఉన్నా లేకపోయినా లేచికూర్చోవలసిందే. దుకాణంకూలిపోయి బయటికిపోవలసిన దుస్థితి వస్తేతప్ప అందాకా దుకాణంలోనుంచి కదలననికూడా చెప్పాడు.

పాల్ జవాబుచెపుదామని తలపోశాడుగాని, చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు,

"కృతజ్ఞుణ్ణి!" అంటూ మిరాన్ వంగి నమస్కరించి, ఇంకా చెపుతాడేమో విందామని కుతూహలపడ్డాడు. పాల్ పనితనం మిరాన్‌కు నచ్చింది. ప్రేమ ఏర్పడింది. తాగినపుడు

పాల్ అంటే ప్రేమఏర్పడిందని చెప్పేవాడు. తెలివిలో ఉన్నప్పుడు అందరికంటె ఆదరణచూపేవాడు.

దుకాణంలో ఇంకాఇద్దరు ప్రవేశించారు. మిష్కా, గూస్. మిష్కాకి పందొమ్మిదేండ్లు. దొంగ, టక్కరి. గూస్ నలభైఏళ్ళవాడు. ఒంటికన్ను, కొంగమెడ. చిన్నప్పుడు గొంతు మహా పసందుగాఉండేదనీ, చర్చిలో నలుగురితో కలసి పాడడం వల్ల మెడసాగిందనీ గూస్ చెపుతూండేవాడు. ఇప్పుడు గొంతు పోయి బొంగురుఏర్పడింది.

ఆర్కీయాష్కా చాలారోజులక్రితమే చెప్పులుకుట్టే వృత్తి మానేశాడు. మొదట్లో చిన్నవ్యాపారం పెట్టాడు. ఆ తర్వాత సారాదుకాణంలో చేరాడు. మళ్లీ మేర్యాదగ్గరకు వచ్చి, కొత్తబూట్లు దొంగిలించి మాయమైపోయాడు. ఈ తడవ అసలు ఆ పట్టణంనుంచే వెళ్ళిపోయాడు.

యాట్కిన్ తాత యిహాలీల చాలించాడు. ఒకనాడు చెప్పులు కుడుతూకుడుతూ పెద్దగా నిట్టూర్చాడు. అంతకు పూర్వం రోజురోజుకి ఊపిరిపీల్చడం కష్టమైపోతుండేది. మొండి ప్రాణం అని ఎవరూ లెక్కచేయలేదు. కాని ఆరోజున ఒకటే నిట్టూర్పులు మొదలుపెట్టాడు. చివరకు సుస్తీకిందపెట్టి కప్పు వంకచూస్తూ,

“మతగురువును పిలవడమా, మానడమా?” అన్నాడు.

అయినా ఇది మామూలుకథే కాబట్టి ఎవరూ పట్టించుకోలేదు. పూర్వం ఒకమాటు యాట్కిన్ ‘ఒకమతగురువుచాలదు బిషప్పుదగ్గరికి బండిలోతీసుకువెళ్ళండి’ అని పట్టుపట్టాడు. ఈ

తడన భోజనంచేసి స్టవ్ వెనకపడుకుని ఎంతసేపటికీ లేవకపోతే లేపుదామని వెళ్ళారు. తీరాచూస్తే చచ్చిఉన్నాడు.

యాట్కామరణం పాల్ మనసులో బాగా నాటుకు పోయింది. చాలారోజులవరకు ప్రతీవానివంక ప్రశ్నార్థకంగా తేరిపారజూసేవాడు. మనసులోని ఆందోళనను మాటల్లో పెట్ట లేక మౌనంవహించేవాడు.

యాట్కిన్ తాతని సమాధిచేశారు. ఆ సమాధి గోరీల దొడ్డిలో ఎక్కడో చీకటిమూల ఉంది. చుట్టూ దట్టంగా రాచ ఉసిరిచెట్లూ అవీ పెరిగి, ఎండ పడడంలేదు. పాల్ అప్పుడప్పుడు సమాధిని చూసివస్తూండేవాడు. అక్కడ నేలమీదకూర్చుని రాతిగోడలోని సొరంగంగుండా ఎక్కడో దూరానికి చూచే వాడు, గుడిసె, నది, పొలం, అడవి కన్పించి తన బాల్యాన్ని జ్ఞాపకంచేసేవి. అరెఫీ జ్ఞాపకంవచ్చేవాడు. పాపం! అరెఫీ ఆసు పత్రిలో రెండుసంవత్సరాలు తీసుకుని చనిపోయాడు.

అరెఫీమృతి పాల్ని పెద్దగా బాధించినట్టులేదు. పైకి దుఃఖం పొంగిపొరలలేదు.

ఇప్పుడు ఆదివారాలు షికారుగా ఎక్కువదూరం చుట్టి వస్తున్నాడు. తోటలోనికి వెళ్ళడంలేదు. యాట్కిన్ తాత సమాధికేకాకుండా పట్టణంఅవతలి కొండదగ్గరకు వెళ్ళ నారంభించాడు. అక్కడినుంచి చూస్తే పట్టణంఅంతా విస్ప ష్టంగా గోచరిస్తుంది. చాలాసేపు పట్టణంవంక చూసేవాడు. రణగొణధ్వనిచేసే పెద్ద ముద్దగా పట్నం కనిపించేది. వీధుల్లో తిరిగేజనం వేలెడంతగా చూపట్టేవారు.

రోజూ పాల్ అడవికి వెళ్ళేవాడు. ఏకాంతప్రదేశంలో గంటలుగంటలు పడుకుని చెట్లమర్మరధ్వని వింటూండేవాడు. ఒక్కొక్కప్పుడు పొరుగుగ్రామాలకు వెళ్ళి, వీధుల్లో తిరుగుతూ తచేతదృష్టితో పరీక్షగా చూసేవాడు, సారాదుకాణంలోకి వెళ్ళి తాగుతూ, అక్కడివారి సంభాషణవింటూ గంటలసేపు గడిపేవాడు. తప్పతాగినవారు అతనిచుట్టూ మూగేవారు. వారు పాల్‌మౌనం, విచారం చూసి, ఇంకా తెలివితప్పని తాగుబోతులు.

"ఆసామిజోలికి పోవద్దు. ఆయన పట్నం మనిషి. యిక కట్టిపెట్టండి" అని సలహాఇచ్చేవారు. పాల్ కేసి అనుమానంతో కోపంతో చూసేవారు.

పాల్ బిల్లుచెల్లించి మాటాడకుండా వెళ్ళిపోయేవాడు. ఒకమాటు సారాదుకాణంలోనుంచి బయటకివెళుతూంటే ఎవరో చెవిలో మెల్లగా, "పోలీసు!" అని హెచ్చరించారు. ఆ గ్రామం వెళ్ళడం మానుకున్నాడు.

రష్యన్‌తరహాకోటు, వదులులాగులు, కుచ్చులపట్టు బెల్టుతో బిగించుకునచొక్కా, టోపీ, ఎత్తుబూట్లూ ధరించి దర్జాగా ఉండేవాడు. పాల్ మంచి పొగడరి. బలశాలి. గంభీరమైన మొహం. కార్మికుడిలక్షణాలే కనిపించేవికావు. అతను ఏవర్గానికిచెందినవాడో ఆకారాన్నిబట్టి చెప్పడం కష్టం.

ఇంతలో ఒకసంఘటన జరిగింది. దాంతో పాల్‌ని 'ఎత్తికుదేసినట్టు'యింది.

"యే జైలుపక్షీ!" అంటూ మిరాన్ అప్పుడే దుకాణంలోకివచ్చిన సెంకాని ఆదేశించాడు.

"యివాళ టీపాయి శుభ్రంచెయ్యి అని నిన్న మంత
కంటె మకిలిగావుంది. యిక పాల్! నువ్వు యివాళ రాత్రి రెసి
డెంటుగారిబూట్లు పూర్తిచెయ్యి, వినిపించిందా?"

"సరే" అన్నాడు పాల్, బూటుమడమకు [illegible]చేస్తూ,
యజమానివంక చూడకుండానే.

గూన్ ఇపుడు కళ్ళజోడు పెడుతున్నాడు. బూటుపై
భాగం యంత్రంమీద కుట్టుతుంటే, గరగర శబ్దంతో గది
హోరెత్తేది.

మేనెల వచ్చింది. దుకాణంలోకి సూర్యకిరణాలు కిటికీ
గుండా వచ్చిపడుతున్నాయి. వీధిలోనుంచి అడుగుల చప్పుడు,
గరగరశబ్దం వినవస్తున్నాయి.

మిరాన్ కిటికీలోనుంచి చూశాడు. మానవపాదాలు
దూసుకుపోతూ కనిపించాయి. చర్మంముక్క ఒకటి పైకెత్తి,
పరీక్షించి కళ్ళుమిణుకరించి గంభీరస్వరంతో పెద్దమనిషి తరహాగా

"మనతోపాటు నివసించడానికి యిద్దరు కొత్తఅమ్మా
యిలు వొచ్చారు. జాగర్తగా వుండండి!" అన్నాడు.

కాని ఈమాటలమీద ఎవరూ వ్యాఖ్యానం చెయ్యలేదు.
ఎవరూ అడ్డుతగలకపోయేసరికి కొంచెం ఆగి మళ్ళీ ప్రారం
భించాడు.

"యిక పాల్! నువ్వు వాళ్ళతో పరిచయం ఏర్పరచు
కోవాలి. కనీసం మాటాడడంయెలాగో నేర్చుకోవాలి. నిజానికి
నువ్వు సన్యాసివిలాగా వున్నావు. బొందితో స్వర్గానికి వెళ్ళాలని
వుందా యేం? అతిగా కష్టంచెయ్యకు. స్వర్గంలో చెప్పులు
కుట్టేవాణ్ణి అడుగుపెట్టనీరు. వాళ్ళకి చెప్పులతో అవసరంలేదు.

అక్కడ అంతా చెప్పులు వేసుకోకుండానే తిరుగుతారు. అక్కడ వాతావరణం దివ్యంగావుంటుంది! అవును, దివ్యంగావుంటుంది!"

"తియ్యతియ్యని అయిస్‌క్రీం!" అని వీధిలోనుంచి బిగ్గరగా కేకవినిపించింది.

"ఊఁ-కానీ, వాళ్ళతో సరసంగావ్యవహరించావంటే, పాల్! వాళ్ళు నీమనసుమరిగించి, కరిగించినిన్నుకొత్తమనిషిగా తయారుచేస్తారు. సోలమన్ యేమన్నాడు? 'ఆడవాళ్ళకి లొంగిపోవద్దు. రాజులను నాశనంచేసేదారి తొక్కవద్దు' అన్నాడు. అది మనకి చెప్పిందికాదు. యీ ఆడవాళ్ళు బలే హుషారయినవాళ్ళు. అవును స్వామీ! ఆడవాళ్ళకి స్వేచ్ఛయిస్తే భగవంతుడిసృష్టినే తలకిందులుచేసేస్తారు! నాటకంఆడేస్తారు! ముందు పెళ్ళయినఆడవాళ్ళంతా ముగుళ్ళని వదిలేస్తారు. యిక కన్యలు-ఒక్కొక్కళ్ళు ముగ్గురుమొగుళ్ళని కట్టుకుంటారు. బలే తమాషాగా వుంటుందిలే!"

ఆరోజునుంచీ మిరాన్ షోగ్గాతయారయేవాడు. ఒక్కక్షణమైనా తటపటాయించకుండా ఒక పెద్దకథ అల్లి చెప్పాడు. గూస్ అదంతా వట్టికల్పన అని అధిక్షేపించి, కుట్టుయంత్రం మీద పనిముగించి బూటుపైభాగం పరీక్షగాచూసి, "స్వర్గంలోని ఓ నాతండ్రీ!" అనే మహాగీతం గొంతెత్తిపాడాలని యత్నించాడు. కాని పాటకుబదులు పాముబుస వెలువడింది. దానిమీద గూస్ మెడరుద్దుకుని, ఖంగునదగ్గి అటూఇటూ ఉమ్మివేశాడు.

"మొహం అలా యెర్రపడిందేం?" అని మిరాన్ అడిగాడు పాల్ మొహంకేసిచూచి, "నుదురునిండా చెమట?"

"యేమో నాకేం తెలీదు" అని పాల్ మందకొడిగా జవాబిచ్చాడు, నుదురుతుడుచుకుంటూ; నుదురుతుడుచుకునే సరికి చేతిమసి దానికి అంటింది.

"అబ్బే! అలా మసిచేసుకుంటే యేవిటి ప్రయోజనం?" అన్నాడు యజమాని ఖంగుమనేస్వరంతో. "అదేవిటి, నీకళ్ళు మైకంకమ్మినట్లున్నాయి? వంట్లో బావుండలేదా?"

"బావుండలేదు... నేను..."

"అలాఅయితే ఇంకా యిక్కడకూర్చున్నావెందుకు?" అన్నాడు యజమాని—"పనికట్టిపెట్టేసెయ్యి. బూట్లుకుట్టడం యెవరోఒకరు పూర్తిచేస్తారు వెళ్ళి పడుకుని విశ్రాంతితీసుకో."

పాల్ లేచి తాగినవాడిలాగా తూలుతూ గుమ్మంలోకి వెళ్ళాడు.

"వెళ్ళి నేలమాళిగలో పడుకుంటాను. యేదయినా ప్రమాదంసంభవిస్తే..." వాక్యంపూర్తిచేయకుండానే పాల్ వెళ్ళిపోయాడు.

నడుస్తూంటే కాళ్ళువణికాయి. తల భారంగా తయారైంది. తిరిగింది. కళ్ళముందు ఎర్రనివి, ఆకుపచ్చవి మచ్చలు తేలియాడజొచ్చాయి.

నేలమాళిగలో గాలి చడిగా, మందంగా ఉంది. చిక్కని ఆవిరితో తొణికిసలాడుతున్నట్లుంది. పాల్ చొక్కామెడ గుండీలు ఊడదీసుకుని, పాతపిండిబస్తాలమీదపడ్డ తొలగించాడు. తడి బల్ల చెక్కలమీద గడ్డిపరచి, తలకిందచేతులుపెట్టుకుని పడుకున్నాడు.

నేలమాళిగలో చీకటికోణం. తలుపుసందులలోనుంచి సూర్యకిరణాలు దూసుకువచ్చి చీకటిని మసకమసకలాడే సన్నని చారలకింద చీల్చాయి. ఈచారలు కనిపిస్తూ కనుమరుగౌతూ దోబూచులాడసాగాయి. పైన అడుగులచప్పుడు వినిపించింది. అతనితల విచిత్రంగా మోతెక్కిపోయింది. కణతలు కొట్టుకోవడంవల్ల మత్తెక్కింది. నెత్తురు వేడెక్కింది. ఊపిరిపీల్చడం కష్టమైంది. శరీరం కాగిపోతోంది.

ఎరుపు ఆకుపచ్చమచ్చలు చిన్నచిన్నవిగా పిల్లికళ్ళల్లాగా మెరుస్తూ అతనికళ్ళముందు గంతులువేయసాగాయి. మరొకప్పుడు అవి పెద్దపెద్ద తోలుముక్కలుగా, ఎక్కడనుంచో రాలుతున్న ఎండుటాకులలాగా గాలిలో సుళ్ళుతిరుగుతూ కనిపించేవి.

పాల్ కళ్ళుతెరుచుకుని కదలకుండా పడుకోవాలని ప్రయత్నించాడు. కదిలితే లోతైన అగాధంలోపడిపోయి ఊపిరి సలపనీయని ఆవిరిలో తేలియాడుతానని భయపడిపోయాడు. చుట్టూ పైనా సర్వమూ గిర్రున తిరుగుతూ కూలిపోతున్నట్లుంది. చెవులులో గింగురుమని మోతపుట్టింది.

ఇలా కొన్నినిమిషాలు మందకొడిగా గడిచాయి. అతర్వాత హఠాత్తుగా గుమ్మంలోనుంచి సూర్యకాంతి వచ్చి పడింది. సుపరిచితమైన సెంకాగొంతు వినిపించింది

"భోజనంచేస్తావా పాల్?"

"భోజనంవద్దు గీజనంవద్దు" అన్నాడు పాల్. అప్పుడే భోజనాలవేళఅయిందా అనిపించింది. అతనిగొంతే అతనికి

కొత్తగా వినిపించింది. అంత హీనస్వరం అయిందేం? దుకాణం వదలివచ్చి చాలాసేపయిందా!

మళ్ళీ చీకటి నేలమాళిగను ముంచెత్తింది. వెలుతురు పారిపోయినట్టుంది. మళ్ళీ నిమిషాలు మందంగా గడిచాయి. చెవులలో ఏదో కటువుగా మోత బయలుదేరింది. ఉష్ణం, శీతలం తినివేస్తున్నట్టనిపించింది. మగతవచ్చింది. ఆ మగతలో దాహం వేసింది. ఊపిరిపీల్చుకోవడం కష్టమైంది.

"ఏదో చేటపెయ్య యిక్కడ పడివున్నట్టుందే!"

"కిందభాగంలో చెప్పులుకుట్టేవాడై వుంటాడు. తప్పతాగాడేమో!"

"సరే పడివుండనీ".

పాల్ కళ్ళు తెరచి మెల్లగా గుమ్మంవేపు తలతిప్పాడు.

నేలమాళిగలో వెలుతురుగానే ఉంది. గుమ్మంలో ఇద్దరుయువతులు నిలబడిఉన్నారు. ఒకయువతి నేలమాళిగ తలుపు ఎత్తుతోంది. ఇంకోయువతి మొదటియువతికి దగ్గరగా ఒకచేతితో పాలకూజా, రెండోచేతిలో ఏదో పొట్లం పట్టుకుని నిలబడిఉంది. పాల్ పండుకున్నదిక్కుగా పెద్దపెద్ద ఊదా కళ్ళతో చూస్తూ, నిండుగొంతుతో స్పష్టంగా,

"ఊ!. ఒకగుంజు గుంజు కేటరీనా!"

"తొందరపెట్టకు. నువ్వు ఎత్తిచూడరాదూ తెలుస్తుంది!" అని కేటరీనా జవాబిచ్చింది, తేమగా భారంగాఉన్నతలుపు తోస్తూ. ఆమెగొంతు మందంగా బొంగురుగాఉంది.

"చూడు చూడు, ఎలా తేరిపారజూస్తున్నాడో!" అంది మొదటియువతి. "నన్ను మింగేయాలని ఉన్నట్లుంది."

"ఇన్ని పాలుపోస్తే సరి."

"ఉహూం?"

పాల్ వారివంక మెరిసిపోయే జ్వరపుకళ్ళు అప్పగించి చూశాడు. వారిద్దరూ ఎక్కడో దూరాన పొగమంచులో తేలియాడుతున్నట్లు అనిపించింది. బొంగురుగొంతుతో, "తాగడానికి యేమయినా పోయండి" అని వేడుకున్నాడుగాని, తన మాటలు వారికి విన్పిస్తాయని ఆశించలేదు.

కాని వారికి వినిపించాయి. ఊదాకళ్ళయువతి చేతిలోని పొట్లం కిందపడవేసి, ఆ చేతితో గౌనుఅంచు పట్టుకుని పాల్ పడుకున్న మూలకు వచ్చింది. రెండోయువతి నేలమాళిగ మెట్ల మీద నిలబడి ఆసక్తితో చూస్తోంది.

"మొండిఘటం. యిదేం తమాషాకాదు కాట్యా, యిలా గుప్పెడుపుంచు పడేయ్. పాలువృథాచేయడమెందుకు?"

పాల్ ఈమాటలువిని తిరిగీ బొంగురుగా "తొందరగా, దాహం-" అన్నాడు.

ఆ ఊదాకళ్ళయువతి వచ్చి వంగి, తనమొహంలోకి తేరిపారజూడడం చూశాడు. "కాట్యా! అబ్బ! స్ఫోటకం మచ్చలు! ఓహో! అరె! తాగివడలేదు. సారావాసన కొట్టడం లేందే! కాట్యా, పాపం! యితడికి జబ్బుగావుంది. నిజం. వళ్ళు మసిలిపోతోంది.వూపిరిఆవిరియంత్రంలోనిఆవిరిలాగాఆడుతోంది ఆ దయ్యపువెధవలు యీ రోగిష్టివాడిని యిక్కడికి లాక్కొచ్చి పడేసివుంటారు. వందివెధవలు! తాగు, యిదిగో తాగు...! యెంతసేపటినుంచి యిలా పడివున్నావ్? నీకు నా అనేవాళ్ళెవరూ లేరా? నిన్ను ఆసుపత్రికి యెందుకు తీసుకువెళ్ళలేదు?"

పాల్ దగ్గరగా కూర్చుని, కూజా నోటిదగ్గరపెట్టింది. వణికేచేతులతో కూజాపట్టుకుని పాల్ గడగడా నాలుగు గుక్కలు తాగాడు. తాగుతూ మాటాడడం సాధ్యంకాదనే విషయం మరిచేపోయి ఆమె ప్రశ్నలమీదప్రశ్నలు వేసింది.

"నమస్తే, కృతజ్ఞుణి!" అన్నాడు పాల్ కూజానెట్టి వేస్తూ. తల సంచిమీదకు వాలింది.

"యింత తడిగావుందే, యిక్కడికి నిన్నెవరు లాక్కొచ్చారు? యజమానేనా? వాడు పట్టి తాష్టుడులా వున్నాడే!" అందామె మండిపడుతూ; చేతితో అతనినుదురు తాకింది.

"నేనే స్వయంగా..." అంటూ ప్రారంభించాడు పాల్ ఆమెమీదనుంచి దృష్టిమరల్చకుండా.

"మంచిచురుకు, తెలివితేటలు! చాలారోజులనుంచీ యిలాగే వున్నావా?"

"అబ్బే! యివాళే..."

"బహుశా వారంరోజులనించీ రోగాన్ని లెక్కచేయకుండా తిరిగివుంటావ్. యివాళ పడదోసింది. ఊం-యిప్పుడేమిటిచేయడం? కాటరీనా! యితన్నేంచేద్దాం?"

"యేంచేద్దాం? మంచుగడ్డ వేద్దామా? పోనీ, నీగదికి తీసుకువెళతావా? కర్మంచాలక గుటుక్కుమంటే కొంప మునుగుతుంది! కాని..."

పాల్ బహుకష్టంమీద తలతిప్పి ఇంకా మెట్లమీదనే నిలబడిఉన్న ఆ రెండోయువతిని చూశాడు. ఆమెచూపులో నిరాదరణ కనిపించింది. ఆమె ఎత్తిపొడుపుమాటలతో బాధ

ఇంకా ఎక్కువయింది. నిట్టూర్చి తనదగ్గరకూర్చున్న యువతి వంక చూశాడు.

ఆమె స్నేహితురాలిమాటలకు జవాబీయలేదు. మొహంముడుచుకుంది.

"ఇక్కడే పడుకునివుండు" అంది ఒకనిర్ణయానికివచ్చి, పాల్ మొహంమీదికి సూటిగా వంగుతూ. "యిక్కడే పడు కునివుండు. నేనువెళ్ళి ద్రాక్షసారా, మిరియాలపొడి కలిపి, సోడా తీసుకుని యిప్పుడే తిరిగివస్తాను. వినిపించిందా?"

ఇలాచెప్పి ఆమె లేచి వెళ్ళిపోయింది. ఆ ఇద్దరు యువ తులు తలుపులు బార్లాతీసిఉంచి వెళ్ళిపోయారు. వారిద్దరూ తీవ్రంగా వాదించుకోవడం పాల్ కి వినిపించింది.

ఇదంతా తనభ్రమఅని పాల్ అనుకునేవాడేగాని, నోట్లో ఇంకా పాలరుచి పోలేదు. చొక్కామీద పాలుపడి తడిఅవడం గమనించాడు. మెత్తనిచేయి చెంపలు, నుదురు తడుముతూ బుజ్జగించినఅనుభూతి ఇంకావదలలేదు. ఆమెరాకకోసం నిరీక్షిం చాడు. విచిత్రమైన కుతూహలం అతనిని ముంచెత్తి, రోగిష్టి భావాలను తరిమివేసింది. ఇకముందు ఏంజరుగుతుందో తెలుసు కోవాలని మహా ఆదుర్దాపడ్డాడు. ఇదివరకెన్నడూ ఇలా ఆదుర్దా పడిఎరగడు. గుమ్మంవేపుకు వీపుపెట్టి ఒకపక్కకుతిరిగి ఆఇంటి ఆవరణమీద దృష్టికేంద్రీకరించాడు.

ఒకచేతితో సీసా, ఒకచేతితో వెచ్చటిగుడ్డపేలిక పట్టు కుని ఆమె తిరిగి వచ్చింది. సీసామూతిమీద ఒకగిన్నె ఉంది.

"యిదిగో తాగు" అంది. పాల్ గిన్నెకోసం చేయి చాచాడు. ఆమె గిన్నె చేతి కందివ్వకుండా అతనినోటిలో

వోడ్కా పోసింది. వోడ్కా గొంతుదిగగానే నోరు, గొంతు మండిపోయాయి. దగ్గువచ్చింది.

"బాగా పనిచేస్తుంది" అంది విజయగర్వంతో. తక్షణమే వెచ్చటిగుడ్డ పేలిక ద్రాక్షసారాలో ముంచి నుదురుమీద వేసింది. పాల్ కిక్కురుమనకుండా ఆమెకేసే దృష్టినిగిడ్చి చూస్తున్నాడు.

"సరే, యిక మనం మాటాడుకోవచ్చు. మీ యజమాని పట్టి పిసినిగొట్టు. వాడు సరకానపడ! రేపు నేనే స్వయంగా నిన్ను అసుపత్రికి తీసుకువెళతాను. వంట్లో యే మాత్రం బావుంటలేదు కదూ? యేంచేస్తావ్. కాస్త ఓపిక పట్టాలి. తొందర్లోనే తగ్గుతుందిలే. మాటాడడం కష్టంగా లేదూ?"

"ఊహుఁ—పరవాలేదు. మాటాడగలను"

"ఊహుఁ—వద్దు, వద్దు. మాటాడకుండా పడుకో. రోగిష్టివాళ్లు మాటాడకూడదని డాక్టర్లు సలహాయిస్తుంటారు. మెదలకుండా పడుకుని విశ్రాంతితీసుకో"

ఇక మాటాడడానికి ఏమీ తోచలేదు. మనసులో ఏదో బాధపడుతున్నదానిలాగా చుట్టూచూసింది.

పాల్ ఆమెకేసి తేరిపారజూస్తూ 'యిదంతా యీమె యెందుకు చేస్తోంది? పరిచయంలేదే! యజమాని చెప్పినమనిషి యీమేఅయివుండవచ్చు. పేరేమన్నాడు? తెలుసుకోవాలి!" ఇలా ఆలోచించసాగాడు పాల్.

"సీపే...రే...విఁటి?" అని మెల్లగా ఆమెచెవిదగ్గర నోరు పెట్టి అడిగాడు.

"నా పేరా? నటాల్యా క్రివ్‌టోస్నవా. యెందుకు?"

"అబ్బే! వూరికినే!"

"ఓ!" అంది అస్పష్టంగా. అతనిని ఆపాదమస్తకం పరికించి మెల్లగా తనలోతాను కూనిరాగంతీయసాగింది.

"మరి నీపేరు?" అని హఠాత్తుగా అడిగింది, పాట ఆపివేసి.

"పాల్"

"నీ వయసెంత?"

"యిరవై"

"అంటే తొందర్లోనే సైన్యంలో జేరవచ్చునన్నమాట!" అని ఊరుకుంది. కొంచెంఆగి,

"నీకు చుట్టాలెవరూ లేరా?"

"లేరు. నేను అనాథబాలుణ్ణి" అన్నాడు పాల్ ప్రశాంతంగా. తలనొప్పి మళ్ళీ ఎక్కువైంది. దాహంఅయింది.

"ఓ..." ఆమె దగ్గరగా జరిగింది. అంతపెద్దవాడు అనాథబాలుడేమిటా అని ఆశ్చర్యంతో అతనిని పరీక్షగా చూచింది.

యింకా కాస్త తాగిద్దూ!"

"యిదిగో, యిదిగో, తాగు" అంది. గిన్నెలో పాలు పోసి, తొందరగా అతనితలకింద చేయిపెట్టి లేవదీసి మెల్లగా

"శుభం! క్రీస్తు నిన్ను రక్షించుగాక!" అంది.

పాల్ పాలుతాగాడు. గుటకవేస్తూ మధ్యమధ్య ఆమె మొహంకేసి చూడసాగాడు. అంతకుపూర్వం ఆమొహంలో

చీకూచింతా కనిపించలేదు. మరి ఇపుడు విచారంగా ఆలోచనా యుతంగా ఉంది. ఈకవళిక అతనికి సుపరిచితమైందే. అర్థమైందే. ఆమెతో మాటాడడానికి ప్రోత్సహించింది.

పాలుతాగడం పూర్తికాగానే, హఠాత్తుగా బిగ్గరగా "యిదంతా యెందుకుచేస్తున్నావో చెప్పు" అని అడిగాడు.

"యెందుకా?" ఆమె కలవరపడి ప్రశ్నార్థకంగా పాల్ వంక తేరిపారజూసింది.

"యిదంతా...యెందుకు? నాకెంత వుపకారంచేశావు...! యెంత జాగ్రత్తీసుకున్నావు...యిదంతా యెందుకు?" అని ఎలాగో అనేశాడు. దెబ్బతిన్నదానిలాగా ఆమె దూరంగా జరిగేసరికి భయపడ్డాడు.

"యెందుకో నాకే తెలీదు. వూరికేనే. నువ్వు మానవుడివి. అవునా? కాదా? నువ్వు విచిత్రమైనవాడివి, నిజం?" ఇలా అని ఆమె బుజాలుఎగరవేసింది.

పాల్ అనిర్దిష్టంగా తలపంకించాడు. గోడవేపుతిరిగి మెదలకుండా పడుకున్నాడు. చిత్రవిచిత్రమైనఆలోచనలు సుళ్ళు తిరగజొచ్చాయి. జీవితంలో మొదటిసారిగా అతనిని దయతో చూచింది ఎవరు? అతను అసహ్యించుకుని భయపడే స్త్రీ లోకంలోని ఒకస్త్రీ. స్త్రీలోకంమీద అరెఫీవైఖరి జ్ఞాపకం వచ్చింది. దుకాణంలోనివారు ముచ్చటిస్తున్న ఇద్దరిస్త్రీలలో ఒకతె. కొంతకాలంనుంచి పాల్ ఎక్కువగా స్త్రీలనుగురించి ఆలోచిస్తున్నాడు. ఆ ఆలోచనలను తననుంచికూడా దాచుకుంటున్నాడు. అటువంటి ఆలోచనలువస్తున్నందుకు కుమిలి

పోతున్నాడు. స్త్రీ పురుషునిఅనంతశత్రువు. చక్కటిఅవకాశం కోసం వేచిఉండి అతనుచిక్కగానే బానిసనుచేసుకుని రక్తం పీల్చేస్తుంది. ఈ అభిప్రాయాన్నే అతను ఎక్కువగా విన్నాడు. ఒకొకపుడు అందమైనయువతి భయపడుతూ భయపడుతూ తొందరతొందరగా వీధివెంట వెళుతుంటే పాల్ ఆమెవంక చూసి, 'యింతభయస్తురాలు శత్రువు యెలా అవుతుంది ?" అని అనుకునేవాడు. ఇతరులు స్త్రీలనుగురించిమాటాడుతుంటే కుతూహలం దాచుకోలేకపోయేవాడు. దానిమీద దుకాణం యజమాని, పనివారు అతనిని వేళాకోళంపట్టిస్తూండేవారు. తరుచు తమలోతాము పశ్చాత్తాపడుతున్నట్టు నటించి, పాల్ పవిత్రతను పొగిడేవారు. పురుషునిజీవితంలో స్త్రీలు సర్వాతో ముఖపాత్రవహిస్తారని అతనుగ్రహించాడు. కాని తనస్వంత ఆలోచనవల్ల, భావాలవల్ల ఈ నిర్ణయానికీ, స్త్రీలు పురుషునికిశత్రువులనే సామాన్యనిర్ణయానికీ కారణమ్యం తెలుసుకోలేకపోయాడు.

ఒకసారి యజమాని, "స్త్రీవిషయంలో జాగర్తగా వుండు పాల్ ! యెన్నడూ ఆడదానికిలొంగిపోకు. అలాఅయితే జీవితం సాఫీగానడుస్తుంది. యెవరినిఅడిగినా స్త్రీకంటె పెద్ద బంధనం వుండదనే చెపుతారు. వాళ్ళకి ఆశ యెక్కువ. యెంత సేపూ బాగా బతకాలని, యెక్కువ పనిచేయగూడదని ఆలోచిస్తూంటారు. నాకిపుడు యాభైయేళ్ళు. రెండుసార్లు పెళ్ళిచేసుకుని అనుభవించాను. నామాట నమ్ము." అని హెచ్చరించాడు.

కాని, ఈమె విచిత్రమైనమనిషి. మొదటిసారిగా సంతో

షం రుచిచూపించింది. ఎప్పుడూ విచారంగాఉంటూ నలుగురి లాగా నడుచుకుని తనవిషయంలో శ్రద్ధతీసుకుంది. ప్రపంచంలో నాఅనేవాళ్ళులేక, ఒంటరిబతుకుబతుకుతున్న అతనిదగ్గరకు వచ్చింది, పక్కన కూర్చున్నది.

"ఆమె యిప్పుడు యేంజేస్తోందో?" అనే ఆలోచనవచ్చి ఆమెనుచూచేందుకు వీలుగా మెల్లగా పక్కకుతిరిగాడు.

ఆమె నేలమీద కూర్చుని, ఆలోచనాపూర్వకంగా సగంతెరిచిఉన్న గుమ్మంలోనుంచి ఆవరణలోకి చూస్తోంది. ఆమెమొహం అందంగా, లలితంగా దయఒలుకుతూఉంది. నీలి కళ్ళల్లో దయ కానవస్తోంది. పెదవులు లావుగా ఎర్రగా ఉన్నాయి.

"నామీద యింత దయచూపినందుకు కృతజ్ఞుణ్ణి." అన్నాడు పాల్ మెల్లగా, చేతిని అప్రయత్నంగా ముందుకు జాపుతూ.

ఆమె వణికిపోయింది. ఓరచూపుచూసింది. కాని, అతని చేతినిమాత్రం పట్టుకోలేదు.

"నిద్రపోయావనుకున్నా. చూడు, నువు యిక యిక్కడ వుండడానికి వీలులేదు. వెంటనే యిక్కడినుంచి వెళ్లిపోవాలి. యిక్కడ మహా తేమగావుంది. ఊఁ-లే!"

పాల్ చేతిని వెనకకుతీసుకోకుండా పట్టుదలతో మళ్ళీ "యింత దయచూపినందుకు కృతజ్ఞుణ్ణి!" అన్నాడు.

"అరె! మళ్ళీ ఆమాటే మొదలెట్టావ్! యేవిఁటిది? యేందయ? బయట వేండ్రంగా వుంది. కాసేపు యిక్కడ

కూర్చుంటే హాయిగావుంటుందని కూర్చున్నా. ఊఁ— యింక లే!"

ఆమెకు కోపంవచ్చినట్టుంది. లేవడానికి సాయపడుతూ కళ్లుకనిపించకుండా మొహంతిప్పేసుకుంది.

పాల్ లేచాడు. నెత్తుటి చర్రున నెత్తికెక్కింది. మళ్లీ మందంగా ధ్వనులు వినిపించసాగాయి.

"నావల్లగాదు..." అన్నాడు మెల్లగా. కాళ్ళు వణికి పోయాయి. బాధ ఎముకలుకొరికివేస్తున్నట్టు అనిపించింది.

"సరేలే. యేదోవిధంగా తట్టుకోవాలి! యిక్కడవుండ డానికి మాత్రం వీల్లేదు" ఆమెసాయంతో ఆవరణలోనుంచి ఏదోపొగమంచులో తేలిపోతున్నట్టు నడిచివెళ్ళాడు. ఆ పొగ మంచులోనుంచే గుమ్మంలోనిలబడ్డ యజమాని మొహంలో, గూస్ మొహంలో కపటమందహాసం గమనించాడు.

"యిక అడుగువేయలేను!" అన్నాడు బొంగురుగా. అంతుపంతూలేని అఖాతంలో పడిపోతున్నట్టు అనిపించింది అతనికి.

## 6

జీవితంలో ప్రథమంగా ఆసుపత్రిఅంటేఏమిటో పాల్ తెలుసుకున్నాడు. అసహ్యంవేసే వసుపువచ్చనిగోడలు, మందులదుర్వాసన, అలసిపోయి చిరుబుర్రులాడే తయినాతీలు, స్వార్థాపేక్షలేని డాక్టర్ల మొహాలు, వారిసహాయకుల మొహాలు, మూలుగులు, సంధిమాటలు, రోగులతలతిక్క, బూడిదరంగు దుస్తులు, టోపీలు, రాతినేలమీద ఈడ్చుకుంటూవెళ్ళే చెప్పుల

చెప్పాడు—ఇవన్నీ కలసి కలగాపులగమై నిరాశగా, నీరసం ఎడ
తెగకుండాపీడించే దుఃఖంగా రూపొందుతాయి.

పాల్‌కి సంధిపుట్టి పదకొండురోజులైంది. గండంగడిచి
అయిదురోజులైంది. ఆరోగ్యం బాగుపడుతోంది. దుకాణం
యజమాని ఒకసారి, గూన్ రెండుసార్లు, 'నీలక్క' ఒంటరిగా
ఒకసారి, స్నేహితురాలితో ఒకసారి వచ్చి చూసివెళ్ళారని
పరిచారకుడు చెప్పాడు. ఆమె తేయాకు, పంచదార, తాండ్ర
తదితరచిల్లరవస్తువులు సంచిలో తెచ్చి ఇచ్చివెళ్ళింది.

పరిచారకుడు 'నీలక్క' వచ్చిందని చెప్పేసరికి పాల్
ఆశ్చర్యచకితుడయాడు. తర్వాత నటాల్యా వచ్చిఉంటుందని
ఊహించాడు. ఎందుకనో సంతోషంకలిగింది.

"బలేఅమ్మాయి!" అనుకున్నాడు మెల్లగా. ఆమెను
చూడడం ఎంత ముచ్చటగాఉంటుంది!

విషజ్వరరోగులను చూడడానికి ఎవరినీ రానీయరు. 5వ
వార్డులోకి పంపినతరువాత రానిస్తారు.

"డాక్టర్లు, తయినాతీలు తప్ప యింకెవరూ యిక్కడికి
రావడానికి వీల్లేదు" అని పరిచారకుడు చెప్పాడు. రావడానికి
తమకు ప్రత్యేకహక్కు ఉందనేగర్వంతో ఈవిషయంచెప్పినా,
పాల్‌మాత్రం "5వ వార్డులోకి యెపుడు పంపుతారు?" అని
ప్రశ్నించాడు.

అదంతా ముక్కుమీద ఆధారపడిఉంటుందని తెలియ
జేస్తూ, "యిప్పుడు నీముక్కు పసుపువచ్చగా వుంది. యెండి
పోయింది. కాని తొందర్లోనే వాచి యెఱ్ఱబడుతుంది. అల్లా
జరగ్గానే 5వవార్డులోకి పంపిస్తారు. విషజ్వరరోగుల్ని ముక్కును

బట్టి మారుస్తారు. యిక్కడ అదే రివాజు. యిప్పటికి యేడేళ్ళ నించీ మా కిదేపని. యిదే పద్ధతి!"

తయినాతీ మాటలపోగు. అక్కడఉన్న తొమ్మండుగురు రోగులలో పాల్ ఒక్కడే వినగలిగిందీ, అర్థంచేసుకోగలిగిందీ. తక్కినవారు మాటాడేస్థితిలో లేరు. అందువల్ల ఒక్కడే బరువంతా భరించాలి. ఆ తయినాతీ పొట్టి, ఎముకలపోగు, ఎఱ్ఱ జుట్టు. ఎప్పుడూ విచారంసూచించేకళ్ళు. పనిలేనపుడు పాల్ మంచంమీదకూర్చుని, తెగమాటాడేవాడు.

"యెలావుంది? కొంచెం నయమేనా? అంతా సవ్యంగానేవుందికదూ? తొందర్లోనే నిన్ను అయిదోవార్డుకి పంపుతారు. నీకుజబ్బుచేయడం మంచిదేఅయింది. విషజ్వరంవుందే, అది చిత్రమయినజబ్బు. మనిషిని పవిత్రంచేసేస్తుంది. మనిషి ఎంతనీచుడైనా కానీ, యెన్నిఘోరపాపాలుచేసినవాడైనా కానీ, విషజ్వరంవస్తే పవిత్రుడైపోతాడు. కారణం సంధి. సంధిలో ఆత్మ శరీరాన్నివిడిచిపెట్టి తిరుగుతూ, యమయాతనలుపడి పశ్చాత్తాపం చెందుతుంది. కాని మరి చాలామంది విషజ్వరంతో చచ్చిపోతారే అని నువ్వు అడగవచ్చు. నిజమే యేంచేస్తాం? ఖర్మ! బైబిలు అలాగే చెపుతోంది. నిజానికి విషజ్వరంవల్ల యెవరూచావరు. యీగూడు బతుకు భారంవల్ల జీర్ణించిపోతుంది. అపుడు ఆత్మకు కొత్తగూడు కావాలి. మనిషికి ఉన్నదల్లా ఒకేఒకగూడు, భూమి! అవునవును. మీ బంధువులుయెవరైనా చనిపోయారా? లేదూ? మా కుటుంబంలో పదకొండుమంది చనిపోయారు. వాళ్ళల్లో ఒకడిని ప్రాణాలతోనే భూమి మింగేసింది. అతను నీటిగొట్టాలు

అమర్చేవాడు. ఒకమాటు నీటిగొట్టం అమరుస్తూండగా భూమి దభీమంది. నికొలాయ్ కనిపించలేదు. భూమి మింగేసింది. తవ్వి బయటికితీశారు. కాని ప్రాణంలేదు. అవునవును, భూమి మనిషిని మింగేస్తుంది. తప్పించుకుపారిపోలేని వదిలో దూకు, నేలలో కూరుకుపోతావు. నిప్పులోపురుకు – బూడిదఅయి పోతావు. భూమి తనసంగతేమిటో తను చూసుకుంటుంది. తొందర్లోనే 'అనాసిమ్, రా, రా! సమాధిఅవుదువుగాని రా' అని పిలుస్తుంది. నేను వెళ్ళి పడుకోవాలిసిందే. యేమన్నా చేయి, వెళ్ళితీరాల్సిందే. ఆ పద్ధతే అంత! 'నేను రాను పో' అని గొడవచేయొచ్చు, నీభూమ్మీద ప్రాపిరితీస్తుంది. తలకిందులైపోతావు. లొంగిపోతావు. నీపని అయిపోతుంది. యేమీ మిగలదు. ప్రపంచంలో నడుస్తున్నంతసేపే ప్రపంచం సజీవంగా వుంటుంది''

ఒక్కొక్కప్పుడు రెండేసిగంటలు ఏకధాటిగా మాటాడే వాడు. వింటున్నారా లేదా అని పట్టించుకునేవాడుగాదు. తేరి పారజూసేకళ్లు తళతళలాడేవి. కంటిపాపను పొరకప్పినట్లు విచిత్రమైనరంగును అలవర్చుకునేవి. అటువంటపుడు హీనస్వరంపడేది. మాటలు ఒకదానికొకటి సంబంధంఉండేవికాదు. వాక్యాలు కురచఅయేవి. చివరకు దీర్ఘంగానిట్టూర్చి మాటమధ్యలో ఆపి వేసేవాడు. విపరీతమైనభయం కళ్ళల్లో గోచరించేది.

తయినాతీమాటలు పాల్‌హ్పృదయానికి హత్తుకోలేదు. అసలు ఎప్పుడూ వినేవాడేకాదు. తనఆలోచనలలో తను మునిగి ఉండేవాడు. ముందుముందు జీవితం బాగుపడుతుందనేఆశ కలిగి ఉత్సాహంగా ఉండేవాడు. జీవితం ఎలా పరిణమిస్తుందో

స్పష్టంగా ఊహించుకోలేకపోయేవాడు. గాలిలో మేడలు కట్టుకోవడానికి కావలసినసాధనసామగ్రి లేదు. ఇతరులమాటలను బట్టి మాత్రమే జీవితాన్ని గురించి తెలుసుకున్నాడు. ఇంత వరకు ఆజీవితంలో చురుకుగా పాల్గొనకుండా తప్పించుకుతిరిగాడు. ఇప్పుడు ఏదో కొత్తది, పెద్దది, తనకు తెలియనిది సమీపిస్తోందనీ, అది కొత్తజీవితాన్ని రూపొందిస్తుందనీ అనిపిస్తోంది. అసలు క్రమబద్ధంగా ఎన్నడూ ఆలోచించి ఎరుగడు. చాలినన్నిమాటలు అతనికిరావు. భావాలు బొత్తిగా తక్కువ. ఆసుపత్రిలో స్పృహవచ్చింతర్వాత, నటాల్యానీలికంటిచూపు జ్ఞాపకంవచ్చినతర్వాత కొత్తగా మేలుకొన్నట్టయింది. కొత్త భావాలు జనించాయి. ఆమె రెండుసార్లు ఆసుపత్రికివచ్చి వెళ్ళిందని తయినాతీ చెప్పడంవల్ల ఈ భావాలు మరింత పెచ్చుపెరిగాయి.

ఇరవైసంవత్సరాలనుంచీ ఎవరూ అతనివిషయమై శ్రద్ధ తీసుకోలేదు. కాని, అతనూ మానవుడే! ఎవరోఒకరు శ్రద్ధ తీసుకోకపోతే అతనుజీవించే దెలా? పైగా ఒంటరివాడు. అందుచేత ఎవరోఒకరు తనవిషయమై శ్రద్ధతీసుకోవాలనేతృష్ణఅధికం. ఈ తృష్ణ సహజంగా, అజ్ఞాతంగా జనించింది. ఈ శ్రద్ధ ఎలాంటిదో, ఏరూపంలో ఎప్పుడు ప్రత్యక్షమవుతుందో అతనికి తెలియదు. ఇప్పుడు ప్రత్యక్షమైంది! అసలు ఇది ప్రారంభదశ మాత్రమేననీ, భవిష్యత్తులో నూతనభావప్రపంచం కాచుకుని ఉందనీ ఆశించాడు. రోగంమూలంగా ముక్కచెక్కలైపోయిన శరీరబలం తిరిగి సంపాదించుకోవాలనే పశుభావం భవిష్యత్తు

సాధ్యమైనంతతొందరలో రూపొందాలనే ఆకాంక్షను రేకెత్తిం చింది.

పాల్‌ని అయిదోవార్డుకిపంపడం తయినాతీ అనాసిమ్‌కి విచారకారణమైంది. అతనిమాటలు వినేవాడు లేడు. "ముక్కు ఇంకా తగినంతవాయలేదు. చనిపోయేప్రమాదం ఉంది. ముందు గానే అయిదోవార్డుకు పంపుతున్నారు" అని గట్టిగా వాదించాడు.

ఒకరోజున పాల్ కలగాపులగంగావచ్చే సగంసగం ఆలోచనలలో, సగంసగంఅనుభూతులలో మునిగిపోయి, లోకప్పున మూగినఈగలను చూస్తూ మంచంమీద పడుకుని ఉండగా తలకిందనుంచి మృదుమధురంగా "పాల్!" అని ఎవరో పిలిచారు.

పాల్ వణికిపోయాడు. భయపడిపోయాడు. తలవని తలంపుగా రావడం! ఆమెకూడా కొంచెం కంగారుపడింది.

"హల్లో! మార్చారా? బలే! ఇదిగో,.." అంటూ చిన్నసంచిఒకటి అతనిచేతుల్లో పెట్టింది. సిగ్గు, భయంవేసి చుట్టూ జాగ్రత్తగా చూసింది.

అంతులేనిసంతోషం పాల్‌భయాన్ని పారదోలింది. అతనిచెంపలు కొద్దిగా ఎర్రబడ్డాయి.

"కృతజ్ఞుణ్ణి, కృతజ్ఞుణ్ణి! ఇక్కడ కూర్చో... ఇక్కడ... యిక్కడ సదుపాయంగావుంటుంది. కృతజ్ఞుణ్ణి. నువ్వు చాలా మంచిదానివి. తప్పకుండా..." మాటనత్తింది. కళ్ళు మెరిసి పోయాయి. మనిషి పూర్తిగా మారిపోయాడు.

పాల్ హఠాత్తుగా ఇలా మర్యాదచూపేసరికి ఆమె మరింత ఖంగారుపడింది. ఒక్కొక్క రోగివంక చూడసాగింది. వారిలో ఎవరైనా తనకు అసహ్యంగొలిపేవారున్నారేమోనని ఆమెభయం!

"సరే, కూర్చుంటా. అట్టే శ్రమపడకు. నీవంటికిమంచిది కాదుకూడా..." అంది మెల్లగా, చుట్టూ పరీక్షగాచూస్తూనే.

పాల్ ఉత్సాహంతో అన్నాడు:

"నువేం గొడవపడకు. వీళ్ళంతా మంచివాళ్ళు. రోగిష్టులు...మాటాడుకుందాం...వాళ్ళు యోగ్యులు. అపకారం తలపెట్టేవాళ్ళు కారు...సరసులు...ఓ–నువ్వొక్కడుంటే నాకెంత సంతోషంగావుందనుకున్నావ్?" అని బిగ్గరగా అంటూ ముగించాడు.

ఆ వార్డు అంతా పరీక్షగాచూడడం పూర్తిచేసి, ఆమె నోరంతావిప్పి దయాపూర్వకంగా చిరునవ్వునవ్వింది.

"నీ ఆరోగ్యం కుదుటపడుతోంది. సంతోషం. ఇదివరకు నేనువచ్చి చూసివెళ్ళాను. అప్పుడు నీకు స్పృహలేదు. మరేం కలవరపడబోకు. నీకోసం...డాక్టర్లు తీసుకురానిచ్చారు... ఇదిగో తిను!" అంటూ ఆమె సంచివిప్పసాగింది.

పాల్ సంతోషంపట్టలేక సంచి గుంజుకున్నాడు. గుంజుకుంటూంటే చేతులువణికాయి.

"నామాట నమ్ము! నువు స్వర్గాన్నుంచిదిగివచ్చిన దేవకన్యవి! దేవుడితోడు!"

"యేమిటీ నువనేది?" అంది మళ్ళీ కంగారుపడుతూ,

"అవును. అంతే. యెలాచెప్పాలో నాకు తెలీదు. నే నెప్పుడూ మౌనంగావుంటాను. కాని, నాకు అర్ధమయింది. ఆ అర్థమైందేవిటో చెపుతా విను. నిజానికి నాకూనీకూ సంబంధమేవిటి? నేను నీకు కొత్త, నువ్వు నాకు కొత్త. కాని మొదటిసారిగా నువ్వే ... నేలమాళిగలో ... యేకారణం లేకుండా...యింతకీ నేను ఒంటరివాడిని. నాజీవితంలో దయతో చూసినవారెవరూలేరు...అదీ అసలుసంగతి. తెలిసిందా? బలే! బలే!-అద్భుతం!"

ఇలా అని ఆవేశంతో ఆమెతో కరచాలనంచేశాడు.

"శాంతించు. యిది నీ ఆరోగ్యానికిమంచిదికాదు. యిలాచేస్తే నన్ను లోపలికిరానీరు..." ఇలా అతనిని శాంతపర్చాలనిచూసింది. అతనుమాటాడే ఉద్రేకపూరితమైన అసంబద్ధవాక్యాలకు కంగారుపడింది. ఈ ఆవేశానికంతటికీ తానే కారణమని గ్రహించింది.

"లోపలికి రానీరూ?" అన్నాడు పాల్ భయంతో, ఆమెమొహంలోకిచూస్తూ. పాల్ అసమ్మతిప్రకటిస్తూ, "అసంభవం. నువ్వు నా అక్కలావున్నావు! ఉహుఁ-రానీయపోవడమేవిటి? యెవరుచెప్పారు? నాకు హక్కుంది...ఫిర్యాదు చేస్తా..."

"ఓ-నువ్వు చిత్రమయినవాడివే! దేన్నిగురించి ఫిర్యాదు చేస్తావ్? నావుద్దేశం అదికాదు. యేంచేయాలనుకుంటున్నావ్ ! యిక్కడ విప్లవంతీసుకువస్తావా? చిత్రమైనవాడివే !"

నిజానికి ఆ ఆవేశంలో అతను ఆమెకు వెర్రిబాగులవాడిలా కనిపించాడు. అంత ఆవేశం ఎందుకుపడుతున్నాడో

ఆమెకు అర్థంగాలేదు. ఈ ఆవేశానికంతటకీ తాను కారణమని పాల్ స్తుతించడం ఆమెకు సంతోషదాయకంగాఉంది. కొంచెం ధైర్యం తెచ్చుకుని కొద్దిగా అధికారం చెలాయించసాగింది. ఆవిడ అధికారానికి అతను పూర్తిగా లొంగిపోయాడు. అధికారం చెలాయించడం ఆమెకు ఎంతసంతోషదాయకంగాఉందో ఆ అధికారానికిలొంగిపోవడంకూడా అతనికి అంత సంతోషదాయకంగానూ ఉంది. రొట్టెతినిపించింది. తలగడ సరిచేసింది. శరీరంలో ఎలాఉందని అడిగింది. చివరికి గట్టిగామాటాడింది. ఆమెతీసుకున్న శ్రద్ధకు అతను పూర్తిగా కరిగిపోయాడు. ఆమె చాలా సంతోషించింది.

సంతోషంతో, ఆశ్చర్యంతో అమె మొహంకేసి చూస్తూ కూర్చోవడంతో సంతృప్తిపడసాగాడు. తొందరలోనే ఆసుపత్రినుంచి పంపించివేస్తారు; అప్పుడు వచ్చి నన్ను చూడవచ్చు; నాతో టీతాగవచ్చు; అడవిలోకి షికారువెళ్ళవచ్చు; పడవలోప్రయాణంచేయవచ్చు, అనిచెప్పి అద్భుతంగా చిత్రించి చెప్పింది.

ఇదంతా అతను గుర్తించేసరికి సందర్శనాకాలం అయిపోయింది. ఆమె వెళ్ళిపోవాలి.

ఆమె వెళ్ళిపోయేటప్పుడు పాల్ ఆమెవంక దీనంగా చూసి, మళ్ళీ రమ్మని మెల్లగా వేడుకున్నాడు.

ఒంటరిగా పడుకుని కళ్ళుమూసుకున్నాడు. వెంటనే ఆమెరూపం అతని కనులముందు ప్రత్యక్షమైంది. పొట్టి, బొద్దు, అందచందాలు, ఆకర్షణీయమైన పెద్దపెద్దకళ్ళు. పైకి వంపుతిరిగి కొనతేలినముక్కు. ఎంతో అందంగా నవనవలాడుతోంది!

నల్లనిజా కేట్లు, నున్నగా దువ్వి జడవేసుకున్న జుట్టు—ఇవన్నీ కలిసి ఆమెను ఎంతో ప్రేమాస్పదురాలినిగా చేశాయి. ఆమె మాటాడుతుంటే నిండుపెదవులమధ్యగా తెల్లటిపళ్లు మెరిసి పోతాయి. అన్నిటికంటె మించి దయాగుణం ఆమెలోనుంచి పొంగిపొరలుతోంది.

ఈ చిత్రాన్నే పదేపదే నిర్మిస్తూ తనలో ఏదో మార్పు వచ్చినట్లు గ్రహించాడు. ఆమెతో అంత తొందరగా, అంత సులువుగా మాటాడగలగడం అతనికే ఆశ్చర్యంగొలిపింది. ఎంతప్రేమగా ఎంతమంచిగా అతని నాదరించింది. ఇలాంటి సున్నితఉద్వేగాలతో వండుకొని నిద్రపోయాడు.

ఆమర్నాడు పొగమంచుపట్టి హాయిగాఉంది. ఆ కిందటి రోజున జరిగిందంతా మనసులో చిత్రించుకోసాగాడు మంద హాసంచేసి వేయిసార్లు "కృతజ్ఞుణ్ణి" అని తనలోతాను గొణు క్కున్నాడు. ఈ ఒక్కమాట పదేపదే అనుకుంటూ వివిధఉద్వే గాలు అనేకం అనుభవించాడు.

ఆమర్నాడు రోగులనుచూడడానికి బంధువులను, స్నేహితులను రానిచ్చేరోజు. బహుశా ఆమె రావచ్చు. ఆమె వస్తే ఎలాఉంటుందో ఊహించుకోసాగాడు. ఆమెను పొగడ డానికి వాక్యాలు అల్లసాగాడు...ఆమెతోకలిసి పడవలో షికారుకువెళ్ళినట్టు, అరెఫీనిగురించి ఆమెకు చెప్పినట్టు మనసులో ఊహించుకోసాగాడు.

మర్నాడు వచ్చిపడింది. ఉద్రేకంతో శరీరంవణికింది. ఉదయంమొదలు సాయంకాలంవరకు గుమ్మంవంక ఆకాంక్షతో చూశాడు. ఏనిమిషంలోనైనా రావచ్చుని ఆశిస్తూ నిరీక్షిం

చాడు. మొదటిసారి ఆమె రోగులను పరీక్షగాచూసినట్లు తాను చూశాడు. ఆమెవస్తే అతనిపక్కన మంచంమీద కూర్చుంటుంది. మాట్లాడుకోవచ్చు...ఆరోజు గడిచిపోయిందిగాని, ఆమెమాత్రం రాలేదు.

ఆరాత్రి చాలాసేపటివరకు పాల్ కి నిద్రపట్టలేదు. ఆమె రాకపోవడానికికారణం ఊహించాలని యత్నించాడు. ఉదయం నిద్రలేచేసరికి తలబద్దలయేటంత నొప్పివచ్చింది. మైకంకమ్మింది.

అమర్నాడు కదలకుండా, మాటాడకుండా, దేనిని గురించీ ఆలోచించకుండా పడిఉన్నాడు. ఇలా ఆమెరావలసిన రోజులు అనేకం వచ్చివెళ్ళాయి. కాని ఆమె రానేలేదు.

పాల్ పక్కమీదపడుకుని ఆడవాళ్ళవిషయంలో తాను విన్న చెడుఅంతా నెమరువేసుకోసాగాడు. ఈ చెడుగుణాలు నటాలియాకు అంటకట్టాలని యత్నించాడు. కాని చెడు ఏమీ కనిపించలేదు. ఆమె అసహ్యంగాఉన్నట్లు, తాగిఉన్నట్లు, తననుతిడుతున్నట్లు వేళాకోళంచేస్తున్నట్లు ఊహించుకోవాలని యత్నించాడు. కాని చివరకు అతనిఊహా ప్రపంచంలో ఆమె నిరాడంబరంగా, అందంగా, దయార్ద్రహృదయగా నిలిచి పోయింది.

ఇలా రోజులు పరుగెత్తాయి. నడవలో నడవసాగాడు. నడవకువీధివేపున కిటికీలున్నాయి. ఏదోఒకకిటికీదగ్గర నిలబడి ఎప్పుడు ఆసుపత్రినుంచి పంపిస్తారా అని ఆలోచించేవాడు. ఆరోగ్యంగా గడబిడగా తిరిగే ప్రజలమధ్య వీధులలో ఎపుడు తిరుగుదామాఅని తహతహలాడిపోయేవాడు.

ఆసుపత్రివేపుకువచ్చే ప్రతియువతీ అతనిలో ఆశను

రేకె త్తించేది. అరగంటసేపు ఆమెవస్తుందేమోనని నడవలోకి తేరిపారజూసేవాడు. కాని ఆమె రాలేదు. విచారం వేసింది. మోసగించిందనేభావం ప్రబలింది.

ఒకరోజున తయినాతీగొంతు వినిపించింది.

"పాల్ గిబ్లీ! ఆఫీసుకు రమ్మంటున్నారు." పాల్ అక్కడికి ఉరుకుతూంటూ వెళ్లాడు.

"యిదిగో తీసుకో! వారెవరో తెచ్చియిచ్చారు" అని బక్కబల్చగా పొడుగ్గాఉన్నవ్యక్తి మీసాలు మెలివేసికుంటూ అన్నాడు. అతను డాక్టరుకుసహాయకుడు. కాగితంపొట్లంఒకటి పాల్ కి అందించాడు.

"మరి-యిదెవరు తెచ్చియిచ్చారు?" అని అడిగాడు వణికేచేతులతో పొట్లం తీసుకుంటూ.

"ఒకముసిలాయన తెచ్చాడు. తెచ్చిచ్చి యేమన్నాడంటే..."

పాల్ విచారంగా తలపంకించాడు. పొట్లంఅతనిముందు పెట్టేశాడు.

"...నీయజమానితో మొహానికి కట్టుకట్టుకుని ఒక యువతికూడా వుంది"

పాల్ వణికిపోతూ పొట్లంతీసుకున్నాడు.

"కట్టు పెద్దదా?" అని అడిగాడు.

సహాయడాక్టరు కనుబొమలు, మీసాలు పైకిఎగరవేసుకుంటూ, "కట్టు పెద్దదాఅని అడగడంలో నీ వుద్దేశమేమిటి?" అన్నాడు.

"అబ్బే! యేంలేదు. కృతజ్ఞుణ్ణి. ఆమెకి పంటినెప్పి వచ్చి వుంటుంది"

"ఊఁ, కావచ్చు!" అని సహాయకడాక్టరు తల వంకించాడు.

"నన్నుగురించి అడగలా?" పాల్ ఆదుర్దాగా అడిగాడు.

"ఆఁ, అడిగింది. 'అతను వెర్రిబాగులవాడు. పాపం! క్షమించండి' అంది. నువ్వు వెళ్ళవచ్చు. క్షమించాం".

పాల్ వెనుదిరిగి వెళ్ళిపోయాడు. తననుచూచి అంతా నవ్వుకుంటున్నారని గ్రహించాడు. ఆమె తననుచూడడానికి ఇన్నాళ్ళనుంచి ఎందుకురాలేదో ఇప్పుడు ఊహించుకోగలిగాడు. పంటితీపితో బాధపడిఉంటుంది. తగ్గగానే వచ్చింది. ఎంత దయగలమనిషి!

ఒకవారంతర్వాత మళ్ళీ పాల్ని ఆఫీసుకు పిలిపించారు. అసిస్టెంటుడాక్టరు ఒకపుస్తకంచూస్తూ గణనఫలకంమీాద లెక్క చూస్తున్నాడు.

"నీ వస్తువులన్నీ తీసుకున్నావా?" అని జవాబుకోసం ఆగకుండానే, "సరే, మంచిది. యిక నువ్వు వెళ్ళిపోవచ్చు," అన్నాడు.

పాల్ వంగి నమస్కరించి, వీధిలోకి వచ్చాడు. అరగంట సేపటికి ఎండకు అలసటకు అతనికళ్ళు బైర్లుకమ్మినాయి. తల తిరుగసాగింది. దుకాణంలో ప్రవేశించాడు. యజమాని ఎదురయి "ఓ! వచ్చావా, మంచిది. అదిగో వచ్చేశాడు. బలే! నవ్వడంనేర్చుకున్నావే!"

దుకాణంచూస్తూ పాల్ చిరునవ్వునవ్వాడు. దుకాణం తలుపు తెరిచి గుమ్మంలో కాలుపెట్టగానే మనసుకరిగిపోయింది. మంచిమంచిభావాలు రగిలాయి. ఇక్కడ ప్రతిదీ చక్కగా ఉంది. సుపరిచితమైంది, సన్నిహితమైంది. పొగచూరినగోడల మీది తెల్లమచ్చలు అతన్నిచూసి నవ్వుతున్నట్లనిపించింది. మూల అదిగో అతనిపక్క! దానిపక్కగోడకు రెండుచిత్రాలు వేలాడుతున్నాయి. ఒకచిత్రంపేరు 'విచారణదినం' రెండోది 'జీవితపథం.'

మిష్కా ఆశ్చర్యంతో నోరుతెరచుకుని నిలబడ్డాడు. హుషారుగా ఆవేశంతో సల్లటికళ్ళు పాల్ మీద నిలిపాడు. మొహంలో ఆనందం తాండవించింది. యజమానికూడా పాల్ తిరిగివచ్చినందుకు చాలా సంతోషించాడు.

మిరాన్ టూపోర్కోవ్ ఇలా అన్నాడు:

"బలేబలే! లోపలికివచ్చికూర్చుని విశ్రాంతితీసుకో. అలసిపోయివుంటావు. మిష్కా, నేనూ యిక్కడిపనులన్నీ చూస్తున్నాం. గూన్ తాగుడుకుఅలవాటుపడిపోయాడు. ఇంకొకడిని పనిలోకి తీసుకోదలుచుకోలేదు. యేనిమిషంలోనైనా నువ్వు తిరిగివస్తావనే అనుకుంటున్నాను. సరే, మంచిది. యిక కొట్టుపని మొదలుపెడదాం. ఇక జోరుగా పనిచేద్దాం. మళ్ళీ నామనస్సు బాగుండడంలేదు. చాలాకాలంనించీ తప్పతాగడంలేదు. అసలు తాగడంలేదనికాదు. మత్తెక్కేటంత తాగడంలేదు."

పాల్ వింటున్నకొద్దీ సంతోషంఎక్కువైంది. యజమాని హుషారుగా మాటాడడమేగాకుండా అతనిగొంతులో ఆప్యా

యత, మంచితనం ధ్వనించాయి. పాల్ మనసు కుదటపడి హాయిగా ఉంది.

"మిరాన్! యిక పని మొదలుపెడదాం!" అన్నాడు పాల్ ఉత్సాహంగా, యజమాని మాటలుకట్టిపెట్టి పాతబూటు మీంది రంధ్రానికి వేసేందుకు తోలుముక్క కోలుస్తున్నాడు. "నన్ను వచ్చిచూసివెళ్ళినందుకు మరీమరీ కృతజ్ఞుణ్ణి. మీరు రావడం నాకు చాలాముఖ్యం. నేను యీప్రపంచంలో ఒంటరి వాణ్ణిగదా!" అన్నాడు పాల్ ఉత్సాహంగా.

"ఓ!" యజమాని ఈలవేసి పాల్ మాటలకు అడ్డు వచ్చాడు. "యిప్పుడు యిలామాటాడడం నేర్చుకున్నావన్న మాట! బలే! చెడ్డతోపాటు మంచికూడా వుంటుంది. నీకు జబ్బుచేయకముందు చచ్చినా యిలా మాటాడేవాడివా? మంచిది. కాలం! కాలంవచ్చింది. యింకోవిషయం చెప్పదల చాను. నువు నటాల్యాను చూసిరా. వెళ్ళు. ఆమె అటువంటి దైనా, వెళ్ళి కృతజ్ఞత తెలపాల్సిందే. నీవిషయంలో యెంత బెంగపెట్టుకుందో నీకేం తెలుసు? యెంతో బాధపడింది. ప్రతి రోజూ కిందికివచ్చి 'అక్కడికెళ్ళావా? చూశావా?' అనేది. అవును భాయీ! ఆమెలో యింకా కొంత మంచితనం మిగిలి వుంది. ఆమెకూడా మనిషే. కాదనలేం. సరే వెళ్ళు. ఆమెదగ్గిరికి వెళ్ళు. కాస్త ఆలోచించు-అటువంటిమనిషి హఠాత్తుగా నీకు ఆరోగ్యంకలగాలని ప్రార్థిస్తూ, మేంతాగినపుడు యెంత చక్కగా మాట్లాడిందనుకున్నావ్! నాజీవితంలో అటువంటి ప్రసంగం యెన్నడూ వినలేదు. 'మావంటివాళ్ళను యెలా చూస్తారు?' అని అడిగింది. 'మేం పందులం, కుక్కలం!

కాదూ?' 'నిజం' అన్నాను నేను. 'అతను' అంది ఆమె. అతను అంటే నువ్వన్నమాట. 'అతను నన్ను తనసాటిమనిషిలాగా చూసుకున్నాడు. అదీసంగతి! అర్థమైందా, తాతా?' 'ఆఁ— అర్థమైంది' అన్నాను నేను. 'నేనూ అతనిని అలానే ఆదరించి ఋణంతీర్చుకోవాలి' అంది. చిన్నవిషయంలాగానే కన్పిస్తుంది. కాదూ! కాని చిత్రంగానేవుంది. వాస్తవికజీవితంలోలాగా లేదు. అలా సంభవించకుండావుండదు. నిజానికి ఆమాటలకి, ఆమెచేష్టలకి..."

ఇక సాగలేదు. పాల్‌కి తెలియనిఅడ్డంకి ఏదో వచ్చి పడింది. అతిశ్రద్ధగా, అతిసంతోషంగా పాల్ మిరాన్ చెప్పిందంతా విన్నాడు. ఇక ఆలోచనలు ఒకదారికిరావని నిశ్చయించుకుని, యజమానిచేయిఊపి మాటాడడంకట్టిపెట్టినతర్వాతకూడా పాల్ యజమానివంక చూస్తూనేఉన్నాడు.

పాల్‌కూడా ఏమీ మాటాడలేదు మిరాన్‌మాటలు అతనికెంతో సంతృప్తికలిగించాయి. హృదయాన్నీ, మనసునూ ఆవరించినభావాలను వెల్లడించాలని బలీయమైనకోరిక కలిగింది. కాని వెల్లడించేశక్తిలేక యజమానికి కృతజ్ఞతాభివందనాలు తెలుపసాగాడు.

"మీమాటలకు నే నెంతో కృతజ్ఞుణ్ణి—" నిరుత్సాహంగా చెప్పలేక చేయిచాచాడు. "జబ్బు నా మంచికేవచ్చింది. నువు సరిగ్గానే చెప్పావు. జబ్బుచేయకముందు నేను వట్టి అడవి మృగాన్ని. యిపుడు మనిషినయ్యాను. నలుగురూ నావిషయమై శ్రద్ధతీసుకుంటున్నారు. యెంతో కృతజ్ఞుణ్ణి!..." యజమాని

ముందు తనమనసులోఉన్నదంతా వెళ్ళకక్కాలనే తీవ్రమైన కోరిక కలిగి ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"దానికేవిఁటిలే! జబ్బుచేయకముందు నువ్వు మామూలు మనిషివి కాకపోతేనేం ? నువ్వు తమాషామనిషివి ! మనుష్యులకు దూరంగావుండడం మంచిదో, స్నేహంగావుండడంమంచిదో నేను గట్టిగా చెప్పలేను. స్నేహానికితగినవాళ్ళు కారు... వాళ్ళతో నీకు సరిపడదుకూడా...సరే కాని, నువ్వు యేమీ మాటాడకూడదు. పిడికిలిబిగించుకుని సిద్ధంగావుండాలి. మోసం చేస్తే కోపగించుకుని లాభంలేదు. అందరికీ అదేపని. జీవితం యెంత ఊపిరాడనీకుండావుంటుందో తెలుసా ? పక్కవాడిని తన్నకతప్పదు. మరేం పరవాలేదు. తన్నులుతినడంకంటె తన్నడం మేలు. అన్నిటికిమించి ఆడవాళ్ళవిషయంలో జాగర్తగా వుండు. ఆడవాళ్ళు వట్టి జిత్తులమారివాళ్లు. కాటేసినా తెలుసుకోలేవు. ముందుగా నిన్నుచూసి మందహాసంచేస్తారు. తర్వాత ముద్దెట్టుకుంటారు. ఆతర్వాత పొగడుతారు. యింకేఁవుంది, కానిస్తవైపోతావు. ఆఖరికి విసుగెత్తుతుంది. యిక వదిలిపెట్టమంటావు. బతిమాలుకుంటావు. కాని వాళ్ళగుప్పిట్లోనించి తప్పించుకోలేవు. నిత్యం చావుగానేవుంటుంది !"

మిరాన్‌కి ఆవేశంవచ్చింది. పని ఆపకుండానే సాయంకాలంవరకు యిలా వేదాంతం చెపుతూనేఉన్నాడు.

పాల్ అతనికి ఎదురుగాకూర్చుని, వింటూ ఆరెతో ఏదో తీస్తూనేఉన్నాడు. కాని అతనిమనసును ఆవరించిఉన్న ఆలోచనలను యజమానివేదాంతం పారదోలలేకపోయింది.

"యిక చాలు" అన్నాడు మిరాన్ వేదాంతం కట్టి పెడుతూ. "పడుకుని విశ్రాంతితీసుకో. పోనీ అలా వెళ్ళి గాలిలో తిరిగిరారాదూ ?"

"ఉహుఁ, వెళ్ళి ఆమెనుచూసిరావడం మంచిది..." అన్నాడు పాల్ తలవంచుకుని మెల్లగా.

"ఓ! నటాల్యానా? సరే వెళ్లు" అన్నాడు యజమాని ఆలోచనాపూర్వకంగా.

కాని పాల్ బైటకువెళుతూంటే బిగ్గరగా అన్నాడు—

"యిదిగో నిన్ను అది పెళ్ళాడకుండా జాగ్రత్తపడు. విన్నావా? యెలా తటస్థిస్తుందో తెలుసుకోలేవు. వాళ్ళంత నేర్పుగలవాళ్లు...!"

ఈమాట పాల్‌కి ఆహ్లాదంకలిగించలేదు. ఆమె అందరి లాంటిదీ కాదని తాను తెలుసుకున్నట్టు భావించాడు. ఆమెను గురించి చెడ్డగా తలపోయాలని యత్నించాడు, కాని, లాభం లేకపోయింది. ఆమె చాలా దయగలది. అంతకంటె యేం కావాలి?

పరస్పరవిరుద్ధమైన ఇటువంటి ఆలోచనలలో మునిగిపోయి ఎప్పుడు మెట్లుఎక్కాడో గమనించలేదు. తీరాచూసేసరికి ఒక చిన్నగుమ్మంముందు మిద్దెమీద నిలబడిఉన్నాడు. తలుపు సరిగా మూసిలేదు. కలవరపడ్డాడు. లోపలకువెళ్ళాలనుకుని మళ్లీ తటపటాయించాడు. వచ్చినట్టు తెలియజేయడానికి ముందుగా దగ్గాలి. కాని, బిగ్గరగా దగ్గినా లోపల మనుషులు ఉన్నసూచనలు గోచరించలేదు.

"బహుశా నిద్రపోతూవుండవచ్చు" అనుకున్నాడు కాని, వెళ్ళిపోలేదు. ఆమెను మేలుకువరావచ్చునవేఆశతో అక్కడే నిలబడ్డాడు.

వీధిలోనుంచి మందకొడిగా చప్పుడు వినిపించింది. పగలు ఎండకొట్టిందేమో మిద్దెమీదకూడా ఉక్కపోస్తోంది. నేల కాలినవాసన ముక్కుపుటాల్లో గిలిగింతలుపెడుతోంది.

హఠాత్తుగా తలుపు తెరుచుకున్నట్టు గోచరించింది. ఒకఅడుగువెనకకు వేసి, మర్యాదపూర్వకంగా టోపీతీసి, వంగి నమస్కరించాడు. తలపైకెత్తకుండానే ఆమె ఏమి అంటుందో నని నిరీక్షించాడు. కాని ఆమె మాటాడలేదు. తలపైకెత్తి చూసి నిట్టూర్చాడు. ఎవరూ అతనిముందు లేరు. గదిలోనూ ఎవరూలేరు. కిటికీలోనుంచి గాలితగిలి తలుపు తెరచుకుని ఉంటుంది.

గదిలోకి చూశాడు. నేలమీద అవీఇవీ చిందరవంద రగా పడిఉన్నాయి. గది శుభ్రంగాలేదు. పక్కనలిగిఉంది. పక్క ముందున్న మేజాబల్లమీద అంటుగిన్నెలు, రొట్టెముక్కలు, సిగరెట్టుపీకలు, రెండు బీరుసీసాలు, ఒక టీపాయి, కప్పులు పడిఉన్నాయి. ఎర్రటిచొక్కా, నలిగినకాగితంపువ్వులు నేల మీద విరజిమ్మిఉన్నాయి.

ఈ దృశ్యం చూచి, పాల్ విచారపడ్డాడు. తిరిగివెళ్ళి పోవాలనుకున్నాడు కాని, అంతఃప్రేరణమూలంగా గుమ్మం దాటి గదిలోఅడుగుపెట్టాడు. గది అసహ్యంగా ఉంది. కప్పు శవపేటికమూతలాగా ఉంది. గోడలకు చవకపాదుఊదాకాగితం

అంటించినది వేలాడుతోంది. ఇలా చిందరవందరగా ఉండడంవల్ల గది విచిత్రంగా కనిపించింది.

పాల్ దీర్ఘంగా నిట్టూర్చి కిటికీదగ్గరకు వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

"యెందుకు తిరిగివెళ్ళిపోకూడదూ?" అని ఆలోచించ సాగాడు. కాని వెళ్ళాలనేఉద్దేశం లేదని తెలుసు. "యెలా వెళ్ళను? ఆమె యిక్కడలేదు. గది తాళంవేసిలేదు. అట్టే దూరం వెళ్ళివుండదు. యిక్కడే..."

ఆమె కనిపిస్తుందనేఆశతో కిటికీలోనుంచి చూడసాగాడు.

కిటికీలోనుంచి పట్టణం విచిత్రంగా గోచరించింది. నిజానికి కనిపించింది పట్టణంకాదు. పైకప్పులు, వాటిమధ్య దీవులు లాగా ఆకుపచ్చనితోటలు. ఆకుపచ్చనివి, ఎర్రనివి, గోధుమ రంగువి పైకప్పులు గజిబిజిగా ఒకదానినొకటి పట్టుకువేలాడు తున్నట్టున్నాయి. అస్తమయసూర్యునికిరణాలుపడి కొద్దిగా మెరుస్తున్న చర్చిగోపురం ఆకాశంలో ఎక్కడో గోచరిస్తోంది. పట్టణశివార్లలో సాయంకాలపుపొగమంచు లేచి, ఇంటిపైకప్పుల మీద తేలియాడుతూ వాటిని చీకటిమయంచేస్తున్నాయి. ఆకు పచ్చనిచెట్లు గృహాలలో మిళితమైపోయాయి. సాయంసంధ్య నీడలతో భూమిని చుట్టుముట్టడం పాల్ చూశాడు. దూరాన ఎక్కడో పట్టణంఅవతల నీలాకాశంలో రెండునక్షత్రాలు గోచరించాయి. ఒకటి పెద్దది, ఎర్రనిది. మెరిసిపోతోంది. రెండోది ఆకాశంలోనుంచి తొంగిచూస్తూ దోబూచులాడు తోంది.

సాయంకాలం, ఆకాశం, నక్షత్రాలు, నిద్రించేపట్టణం,

స్వంతఆలోచనలు-వీటన్నింటినీ, వీటిక్రమపద్ధతులను అవగాహన చేసుకోగలగడం మంచిదే. కారణకార్యాలను అర్థంచేసుకో గలిగినమనిషి, విశ్వక్రమంలో ఏఏఆలోచనలు, భావాలు దాగి యున్నాయో అర్థంచేసుకోగలిగినమనిషి, సృష్టినిఅర్థంచేసుకో గలిగినమనిషి తనెందుకుజీవిస్తున్నదీ, జీవితంలో తనస్థానంఏమిటో తెలుసుకోగలడు. అటువంటిమనిషి జీవితాన్నంతటినీ ఈసాయం కాలంలాగా మృదువుగానూ, ఉత్సాహపూరితంగానూ రూపొం దించగలడు. ప్రజలను సమైక్యపరచి మనిషిమనిషిలో తన ప్రతి రూపం చూసుకుని బయటపడకుండా జీవించగలడు.

ఇలాంటి ఆలోచనలు ముంచెత్తగా కీటిదగ్గరకూర్చున్న పాల్‌కి కాలం ఎలాగడించిందో తెలియదు. చూస్తూచూస్తుండ గానే సాయంకాలమైంది. ఆవరణలో ఎవరో కేకలువేస్తూంటే కిందకుచూశాడు. చాలాసేపటినుంచి అక్కడ కూర్చున్నాననే పరిజ్ఞానం అప్పటికి కలిగింది. బాగా చీకటిపడింది. ఆకాశ మంతటా నక్షత్రాలు పొదిగినట్టయింది. పాల్‌కి నిద్రవచ్చింది. నిట్టూర్చి గుమ్మంవేపు వెళ్ళాడు. గదిలోనుంచి వెళుతూంటే భారీగా తడబడేఅడుగులచప్పుడు వినిపించి ఆగాడు.

మెట్లమీద ఒక స్త్రీవ్యక్తి ఊగిసలాడుతోంది. మూలుగుతోంది, ఏడుస్తోంది. పాల్ పక్కకుతప్పుకుని తలుపు వెనక నిలబడ్డాడు.

"వెధవపీనుగులు" అంటూ తాగినమనిషిగొణుగుడు వినిపించింది.

నటాల్యానిచూడడానికి ఎవరో వచ్చిఉంటారని పాల్ అనుకున్నాడు. కాని ఆ వ్యక్తి నటాల్యాయేనని గుర్తించి,

ఆశ్చర్యచకితుడై పోయాడు. దూరానికి వోడ్కా వాసన గుప్పున కొడుతోంది. ఆమె ఇంకా దగ్గరకువచ్చింది. జుట్టు చిందరవంద రగా ఉంది దుస్తులు నలిగిపోయాయి. మాట సరిగా రావడం లేదు. పాల్ మనసు కరిగిపోయింది. కాని సహాయంచేయడానికి ముందుకురాలేదు. తలుపువెనక నిలబడేఉన్నాడు. ఆమె భుజంతో తలుపువెనకకుతోసి గదిలోప్రవేశించింది. కాలుపెట్ట గానే గ్లాసులు, సీసాలు కిందపడ్డచప్పుడైంది.

"చావండి...చావండి..."

ఆమెగొంతులోనిబాధను పాల్ పసిగట్టాడు. కాని కదలలేదు. ఊపిరిబిగబట్టి వినసాగాడు. అలావినడం అతని కేం సంతోషదాయకంగా లేదు. ఆతర్వాత వెక్కివెక్కిఏడుపు, తిట్లూ వినిపించాయి.

"నన్ను కొట్టాడు...కుక్కలకొడుకు! నన్నెందుకు కొట్టాలి? డబ్బుఅడిగితే కొడతాడా? తప్పాడువెధవ! మూడు రూబుళ్లు...నా కవసరం. యిది అలాంటిదేకదా, కొడితేయేం అనుకున్నాడు. ఉహుం, అబద్ధం!.. అబద్ధం! నాకుతెలుసు. సరే సరే. నేను మనిషినికాను...మనిషినికాను...కాని అలాంటి దాన్ని...నాకు అడిగే...హక్కు...లేదా...? మూడు రూబుళ్ళు!..."

'మూడురూబుళ్లు'అనేమాటలు కావేశంతో దుఃఖంతో హృదయానికిగుచ్చుకునేటట్టు ఉచ్చరించింది. పాల్ కికూడా దుఃఖంఆగలేదు. ఎవరిమీందో పగతీర్చుకోవాలనిపించింది. గబ గబా కిందికిదిగాడు. ఆఖరిమెట్టు దిగుతూంటే వస్తువులు కింద పడ్డచప్పుడు, వళ్లాలు పగిలిపోతున్న చప్పుడు వినిపించింది.

"బల్లమీదివిఅయివుంటాయి..." అన్నాడు బిగ్గరగా. అప్పటికే ఆవరణలో ప్రవేశించాడు. ఏమిచేయాలో తోచలేదు. ఏదోఒకటి చేయాలనిమాత్రం అనిపించింది. టోపీ చేతితోపట్టుకుని నిలబడి గుండె టకటకాకొట్టుకోవడం వినసాగాడు...

అంతా గందరగోళంగా ఉంది. స్పష్టమైనఆలోచన ఒక్కటీ రావడంలేదు.

"లంజాకొడుకులు!" అన్నాడు పాల్ హీనస్వరంలో. విన్నతిట్లన్నీ జ్ఞాపకంతెచ్చుకుని మండిపడుతూ మెల్లగా ఏకరువు పెట్టాడు. మనసు కొంచెం స్థిమితపడినతర్వాత గేటులోనుంచి వెళ్ళి వీపు గోడకు గట్టిగా ఆనించి బల్లమీద కూర్చున్నాడు.

చీకటిలో నిర్జనవీధులలో కసికొద్దీ గొణుక్కుంటూ వెళ్ళే స్త్రీఆకారాలు అతనికళ్ళకుకట్టాయి...విచారం గుండెను కొరికివేస్తున్నట్టనిపించింది. లేచి మళ్లీ దుకాణంలోకి వెళ్లాడు.

"యేం పాల్! యెలావుంది వ్యవహారం?" అని యజమాని మర్నాడు ఉదయం ప్రశ్నించాడు. కనిపించగానే వికటంగా నవ్వాడు.

"వెళ్లావా? కృతజ్ఞత తెలిపావా?"

"ఆమె...యింటివద్ద లేదు" అని పాల్ జవాబిచ్చాడు చిరచిరలాడుతూ, యజమానిదృష్టిని తప్పించుకుంటూ.

"సరే కానీ, యింటిదగ్గర లేదు అనుకుందాం" అని పనిమొదలుపెట్టడానికి పాల్‌కిఎదురుగా కూర్చున్నాడు.

"ఆ అమ్మాయి ఆదేపనిగా తిరుగుతుంది. అబ్బే! అదేమంత మంచిపనికాదు. అంత మంచిఅమ్మాయి! యేం బావుం

డలా వ్యవహారం! సరే, యేంచేస్తాం? పాపం అనుకోవడంకంటె యేం చేయలేం. అదే, అదే!" అన్నాడు యజమాని.

పాల్ మాటాడకుండా ఉద్రేకంతో చర్మంలోకి మైనం పూసినతాడు ఎక్కిస్తున్నాడు.

"ఖిరాన్!" అన్నాడు పాల్ చాలాసేపు మాటాడకుండా కూర్చుని.

"యేమిటి?" అని అడిగాడు యజమాని తలయెత్తి.

"ఈ బొందలోనించి బయటపడలేదంటావా?"

"ఆమె? ఊఁ, బయటపడవచ్చు. కాని, నే నలా అనుకోను. ఒక వేళ బయటపడనూవచ్చు. చెప్పలేం, యెవడైనా గట్టిమగాడు గుప్పెట్లో పెట్టుకోగలిగితే...అప్పుడయినా యెవరిది పైచెయ్యి అవుతుందో చెప్పలేం. కాని, అసలుసంగతేమంటే, యీరోజుల్లో పెళ్ళికూతుళ్ళు చీమలపుట్టల్లా వున్నారు. అందమైనవాళ్ళకికూడా తగినవరుడు దొరకడంలేదు. ఉదాహరణకు గూస్ విషయం తీసుకో. పెళ్ళిచేసుకున్నాడు. రెండువందల రూబుళ్ళు కట్నంకింద ముట్టాయి. ఆ అమ్మాయి దేవకన్యలా వుంటుంది. చదువుకున్నది. అయితే మోసగించకుండా యెలా వుంటుంది? వీడు యెలాంటివాడు? వీడికి దరిదాపు యాభై యేళ్ళు. ఆమెకి పదిహేడు. అయినా ఆ అమ్మాయి గూస్‌ని పెళ్ళాడింది. పైగా రెండువందలరూబుళ్ళు పుచ్చుకుని మరీ, పెళ్ళాడాడు. యీరోజుల్లో పెళ్ళికూతుళ్ళు కుప్పతిప్పలు. యిట్టే దొరుకుతారు. యెందుకని? జనాభా పెరిగింది. పిల్లలమీదపిల్లలు పుట్టుకొస్తున్నారు. ఏ అయిదేళ్ళపాటో యెవరూ పెళ్ళిచేసుకోకూడదని నిషేధిస్తేబావుండును. అది వేరేవిషయం.

అయినా తమాషాగావుంటుంది. నిజం!" ఇలాంటిభావాలలో మునిగిపోయి ముసిలి మిరాన్ తనసిద్ధాంతాన్ని వివరంగా రూపొందించసాగాడు.

పాల్ మాటాడలేదు. శ్రద్ధగా వింటున్నట్టే కనిపించాడు. కాని మిరాన్ కృత్రిమంగా జనాభాతగ్గింపుసమస్యను పరిష్కరిస్తూ మాటాడగానే, పాల్ అడ్డువచ్చాడు.

"మిరాన్! ఆమెకు నేనేదైనాబహుమతిఇస్తే యెలా వుంటుంది?"

"ఆమెకు అంటే నటాల్యాకా?" అని యజమాని అడిగాడు. చాలాసేపు మౌనంగాకూర్చుని, కప్పుకేసిచూశాడు. తనవాక్ప్రవాహానికి పాల్ అడ్డుకట్టవేయడం అతనిని బాధించింది.

"ఆ-యివ్వవచ్చు. దానికేం? నీకోసం డబ్బుకూడా ఖర్చుచేసింది.

మళ్ళీ మౌనంవహించాడు. కొద్దిసేపైనతర్వాత కూని రాగం ప్రారంభించాడు.

భోజనానంతరం ఎదురుబదురుగాకూర్చుని, గబగబా పనిచేసుకుంటున్నారు. ఉష్ణంగా ఉంది. గుమ్మం కిటికీ తెరిచినా ఉక్కగానేఉంది. యజమాని నుదుటిమీద చెమటతుడుచుకుని, ఎండను నాలుగుతిట్లు తిట్టి, నరకంలో వేడిమి పదిడిగ్రీలు తక్కువగా ఉందంటూ ప్రారంభించాడు. ఆ వెధవ చెప్పులు కుట్టిఇవ్వడానికి ఒప్పుకోకపోయిఉంటే నరకానికి సంతోషంతో తరలివెళ్ళేవాడనేనని చెప్పాడు.

పాల్ నుదురు ముడుచుకుని, పెదవులునొక్కిపట్టి వంగి కుట్టుతున్నాడు.

"ఆమె మంచిదేనంటావ్?" అని హఠాత్తుగా అడిగాడు.

"ఆ విషయం నిన్నింకా వేధిస్తూనేవుందా? అవును. ఆమె మంచిదే-యిదంతా యెందుకు?" అని యజమాని అడిగాడు, పాల్ తలవంక పరీక్షగాచూస్తూ. "అబ్బే మరేంలేదు, పూర్తి కేనే!" అని ముక్తసరిగా జవాబిచ్చాడు పాల్.

"అంటే?" అని యజమానినవ్వాడు.

"యేంచెప్పను?" అన్నాడు పాల్ విచారంతో, కంగారుతో, అలసటతో, బలహీనంగా.

మరి ఎవరూ మాట్లాడలేదు.

"మారలేదంటావా? యేమీచేయలేమంటావా?" అని భయపడుతూ పాల్ అడిగాడు. మీరాన్ జవాబివ్వలేదు.

పాల్ చాలాసేపు ఆగి, హఠాత్తుగా "ఊహుఁ, అలా కాదు. ఆమె మంచిదే. కాని పతనమైపోయింది. ఛీ! సిగ్గుచేటు!" అంటూ మేజాబల్లను తన్నాడు.

"హీహీ!" అని యజమాని ఈలవేసి వ్యంగ్యంగా నవ్వాడు. "నువు వట్టి వెర్రిబాగులవాడివి పాల్! కసాయి దుకాణానికితీసుకుపోబడేగొర్రెవి! హాహాహా!" –

సాయంకాలంపని ముగిసినతర్వాత పాల్ దుకాణంహాలులోకి వెళ్లాడు. ఆవరణవేపుగుమ్మంలో నిలబడి మిద్దెకిటికీకేసి చూశాడు. దీపంవెలుగుతోంది. కాని సంచలనంలేదు. అలా చాలాసేపు ఆమెఆకారం గోచరిస్తుందేమోనని నిరీక్షిస్తూ

నిలబడ్డాడు. ఇక నిరీక్షించలేక విసుగెత్తి వీధిలోకి వెళ్ళి ఆ కిందటిరాత్రి కూర్చున్న బల్లమీదనే కూర్చున్నాడు.

నటాల్యానిగురించి యజమాని చెప్పింది మరువలేక పోయాడు. ఆమెఅంటే అమితజాలివేసింది. జీవితాన్నిగురించి ఇంకా ఎక్కువ తెలిసికొనిఉంటే కలలుగనడం ఎలానో తెలిసి కొనిఉంటే ఆమెవిముక్తికి ఎన్నో ఎత్తులువేసేవాడే. కాని పాపం! అతని కేం తెలియదు. అతనిఆలోచనలన్నీ ఆమె ఆకారంమీద-నేలమాళిగలో, ఆసుపత్రిలో, మిద్దెగదిలో తాగినపుడు-కేంద్రీకృతమయాయి. తాగిఉన్నపుడు మిద్దెగదిలో నుంచి తిన్నగా ఆసుపత్రికి తనపక్కదగ్గరికి తీసుకువెళ్ళేవాడే. అతనిమనసులో అసంగతమైనరూపం రూపొంది కుంగిపోయే వాడు. ఆసుపత్రికి ఆమెవచ్చినప్పటిరూపమే గదిలోఉందని ఊహించుకున్నప్పుడు మనోభావాలు మారిపోయేవి. చిరునవ్వు నవ్వుతూ చుట్టూచూసేవాడు. చీకటివీధికేసి చూసేవాడు. నక్షత్రాలు పొదిగినఆకాశంకేసి చూసేవాడు.

రెండు భావతరంగాలు అతనిలో వచ్చి కొట్టుకున్నాయి. ఒకటి ఉత్సాహాన్ని ప్రసాదించింది. రెండోది విచారంలో ముంచెత్తింది. ఆసుపత్రిలో ఉన్నపుడు నటాల్యానిగురించి ఎడ తెగకుండా ఎంతో ఆలోచించాడేమో సన్నిహితత్వం ఏర్ప డింది. దయచూపిన మొదటివ్యక్తి ఆమె. నా అనేవారు లేని ఒంటరిజీవితం అంతా ఆమెమీదనే కేంద్రీకృతమైంది. దయ చూపిన యువతినే గర్హించవలసివచ్చింది!

ఆసుపత్రిలో మంచందగ్గరగా ఆమెకూర్చున్నపుడు కలి గిన ఉద్రేకం జ్ఞప్తికితెచ్చుకున్నాడు. తిరిగి జ్ఞప్తికితెచ్చుకో

డంలో మందగించిన ఉద్రేకం అంత తీవ్రంగానూ తిరిగి వస్తే సంతోషించేవాడే.

బిగ్గరగా ఆశ్చర్యంతో "ఓ! నువా! పంపించివేశారా!" అన్నమాటలు వినిపించాయి. గిర్రున వెనుదిరిగి ఆమెను చూశాడు. గేటులో నిలబడిఉంది. తల, మొహం బూడిదరంగు శాలువతో గట్టిగా చుట్టుకుంది. కాని ధగధగామెరిసే నీలికళ్ళు కనిపిస్తూనేఉన్నాయి.

"నిన్న వచ్చేశాను." అని జవాబిచ్చి ఇంకేమనాలో తోచక మాటాడకుండా ఆమెకేసి చూడసాగాడు.

"యెంతచిక్కిపోయావ్?" అంది మెల్లగా జాలిగా. మొహం ఇంకా కప్పుకోవాలని శాలువా సరిచేసుకుంది.

"నీకూ ఆరోగ్యంగాలేదని విన్నాను?"

"నాకా! అబ్బే! అవునవును, యిప్పటికీ యింకా బాగాలేదు. పళ్ళతీపు...చాలాకాలంగా..."

మిద్దెమీద తనపక్కగావెళ్ళినపుడు ఆమె శాలువా మొహానికిచుట్టుకోలేదన్నవిషయం పాల్ కి జ్ఞాపకంవచ్చింది.

"వంట్లో బాగా అరోగ్యంగావుందా? మళ్ళీ పనిలోకి వెళుతున్నావా?" అని అడిగింది కొంచెంఆగి.

"ఆ, పనిచేస్తున్నాను. నిన్నటినించే ప్రారంభించాను."

"సరే. మంచిది. శెలవు!" అంటూ చేయిజూపింది.

పాల్ ఆమెచేతినితీసుకుని గట్టిగానొక్కాడు. ఆమె అంతతొందరగా వెళ్ళిపోవడం ఇష్టంలేక గబగబా అన్నాడు.

"ఒక్కనిమిషం ఆగు. దయచేసి యిలా కూర్చో.

నీకెంతో కృతజ్ఞత తెల్పాలనివుంది. నావిషయంలో అంత శ్రద్ధ తీసుకున్నందుకు కృతజ్ఞుణ్ణి..."

"అబ్బే! అదేవిటి?...మధ్యాహ్నంభోజనాలవేళ నా గదికివచ్చి నాతో టీతాగకూడదూ? సాధారణంగా సాయంకాలంపూట నేను యింట్లో వుండను. వస్తావుగదూ?"

"ఓ! వస్తాను. తప్పకుండా వస్తాను. సంతోషంతో వస్తాను."

"అయితే నేను దుకాణానికి వెళ్ళొస్తా" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

తిరిగివెళ్ళేటపుడు ఆమె ఆగి, ఇపుడే వెళదాం రమ్మంటుందనే ఆశతో పాల్ ఆమెకోసం నిరీక్షించాడు. కాని అతని వంకైనా చూడకుండా చకచకా వెళ్ళిపోయింది. శాలువాకింద సీసాలుదాచి తీసుకువెళుతున్నట్టు గోచరించింది.

పాల్ నిట్టూర్చి, ఇంకా కొంచెంసేపు అక్కడే కూర్చుని వెళ్ళి పడుకున్నాడు. ఆమెనుగురించి ఎంతో విచారించాడు. చాలాసేపటివరకు నిద్రపట్టలేదు.

రెండురోజులతర్వాత జేబురుమాలు కాగితంలోచుట్టి పట్టుకుని మిద్దెమెట్లు ఎక్కాడు. రూబులున్నరపెట్టి ఆ రుమాలు కొన్నాడు. తలుపు తెరిచేఉంది. పాల్ నిచూడగానే నటాల్యా గదిలోకి పరుగెత్తుకుంటూ వెళ్ళి, శాలువాతీసుకుని గబగబా తలకుచుట్టుకుంది.

"ఓ, నువ్వేనా! బలే! యిప్పుడే టీతాగబోతున్నాను. బలే!"

మాటాడకుండా బహుమతిని ఆమెచేతిలో పెట్టి

మెల్లగా, యిది యేదో కృతజ్ఞతాపూర్వకంగా..." అని గొణిగాడు.

"యేమిటిది? ఓ, జేబురుమాలా! నువెంత మంచి వాడివి!" అని మెల్లగా అతనిపక్కకు జరిగి కౌగలించుకునే దానిలాగా చేయిజాపింది. కాని వస్తాయించి, మళ్ళీ జేబు రుమాలును పొగడసాగింది.

తాను తెచ్చినబహుమతిని ఆమె పొగిడేసరికి పాల్ సంతోషించాడు. ఆమె జేబురుమాలును అటూఇటూ తిప్ప డం పరీక్షగాచూశాడు. హఠాత్తుగా వగలాడితనానికి లొంగి పోయి గోడకు వేలాడేఅద్దంకేసి తిరిగింది. నీటుగా శాలువతీసి వేసుకుని, అతనుబహూకరించినరుమాలు తలకుచుట్టుకుంది.

"అరె!" అన్నాడు పాల్ ఆశ్చర్యపోతూ. ఆమె రెండు కళ్ళకిందా ఎర్రటి పెద్దపెద్దగాయాలు కనిపించాయి.

పాల్ ఆశ్చర్యంతో 'అరె' అనేసరికి ఆమెకు జ్ఞాపకం వచ్చింది. కాని ఏంలాభం? కుర్చీలోకూలబడి రెండు చేతుల తోనూ మొహంకప్పుకుంది.

"వెధవలు! నిన్ను యెలాకొట్టారు!" అనేమాటలు పాల్ పెదవులనుంచి దీర్ఘమైననిట్టూర్పులాగా వెలువడ్డాయి.

నిశ్శబ్దం. పాల్ కి ఆశ్చర్యంవేసింది. మాటాడలేక, ఏమి మాటాడాలో తోచక చుట్టూచూశాడు. మనసులోబయలు దేరిన గందరగోళం, దుఃఖం అసలే స్ఫోటకంమచ్చలతో వికా రంగాఉండేమొహాన్ని మరింత వికారంగా తయారుచేశాయి. అయితే ఆ వికారరూపం దయనీయమైందిగా, రోగిష్టిగా, పసుపువచ్చనికళారాళంగా పొడగట్టింది.

మేజాబల్ల మీద టీ కాగుతోంది. పొగ సన్నని చుట్టలు చుట్టలుగా పైకిలేచి ఆనవాలుకూడా లేకుండా గాలిలో కలిసి పోతోంది. ఏదో క్షుద్రజంతువు ఈలవేస్తున్నట్టు, వేళాకోళం చేస్తున్నట్టు హుస్సని శబ్దం విచిత్రంగా వినిపిస్తోంది.

గది శుభ్రంగాఉంది. కంగాళీగా లేదు. కాని ఏమాత్రం అందంగా లేదు. గది అందంగాఉండేటట్టుచేయాలని నటాల్యా గోడకాగితాలు చినిగినచోట్ల చవుకబారుపటాలు తగిలించింది. పుచ్చిపోతున్న కిటికీమండిగం కనపడకుండా మూడు పూల తొట్టెలు అడ్డంపెట్టింది. కప్పు శవపేటికలా ఉండి, మనసును కుంగదీస్తోంది. ఏనిమిషంలోనైనా కిందపడేటట్టుగా ఉంది. కిందపడితే ఇంకేముంది? సమాధే!

పాల్ నటాల్యాకేసి చూశాడు. ఆమె రొప్పుతోంది. బుజాలు వణికిపోతున్నాయి. ఎందుకో సరిగా అతనికి బోధ పడలేదు.

"సరే, వెళతాను... శెలవు" అని పాల్ నిట్టూర్చాడు. కాని అక్కడనుంచి కదలలేదు. అతనికి ఆమెఉద్దేశం అర్థమైంది.

హఠాత్తుగా మొహంమీదనుంచి చేతులుతీసి వేసుకుని కుర్చీలోంచి కిందకు ఉరికి అతనిమెడ కావలేసుకుంది.

"ఉహుఁ, వెళ్ళొద్దు. యిప్పుడు వెళ్ళినా. వున్నా ఒకటే. యెంతదాచుకున్నా గాయాలు నీ కంటపడనేపడ్డాయి" అంటూ మొహంముందు చేతులు ఊపుకుంది. "ఓ, అవి నీకంటపడ కుండావుండాలని చూశాను. నువు యెంత మంచివాడివి! దయ గలవాడివి! మృదువైనవాడివి! నువు...కోరిక చెల్లించమనవు. నలుగురిలా అసభ్యంగా ప్రవర్తించవు; నిన్నసాయంకాలం నువు

కనిపించేసరికి, యెంతో సంతోషించాను. 'నయమైంది. శుభం' అనుకున్నాను. పైకిరమ్మని పిలుద్దామనుకున్నాను. కాని 'నా మొహం అసహ్యంగావుందే, యెలాచూపించను!' అనుకు న్నాను. 'వెళ్ళిపోతాడు, మొహంమీద వుమ్మేస్తాడు. అంత టితో సరి' అని ఆలోచించి నిన్ను పిలవలేదు. ఇంకోళ్ళయితే నవ్వేవాళ్ళు. కాని నువుమాత్రం...యెంతమంచివాడివి!' నువు యెందు కంత మంచివాడివి?"

ఈవిధంగా అనుమానాలన్నీ, విచారాన్నీ, ఆనందాన్నీ వెల్లడించేసరికి పాల్ తలతిరిగిపోయింది. నేలకేసి చూస్తూ,

"ఊహుఁ, నీకు తెలుసుగా, నేను యెక్కువ...పనికి రాను. నోటమాట పెగలలేదు. నువంటే యెంతో విచారం వేస్తోంది. నువు నాకెంతో సన్నిహితురాలవనిపిస్తోంది. కాని చెప్పడం యెలా? యెలానో నాకు తెలీదు. మాటలు దొరకడం లేదు. నా జీవితంలో ఎన్నడూ ఆమాటలు వినలేదు.ఎవరూ... నాకు కావలసినమాటలు...యిప్పుడు...కావలసినమాటలు..."

"బలే! అద్భుతంగా మాటలు చెపుతూ, మాటాడడం రాదనుకుంటావేం? సరేగాని, యిలా కూర్చుందాం. ఇలా రా. నాపక్కనకూర్చో. ఇక టీతాగుదాం. ఆగు, తలుపు వేసివస్తాను. తలుపు వేయకపోతే, మగగాడిదలు లోపలికి రావచ్చు. వాళ్ళ దుంప తెగ! వాళ్ళంతా నరకంపాలుగాను! నీ మగసోదరులలో యెంతమంది దుర్మార్గులున్నారో నీకేం తెలుసు! అరి దేవుడా! తరవాత కలుసుకుంటే అసహ్యం వేస్తుంది...వాళ్ళు అంత అస హ్యంగా దుర్మార్గంగా వుంటారు!"

ఆమెకు ఆవేశంవచ్చింది. 'మగసోదరులను', 'ఆడ

సోదరీమణులను' విడిచిపెట్టలేదు. ఆమెకు మంచివిమర్శనాజ్ఞానం తీవ్రమైన వర్ణనాత్మకమైన శైలి ఉంది. ఈ శైలి కొంతవరకు తీక్షణమైనదైనా మంచి రసవత్తరంగా ఉంటుంది. అభిప్రాయాలను రాళ్ళలాగా విసిరింది. తిరుగులేని బలీయమైన విపరీతమైన నిశ్చితాభిప్రాయాలుగా వాటినికూర్చింది.

ఇదివరలో అతనికేమాత్రం ఎరుకలేనిజీవితాన్ని ఆమె విస్పష్టంగా వర్ణించి చెప్పింది. ఆమె వర్ణించిచెప్పినజీవితం చాలా దారుణమైనజీవితం, నీచమైనజీవితం, విపరీతమైనజీవితం, రోత పుట్టించేజీవితం! అతనినుదుటిమీద చెమటపట్టింది. ఆ జీవితం అంటే, ఆ జీవితాన్నివర్ణించిచెపుతున్న ఆమెఅంటే అతనికి భయంవేసింది.

ఉద్రేకంలో ఆమెకూడా మహాభయంకరంగా కనిపించింది. కిందిగాయాలమూలంగా, కళ్ళు ఇంకా లోతుకుపోయినట్లున్నాయి. ఆవేశంతో, కోపంతో నిప్పులుకక్కుతున్నాయి. కిందిపెదవి వాచి, ఈ భ్రమకు అడ్డంకిగా ఉంది. ఆమె అమిత విచారంతో తననుగురించి అవహేళనగా మాటాడింది. మగ సోదరులఆపదలను తనకసితీరినంతఉత్సాహంతోనూ, వారివిజయాలను పశ్చాత్తాపంతోను వర్ణించిచెప్పింది. ఒక్కొక్కపుడు నవ్వేది. ఒక్కొక్కపుడు ఏడ్చేది, ఒకొకపుడు నవ్వు, ఏడ్పూ కలిసిపోయేవి. చివరకు అలసిపోయి, గొంతుబొంగురై తన ప్రసంగంప్రభావానికి తానే ఆశ్చర్యపోతూ ముగించేది.

పాల్‌లో మానవవైఖరే లేదు. కళ్ళు నిప్పులుకక్కుతున్నాయి. రాక్షసుడిలాగా పళ్ళుపటపటా కొరికాడు. పళ్ళు బిగపట్టేసరికి చెంపఎముకలు ముందుకు పొడుచుకువచ్చాయి.

మొహం ఆకలితో నకనకలాడే తోడేలుముట్టిలాగా ఉంది. నటాల్యా వేపు ఒరిగాడు గాని మాటాడలేదు. ఎన్నో విషయాలు తెలియజేసి, ఎన్నో నేరాలు ఆపాదించి అతనిని ఈ మైకంనుంచి బయటపడవేయడం ఎలాగా అని ఆలోచిస్తూండగా అతనంత టతనే బైటపడ్డాడు.

"సరే!" అని అరిచాడు. "సరే! ఆవిషయాలే నాకు తెలీవు!" ఆవిషయాలు తెలిసినవిగనక, యిక ఆపరిస్థితి అంత మవుతుందనేనమ్మకంతో చెప్పినట్లున్నాయి అతనిమాటలు. ఆ విషయం అతను చూస్తాడు. "యిదా సంగతి! ఆరిభగవం తుడా! యిదికూడా సాధ్యమా?" తలచేతులమీదికివాలింది. మేజామీద మోచేతులుఆనించి మళ్ళీ పరధ్యానంలోపడ్డాడు.

ఆతర్వాత నటాల్యా మృదువుగా శాంతంగా మాటాడ సాగింది. తనను, తదితరులను క్షమించడం, సమర్థించడం సాధ్య మనేధోరణి అవలంబించింది. తప్పంతా తాగుడుమీద మోపింది. తాగుడు సర్వంనాశనంచేస్తుంది. జీవితంలోని చెడు అంతటికీ వోడ్కాఒక్కటే కారణం అనడం సబబుకాదని మళ్లీ జనాన్ని నిందించసాగింది. వాళ్ళకిముట్టజెప్పవలసినవాలుగూ ముట్టజెప్పి జీవితంమీద వ్యాఖ్యానంమొదలుపెట్టింది.

"చూడు, బతకడం చాలాకష్టం. యెక్కడచూసినా గోతులే. ఒకదానినుంచి తప్పించుకుంటే, ఇంకోదాంట్లో బుడుంగున పడతాం. అదీ సంగతి! వంకరటింకరదారి ఎలా తీసుకువెళితే అలా గుడ్డిగా వెళతాం. సుఖజీవితానికి సూటి మార్గం యేదీ? యెవరు దాన్ని కనుగొనగలరు? మనబతుకే

అసహ్యం; కష్టం. అయితే పెళ్ళాడినవాళ్ళుమాత్రం సుఖపడి చస్తున్నారనుకున్నావా! పిల్లాజెల్లా, మొగుడు, వంట, అవీ ఇవీ! అబ్బే! జీవితమే ఛండాలం!"

పాల్ ఇదంతావిని జీవితాన్ని గోతులవరుసగా, వాటి మధ్య ఇరుకుదారివెంట గుడ్డిగా మానవులు వెళుతున్నట్టు, చిత్రించుకున్నాడు. ఆ చీకటిగోతులు తేరిపారజూస్తూ, అవహేళన చేస్తూ మురుగువాసనను విరజిమ్ముతున్నాయి ఒంటరిమానవుడికి తలగిర్రునతిరిగి, తూలి, గోతిలోపడతాడు...

ఇక అతనిప్రసంగం వేదాంతధోరణిలోపడింది. ఆమె విచిత్రంగా గోరీలనుగురించీ, వాటిమీదపెరిగే చేదుమొక్కలను గురించీ, తడినేలగురించీ, ఉక్కపోతగురించీ మాటాడసాగింది.

ఇక ఒక్కక్షణంలో ఏడుపువచ్చేస్తుందని పాల్ భయపడ్డాడు. కాకపోయినా వెళ్ళేవేళయింది.

"వెళుతున్నా, శెలవు!" అన్నాడు ముక్తసరిగా. అతనిని ఆపాలని ఆమె యత్నించలేదు. వెళ్ళేటపుడు మృదువుగా 'మళ్ళీ తొందర్లో రా' అంది. అతను తలఊపాడు. అంతే!

అతను వీధిలోకి వెళ్ళాడు. ఆసాయంకాలమే ప్రపంచజ్ఞానంకలిగిందని భావించుకుంటూ చాలాసేపు పట్టణమంతా తెగతిరిగాడు. ఎన్నో కొత్తఆలోచనలు, అభిప్రాయాలు, భావాలు అతనిలో ప్రవేశించాయి కాబట్టి పెద్దవాడిలాగా భారీమనిషిలాగా భావించుకోసాగాడు. చుట్టూ సర్వమూ, పట్టణమంతా అతనికంటికి కొత్తగా కనిపించింది. అనుమానా

లను అవిశ్వాసాన్ని, జాలిని రేకెత్తించింది. దీనికంతటికీ కారణం ఆరోజున పాల్ పట్టణంలోని పేటలరహస్యాలు తెలుసుకోవడమే!

ఆరాత్రిఅంతా తిరిగి, సూర్యోదయం వేళ ఇంటికి చేరుకున్నాడు.

# 7

వారం గడిచింది. ఆ వారంరోజుల్లో పాల్ ఏడుసార్లు వెళ్ళి నటాల్యాని చూసివచ్చాడు.

మొత్తంజీవితంమీద, అందులో ముఖ్యంగా తమతమ జీవితాలమీద సంభాషణ వారి కెంతో ఆనందంచేకూర్చింది. పాల్ ఆసుపత్రిలోకనినకలలు యిపుడు నిజంచేసుకోవచ్చు. నటాల్యాతో అరెఫీనిగురించి చెప్పాడు. ఇక తనఆలోచనల సంగతి చెపుతూ, చిన్నతనంలో స్నానాలకొట్టుదగ్గరిగోతిలో పడుకుని ఏమేమి ఆలోచించినదీ, ఆతర్వాత గోరీలదొడ్డిలో, పట్నంలో, చుట్టుపక్క గ్రామాలలో ఎలా దిమ్మరిలా తిరిగిందీ వర్ణించిచెప్పాడు. ఈ ఆలోచనలలో ఆశ్చర్యం, అతనిలోని సత్యవిదూరత్వం హాత్తుకొనిపోయాయి. కాని జీవితంవిషయంలో ఏదో దోషంఉందనీ, మరమ్మతుచేయవలసినఆవశ్యకత ఎంతైనా ఉందనీ అతనిఆలోచనల ప్రధానధోరణి.

ఆమె తనజీవితచరిత్రకూడా చెప్పింది. ఆమెజీవితం సామాన్యమైనది. పదహారోఏట ఒకవర్తకునిఇంట్లో పనిచేస్తూ, అనుకోకుండా పాపంలోఅడుగుపెట్టింది. ఆమెతలిదండ్రులు ఆమెను ఇంట్లోనుంచి తరిమివేశారు. వారు బూర్జువావర్గానికిచెందినవారు...ఆమెతండ్రిపేరు క్రివటోస్నేవ్. నిలువనీడలేక

బజారునపడింది. ఒకావిడ ఉపకారంచేస్తానంటూ సిద్ధమైంది. తర్వాత ఒకపురుషుడుసిద్ధమైనాడు. ఆతర్వాత ఇంకొకడు, ఆపైన మరొకడు. ఇలా పుట్టలోంచీమల్లా బయలుదేరారు. ఇంతమంది ఎక్కడనుంచి దాపరించారో! యీ ఎనిమిదేళ్లుగా బోలెడు మంది! నిట్టూర్చి మొహమాటంలేకుండా అన్నీ ఒప్పుకుంది. కాని, పాల్ కి ఈ ఉపకారులందరిసంగతీ ఇదివరకే తెలుసు. ఈకథ అతనిని విచారంలోముంచిందేగాని, ప్రత్యేకంగా ఏ విధమైన ప్రతిచలనం కలిగించలేదు.

వారిద్దరిమధ్య నిరాడంబరమైన స్నేహభావం పాదుకొంది. ఆడవాళ్ళతో మాటాడినట్లే ఆమె అతనితో మాటాడేది. అతనుకూడా పురుషులతో మాటాడినట్లే ఆమెతో మాటాడేవాడు. గాయాలు క్రమంగా మానిపోయాయి. మొహం సహజమైన ఆరోగ్యకరమైన రోజారంగుకువచ్చింది. ఆమె మంచి దృఢంగా ఉంది. చెంపలు యింకా పాలిపోయి, ఆమె వృత్తిచిహ్నంగా నిలవలేదు. ఆమెకు పాటలంటే మహా యిష్టం. తరుచుగా విషాదగీతాలు, అందులోనూ విఫలప్రేమను వర్ణించే గీతాలు పాడేది. కాని ప్రేమఅనేమాట ఆమెలో ఆనందదాయకమైన భావాలనుగాని సహచర్యాన్నిగాని రేకెత్తించలేదు. ప్రేమ అనేమాటను ఉచ్చరించేటప్పుడు ఆమెలో కానవచ్చే నిరుత్సాహం, ముభావం, డెభ్భైఏళ్ళ ముసలమ్మలో కూడా కానరావు. ఈమాట ముసలమ్మలకు గతంజ్ఞప్తికితెచ్చి, నిట్టూర్చేటట్లు చేస్తుంది.

ఆమెకు పాల్ అంటే సహజంగా ప్రీతిఏర్పడింది. మగవాళ్ళందరిలాగా ఆమెను నీచంగాచూడని ప్రప్రథముడు పాల్.

అలా నీచంగాచూడలేదు. స్త్రీని ఏవిధంగా మర్యాదగా చూడాలో తననూ ఆవిధంగా మర్యాదగా చూస్తున్నాడని గ్రహించి, ఆమె ఉత్సాహంపొందింది మోటుగావ్యవహరించవలసినఅవసరం లేకపోయింది. విరక్తిని ఆశ్రయించవలసిన అవసరమూ లేకపోయింది. అతనితో మామూలుగానే మాటాడేది. కాని అతనుమాత్రం ఎక్కువగామాటాడకుండా శ్రద్ధగా వింటూ కూర్చునేవాడు.

ఇదివరలోకంటె ఇపుడు బిడియంవదిలి, కొంచెం ఎక్కువగా మాటాడసాగాడు. ఇదీ సహజమే. ఆమె అతనిని, అతని మనసును, ఆలోచనలను అర్థంచేసుకోవాలని యత్నించింది. అతను ఆమెకుఆప్తుడు, అత్యవసరమైనమనిషి. అతను దిగ్భ్రాంతుడైపోయాడు. ఆమె చాలా ఉత్తమురాలుగా, దయార్ద్రహృదయగా, మృదుశీలగా కనిపించింది. కాని ఆమెవిషయంలో ఒక్కమాటకూడా అతను వినలేదు.

పాల్ తరుచు అరెఫీనిగురించి ఆలోచించేవాడు. అరెఫీ, నటాల్యా-వీరిద్దరిలో ఎవరు ఎక్కువ మంచివారు? ఈప్రశ్నకు జవాబుచెప్పుకోవాలని అతను యత్నించలేదు. యత్నిస్తే అరెఫీస్మృతికి అవమానకరంగా, నష్టదాయకంగా జవాబు ఉంటుంది. సాయంకాలంపూటలు పాల్‌కి అమితానందదాయకంగా ఉండేవి. పనిపూర్తిచేసుకుని ఆమెగదికి స్వేచ్ఛగా వెళ్ళి, కాలంగడిపేవాడు. ఇద్దరూకూర్చుని టీతాగేవారు, చీకూచింతా లేకుండా కబుర్లుచెప్పుకునేవారు.

చవుకబారుకాగితం ముద్రించి రెండుమొదలు అయిదు కోపెక్కులధరకు అమ్మే కథలు, హృదయాన్నికరిగించేకథలు

చదవడం ఆమెకు ఎంతో ఇష్టం. మంచంకింద పెట్టెలో అటు వంటికథలపుస్తకాలు కట్టలకుకట్టలు ఉన్నాయి. ఒకొకప్పుడు వాటిలో ఒకకథను పాల్ కి చదివి వినిపించేది. ఉత్సాహంతో చదివి అతనినీ చదవమని ప్రోత్సహించేది. అతనూ అలాగే చదువుతానని మాటఇస్తూండేవాడు.

పాల్ కి బిడియం వదిలిపోయింది. కులాసాగా నవ్వడం కూడా నేర్చుకున్నాడుగాని, అది అతనికేం తగినట్టులేదు. మిరాన్ అతనివంక మంచిగా చూస్తూ ఇకిలించేవాడు. ఒకొక పుడు కొంటెగా నవ్వేవాడు. కాని పాల్ వీటిని మనసుకు పట్టించుకోలేదు. యజమాని అంటే ఇష్టం ఇంకా ఎక్కువైంది. మిరాన్ కూడా పాల్ వ్యవహారాలను శ్రద్ధతో చూడసాగాడు. దీనికిబదులు పాల్ ఎద్దులాగా పనిచేసేవాడు.

ఒకనాడు యజమాని "సరేగాని పాల్, నన్నుకూడా నీతో తీసుకువెళ్ళరాదూ?" అన్నాడు. పాల్ అంగీకరించాడు.

ఒకనాటిసాయంకాలం వారిద్దరూ వెళ్ళి నటాల్యాతో మిద్దెమీద టీతాగారు. ఆ ముదుసలి పడుచువారిద్దరినీ ఇష్టం వచ్చినట్టు మాటాడుకోనిస్తూ, మధ్యమధ్య తానూ వేళా కోళంగా నాలుగుమాటలు విసురుతూ వారిని కనిపెట్టి చూడసాగాడు.

ఆసాయంకాలం సుఖంగా ఆనందంగా గడిపారు. ఇంటికి తిరిగివెళ్లేటప్పుడు యజమాని ఏదో గొణిగాడు. పాల్ బుజం తాకుతూ, "నువ్వు బలే చిత్రమైనవాడివి భాయీ! ఆమెకూడా చిత్రమైందే. సరే, సరే. పడుచుది. యాదృచ్ఛికంగా మీ

రిద్దరూ ఒకరినొకరు లొంగతీసుకోవాలని యత్నించకపోతే అంతా సవ్యంగానే ఉంటుంది" అన్నాడు.

పాల్ కేమీ అర్థంకాలేదు. సదభిప్రాయంతోనే ఈ ముక్క అన్నాడని తలచి పాల్ యజమానికి కృతజ్ఞతాభివందనాలు తెలిపాడు. ఏమీ అవగాహనకానిపరిస్థితులలో పాల్ కృతజ్ఞత తెలుపుతూంటాడు

ఒకమాటు పాల్, నటాల్యా కూర్చుని టీ తాగుతున్నారు టీతాగడంలో ఇద్దరూ అందెవేసినచేతులే. వారివారి ఇష్టాయిష్టాలమీాద మాటాడుకోజొచ్చారు. పాల్ తనఇష్టాఅయిష్టాలు తెలియజేశాడు. తర్వాత నటాల్యా తనఇష్టాయిష్టాలు చెపుతూంటే వింటూ కూర్చున్నాడు.

ఆమె చాలా పెద్దజాబితా ఏకరువుపెట్టింది. రంకుల రాట్నం, నిమ్మరసంకలిపినసారా, సర్కసు, సంగీతం, పాటలు, పుస్తకాలు, ఆకురాలుకాలం (అప్పుడు విచారంవేస్తుంది), చిన్న పిల్లలు (దుర్మార్గంనేర్చుకోకముందు), మాంసంబోండాలు, వగైరా ఆమెకు ఇష్టం. చివరకు బోటుషికారు మరీ ఇష్టంఅని చెప్పింది.

"అన్నిటికంటె పడవమీాదషికారువెళ్ళడం నాకెక్కువయిష్టం" అని చెప్పింది. కళ్ళు తళతళామెరిసిపోయాయి. "పడవలో వెళుతూంటే అటుయిటూ వొరిగి పుయ్యాలవూపులా వుంటుంది. చంటిపిల్లలమయిపోతాం. యేదీ అర్థంకాదు, యే విషయం ఆలోచించం. ఒకటేషికారు, షికారు!...యెల్లకాలం బోటుషికారు, షికారు...సముద్రందాకా...జీవితమంతా... బలే బావుంటుంది. షికారువెళితేనా!"

ఆదివారం బోటుషికారు వెళ్ళాలని నిశ్చయించు కున్నారు. వాతావరణం నిర్మలంగా, వెచ్చగా బలేబాగుంది. చిన్న గట్టిపడవ తీసుకుని బయలుదేరారు. పాల్ తెడ్డ దగ్గర కూర్చున్నాడు. ప్రవాహానికిఎదురుగా పడవనడవసాగారు. ఒక వేపు ఒడ్డున వరసగా జేగురురంగుబంకమట్టిగుట్టలు, రెండో వేపున జాలరులాగా ఆకుపచ్చనిపొదలు, పొదలమధ్య అక్క డక్కడ ఆకాశంఎత్తుకొండ రావిచెట్లు, తెల్లటి బూరుగుచెట్లు, పిచ్చిగా పెరిగి కొమ్మలబరువుకువంగిన సిందూరపుచెట్లు. పడవ వెనక నురుగు అలలుఅలలుగా తరుముకువస్తోంది. దాటిపోలేక వెనకపడిపోయామనే అసంతృప్తి ధ్వనులుచేస్తోంది. నిర్మలా కాశం, ఒడ్డుకుదగ్గిరనా పెరిగిన పొదలు నీటిలో ప్రతిఫలిస్తు న్నాయి. వాటినీడలు నీటిఉపరితలంకింద వెల్లివిరుస్తున్నాయి. ఆత్మసంతృప్తితో పొదలు అటూఇటూ మెల్లగా వయ్యారంగా ఊగుతున్నాయి.

నీటిమీద వానకోయిలలు ధైర్యంగా, హడావిడిగా, ఉల్లాసంగా విహరిస్తున్నాయి. కాటుకపిల్లలు చిన్నకాకులలాగా నల్లటితోకలు అసహ్యంగాఆడించుకొంటూ ఒడ్డువెంటేదర్జాగా నడుస్తున్నాయి. నీరు ఒడ్డుకువచ్చి కొట్టుకుంటూంటే ఆకులు అలములు రెపరెవలాడుతున్నాయి. ఎక్కడో దూరాన్నుంచి రమణీయంగా సంగీతంప్రవహిస్తోంది. మృదువుగా నిండుగా ధ్వనులు నదిమీద వినిపిస్తున్నాయి.

ఎర్రటిచొక్కా తొడిగి, తలమీద టోపీపెట్టుకోకుండా పాల్ ఆరితేరినవాడిలాగా సమంగా గట్టిగా చేతికండరాలను మాత్రమే కదులుస్తూ తెడ్డువేస్తున్నాడు. మధ్యమధ్య జుట్టు

మొహంమీద పడుతూంటే, నాజూకుగా తల వెనకకుఆడించి జుట్టు వెనక్కు వేసుకునేవాడు. సంతోషంతో అతనికళ్ళు వెలిగి పోతున్నాయి. సువాసనలు విరజిమ్మేపొడిగాలిని గట్టిగాపీల్చు కుంటూ, "ఓహో! యెంత రమణీయంగావుంది!" అనేవాడు.

నటాల్యా అతనికి కొంచెందూరాన మోకాళ్ళమీద చేతులుపెట్టుకుని, అడ్డంగా కూర్చుంది. ఆమెపెదవులమీద దివ్యంగా మందహాసం నృత్యంచేస్తోంది నీటిలో తెడ్లువడే లయకు అనుగుణంగా ఆమె ఊగిపోతోంది. తెడ్ల నుంచి తళతళా మెరిసే చక్కటి నీటిబిందువులుమెల్ల మెల్లగా జారుతూ నదిని లాలిస్తున్నాయి. నటాల్యా చుట్టూ, మంచిబలంగా ఒడ్డూ పొడుగ్గాఉన్న పాల్ కేసీ చూసింది. విచారగ్రస్తమైననీలికళ్ళల్లో నుంచి మందహాసం జారి, తియ్యని నిండుపెదవులమీదకు జారినట్లుంది.

ఇద్దరిలోఒకరికీ మాటాడాలనిబుద్ధిపుట్టలేదు. మాట్లాడు కోకుండాఉంటేనే బాగుందనితోచింది. వారిద్దరూ ప్రేమగాథ లోని నాయికానాయకులులాగా ఉన్నారు. కాని ప్రేమ మాత్రం ఇపుడిపుడే అంకురిస్తోంది. ఒకరినొకరు ప్రేమించు కుంటున్నామనేపరిజ్ఞానం ఇంకా కలగలేదు. అయితే ఒకరి కొకరు జాగ్రతగా పరిశీలించుకోవడంలో ఆసక్తి ఎక్కువగా చూపుతున్నారు. ఈ పరిశీలన ఘటనలు చకచకా జరగడానికి దారితీస్తుంది. పాల్, నటాల్యాలు నాయికానాయకులను పోలి ఉన్నారేగాని, ఇంకా నాయికానాయకులు కాలేదు. కారణం భగవంతుడికే తెలియాలి.

"ఒడ్డుకుపట్టుదామా?" అని పాల్ అడిగాడు, అవతలి

ఒడ్డుమీదిపచ్చికప్రదేశంచేరువకు పడవ వెళ్ళగానే. చిన్న చిన్న వినోదయాత్రలకు వచ్చినవారికోసం ప్రకృతియే ఈ పచ్చిక ప్రదేశాన్ని సృష్టించినట్టుంది. చుట్టూ సగంమేరఉన్న గంగ రావిచెట్లనీడ దానిమీద పడుతోంది. మెత్తనిగడ్డిమీద రక రకాలపువ్వులు తాపినట్టున్నాయి.

ఆహారంపొట్లంఒకటి, పానీయంసీసాఒకటి రేకుటీపాయి తీసుకుని ఇద్దరూ పడవదిగారు అరగంటలో ఆ పచ్చికప్రదేశం మీద నెగడువెలిగింది. నెగడుమీద టీ కాగుతోంది. మధ్య మధ్య టీపాయిపక్కలనుంచి నీరు నెగడుమీదికికారుతూ జుంయ్ మంటోంది. పొగ పావురాయిరంగులో ఉంగరాలుఉంగ రాలుగా పైకిలేచి గాలిలోకలిసిపోతూ, సోమరిగా ఝుంకారం చేసే మిణుగురుపురుగులను మత్తెక్కించి కిందపడవేస్తోంది.

వినడానికే అలవాటుపడ్డట్టుగా అంతా నిశ్శబ్దంగాఉంది. పాల్ హడావిడిగా పొట్లంవిప్పుతూ తిరుగుతున్నాడు. నటాల్యా కలలుకంటున్నదానిలా గడ్డిపువ్వులు, పోచలు ఏరి ప్రశాంతంగా పాడుతూ గుత్తులుకడుతోంది. ఇదంతా శృంగారరసభరితంగా ఉంది. నిజం. నటాల్యా అందరుయువతులులాగానే పువ్వులుఏరి వాసనచూసింది. తక్కినయువతులతో నా కథానాయికను, సమానహోదాఇచ్చినందుకు వారు నన్ను మన్నించాలి. అసలు నా కా ఉద్దేశమేలేదు. మీరేం గొడవచేయనక్కర్లేదు. నా కథానాయికతో వారిని పోల్చేధైర్యం నా కెక్కడిది? నేను భావవాదిని కాదు. మంచిగాఉండాలని సంకల్పిస్తే, మంచి జీవితం వినియోగించే తీరుబడిఉంటే, ప్రతివారూ మంచిగా ఉండవచ్చునని నాకు నమ్మకం కుదిరింది.

టీ మరిగింది. తొందరతొందరగా కొద్దిగా భోజనంచేసి, టీతాగారు. మధ్యమధ్య ఆహారంముక్కలు మార్చుకుంటూ 'బలే రుచిగావుందే' అని ఒకరితొకరు చెప్పుకుంటూ భోజనంచేశారు. ఆ 'పానీయం' మూడుగ్లాసులుతాగేసరికి పాల్ కు తలతిరిగింది. మాటాడాలనిపించింది.

"సరిగా అర్థంచేసుకుంటే జీవితం మంచిగానే నడుస్తుంది" అంటూ ప్రారంభించాడు పాల్ ఆలోచనాపూర్వకంగా.

నటాల్యా అతని కేసిచూసి, కొంచెంఆగి, "యేంమంచి?" అని అడిగింది.

జవాబు చెప్పడానికి పాల్ ఆలోచించవలసివచ్చింది. అతను తటపటాయిస్తూంటే జవాబుకోసం ఆగకుండా ఆ అవకాశంతీసుకుని, "నాకూ తెలీదు. అర్థంచేసుకోకపోవడమే మంచిది. ప్రశ్నలువేసుకోవడం తగ్గించినకొద్దీ జీవితం సాఫీగా నడుస్తుంది. జీవితం యెలానడిపిస్తే అలా నడువు. యెవరినీ లెక్క చెయ్యకు."

ఆతర్వాత వారు వేదాంతంలోపడ్డారు. అదీ విసుగెత్తించింది. కొంతసేపు పిచ్చాపాటీ మాటాడుకున్నారు. పాల్ గ్లాసుమీదగ్లాసు ఎక్కించాడు. సాయంకాలమైంది. ప్రశాంతంగా, వెచ్చగా ఉంది. చీకటిపడింది. నటాల్యాకు ఏదో విచారంవేసి ఇంటికివెళ్ళిపోవాలనిపించింది వెళ్ళిపోయేవేళయిందని చెప్పి పాల్ ని అతికష్టంమీద ఒప్పించింది. బయలుదేరడానికి అంగీకరించినా, శరీరం స్వాధీనంలోలేదు. ముంచుకొస్తున్న మత్తును వదిలించుకోవాలని కొట్టుమిట్టాడడం స్పష్టంగా గోచరించింది.

చివరకు ఎలాగయితేనేం నటాల్యా అతనిని పడవదగ్గరకు చేర్చింది. పడవఎక్కగానే పడుకుని నిద్రపోయాడు పాల్. ఆమె తెడ్డుతీసుకుంది. పడవ ఒడ్డువారే మెలమెల్లగా ప్రవాహంతోపాటు సాగిపోయింది.

నటాల్యా పడవను నదిమధ్యకు తీసుకువెళ్ళింది. మసక మసక వెన్నెలలో పాల్ని మాటాడకుండా చూడసాగింది. ఏదో విషాదవిషయం ఆలోచిస్తున్నట్టుంది, చెంపలమీద కన్నీరుప్రవహించింది. ఒకఒడ్డుమీద పొదలు, ఇంకొకదానిమీద ఏటవాలు కొండగట్లు. ఆకాశంలోనక్షత్రాలు స్పష్టంగాప్రకాశిస్తున్నాయి. అంతటా నిశ్శబ్దం. ప్రాణికోటియావత్తూ గాఢనిద్రలో మునిగినట్టుంది. పడవకిందినీరుగూడా చప్పుడుచేయడంలేదు. నల్లగా నిర్మలంగా, వెన్నలాగా మృదువుగా చిక్కగాఉంది. దూరాన పట్టణంలోని దీపాలు మినుకుమినుకుమంటున్నాయి. అక్కడి నుంచే నిద్రిస్తున్నఅడవిమృగంమూలుగులాగా గోల బొంగురుగా ఆగిఆగి వినిపించింది. ఆతర్వాత గట్టిగా ఎడతెరిపిలేకుండా వినిపించింది.

పడవ ఒడ్డుకువచ్చి ఠకీమని కొట్టుకునేసరికి పాల్కి మెలకువవచ్చింది. నిద్రపోయినందుకు సిగ్గుపడి, "క్షమించు నటాల్యా! అలా..." అన్నాడు ఒడ్డునుంచి, చాలాదూరం వెళ్ళి నిర్జనంగా ఇరుకుగాఉన్నవీధివెంట నడుస్తూ. ఆమెకు ఆశ్చర్యంవేసింది.

"యెందుకు?"

అపుడు స్త్రీలముందు నిద్రపోవడం మర్యాదకాదని పాల్ ఆమెకు విశదంగా చెప్పాడు.

"అరె! యెక్కడ నేర్చుకున్నావు యీ చెత్త, యెక్కడ నేర్చుకున్నావు?"

"అదేం చెత్త కాదు. నువే యేదో పుస్తకంలో నించి చదివి వినిపించావు, గ్న్యాపకంలేదూ?" ఇలా అని అతను ఆ భాగం వినిపించాడు. "అద్దదీ!" సరిగా చెప్పినందుకు గర్వపడి "పుస్తకాల్లో చెత్త రాసివుండదు" అన్నాడు. దీనినిబట్టే అతనికి సాహిత్యంతో ఎంతపరిచయం ఉందో ఊహించుకోవచ్చు!

ఇంటికిచేరుకోగానే పాల్ మెట్లకింద నే ఆగి చేయిజాపి, 'శెలవు' అన్నాడు. ఆమె తటపటాయించింది. మళ్ళీ హఠాత్తుగా అతనిచేయిపట్టుకుని తన రెండుచేతులతోనూ గట్టిగా నొక్కి, "ప్రియా! నువు అమృతమూర్తివి!" అంది.

మేడమీదికి గబగబా వెళ్ళిపోయింది. ఆ హఠాత్తుకు దిగ్భ్రమ చెంది, అతను అలాగే నిలబడిపోయాడు.

తొందరలో మళ్ళీ బోటుషికారు వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు.

అది ఇలా జరిగింది.

మానవులకు విసుగుపుట్టేటట్టే విధికికూడా ఈ శృంగార నాటకంమీద విసుగుపుట్టి దానిని యధార్థంచేయాలని సంకల్పించింది.

అది ఇలా ప్రారంభమైంది.

ఒకనాటిసాయంకాలం మీసాలమొహం చక్కనిది ఒకటి పాల్ దుకాణంకేసి తేరిపారజూసి మర్యాదగా పాల్ని, "నటాల్యా అనే అమ్మాయి నివసిస్తున్నది యిక్కడేనా? నటాల్యా..." అని అడిగాడు.

పాల్‌ని అడగకుండానుంటే బాగుండిపోయేది. ఈప్రశ్న అడిగేసరికి పాల్‌కళ్లు చింతనిప్పులయ్యాయి.

"తెలీదు" అని పాల్ మందకొడిగానిరుత్సాహంగా జవాబిచ్చాడు.

"నీలికళ్ళు; అంత పొడుగుకాదు, చక్కనిచుక్క!"

"తెలీదు"అని పాల్ జవాబిచ్చాడు, చిరచిరలాడుతూ.

"యిక్కడవుంటోందన్నారు?" అన్నాడు ఆ వ్యక్తి ఆశాభంగంచెంది తడబడుతూ "క్షమించండి. శెలవు"

పాల్ జవాబియ్యలేదు. ఆవ్యక్తి వెళ్ళిపోయినా, అతని నెత్తిన బూటుఅచ్చుతో కొడదామనిపించింది.

"యిక్కడ నటాల్యా అనేఅమ్మాయి నివసిస్తోందా?" అని మర్యాదగా మెల్లగా ఆవరణలో వినిపించింది.

పాల్ బూటుఅచ్చు చేత్తోపుచ్చుకుని, దిగ్గున లేచి గుమ్మంలోకి పరుగెత్తాడు. కాని .గుమ్మంలోకివెళ్ళేసరికి నటాల్యాగొంతు ఖంగునవినిపించింది.

"యిలా, యిలా, యాకోవ్ వాసిలియిచ్!"

పాల్ వెనుదిరిగి వెళ్ళి కూర్చుని, ఆరె ఒకచోటుబదులు ఇంకోచోట గుచ్చి, బూటు నేలమీందపారవేసి, మళ్ళీ ఆవరణ లోకి బయలుదేరాడు. గుమ్మంలోనిలబడి పైకి కిటికీకేసి చూశాడు. ఎవరూ కనిపించలేదు. కాని తియ్యని ఆమెగొంతు, దీనంగా ఆ మగవానిగొంతు వినిపించాయి. తర్వాత మెట్ల మీంద అడుగులచప్పుడైంది. వారిద్దరూ బయటికి వచ్చేశారు. పాల్ గబగబా తలుపుమూశాడు. తలుపుబీటకుకన్ను ఆనించి చూడసాగాడు.

ఆ పురుషుడు పొడుగ్గా ఉన్నాడు. బూడిదరంగు డెర్బీ హాటు పెట్టుకున్నాడు. నటాల్యా అతను ఒకరిపక్కనఒకరు నడుస్తున్నారు. అతను మీసాలుమెలివేస్తూ ఆమెమొహంలోకి చూశాడు. ఆమె పాల్ దాగినగుమ్మంకేసి ఓరచూపుచూసింది. ఇద్దరూ వెళ్లిపోయారు.

పాల్ దుకాణంలోకి తిరిగివెళ్లి, కిటికీదగ్గర కూర్చు న్నాడు. వీధంతాకనిపించాలని తల వెనుకకువాల్చాడు. కాని ఎదురుమేడ, కప్పు, ఆకాశం మాత్రమే కనిపించాయి. మొదటి సారిగా భూమిఅడుగున ఆ లోతుగా, తడిగా, పొగచూరి ఉన్నగదికింద పూడ్చివేయబడినట్టనిపించింది. తలవంచుకుని ఆలోచనలోపడ్డాడు. యజమానివచ్చి పలకరించాడుగాని, జవాబులేదు. సానుభూతిస్వరంతో "యేమిటి సంగతి? జనాన్ని మింగేసేటట్టున్నావే?" అన్నాడు.

"ఓ!" అన్నాడు పాల్. అతనిచూపులో విషాదం, అన్వేషణ గోచరించాయి.

"యెవడో అనామకుడితో నటాల్యా బండిలో వెళ్ళి నట్టుంది?" అన్నాడు యజమాని.

"ఉహుఁ, ఆమె వెళ్ళలేదు."

"వెళ్ళలేదూ? అయితే నువువెళ్ళి ఆమెను యెందుకు చూసిరాకూడదు?" అని మిరాన్ అడిగాడు అనుమానంతోను కుతూహలంతోను.

"యిపుడే వెళుతున్నా."

నిజంగానే పాల్ మిద్దెమీదకు వెళ్ళాడు. కాని నటాల్యా గదికి తాళంవేసింది. పైమెట్టుమీదకూర్చుని కిందకు చూశాడు.

కిందమెట్లు నిశ్శబ్దంగా అసహ్యంగా చీకటిగుయ్యారంలా ఉన్నాయి.

కింద ఎవరో మాటాడుతున్నారు. మాటలధోరణి పాల్‌కి అర్థంకాలేదు. అతను ఒకేఒకసమస్యలో నిమగ్నుడై ఉన్నాడు. డెర్బీహాట్లుపెట్టుకున్న వీళ్ళతో నటాల్యా తిరగకుండా చేయడం ఎలా? కిందటితడవవచ్చినపురుషుడుకూడా డర్బీహాటు పెట్టుకున్నాడు గాని, అది నల్లనిది. మీసంబదులు ఎర్రటి పల్చనిగడ్డం. అతనూ ఈకలుతీసినకోడిపుంజులా ఉన్నాడు. పాల్ అనుకున్నాడు- యిటువంటివాళ్ళు పుట్టడం దేనికి? బతకడం దేనికి? వీళ్ళందరినీ ప్రవాసంపంపకూడదూ? కఠినవరకం వేయకూడదు? ఇలాంటిప్రశ్నలకు జవాబుదొరకక పాల్ కలవరపడ్డాడు. విచారం వదిలిపోయి చాలాకాలమైంది. మళ్ళీ యిప్పుడు ప్రత్యక్షమయిందేమో తీవ్రమైంది. మనసు గాయపడింది. భరించడం కష్టం!

ఇలా కుంగిపోయి ఒకటిరెండుగంటలు అరుణోదయం వరకు నిరీక్షించాడు. చివరికి గేటుదగ్గర బగ్గీఆగినచప్పుడు వినిపించింది. ఆవరణలో మనుషులఅడుగులచప్పుడయింది.

పాల్ నిలువెల్ల వణికిపోయాడు. వెళ్ళిపోవాలని లేచాడు. కాని వ్యవధిలేకపోయింది. నటాల్యా మెట్లెక్కివస్తోంది. ఆమెమొహం పాలిపోయి ముడతలుపడింది. కళ్ళు నిద్రమత్తుతో జోగుతున్నాయి. అతనినిచూసి మెట్లమధ్య ఆగింది; కలవరపడింది.

"ఓ, నువ్వా!" అంటూ ప్రారంభించి, అతనిమొహం కేసిచూచి, మాటలు ఆపివేసింది.

అతను నిరుత్సాహంగా, బిర్రబిగిసికూర్చున్నాడు. నిద్ర లేకపోవడంవల్ల కళ్ళు దించుకుపోయాయి. రాత్రంతా ఒకటే ఆలోచనేమో మనోనిబ్బరం పోయింది. అతనికళ్ళుచూసేసరికి ఆమెకు భయంవేసింది. అలాంటిచూపు ఆమె యెన్నడూ చూడలేదు.

ఆమెకు సిగ్గుకంటె భయం ఎక్కువైంది. అడుగు ముందుకుసాగలేదు. మెట్లకుఆనుకుంది. అతనూ ఆమెకేసి తీక్షణంగా తేరిపారజూస్తూ కదలలేదు. ఒకరూ మాటాడలేదు. ఇంటికవ్వాకిటికిలోనుంచి వెలుతురు తిన్నగావచ్చిపడి మరీ ఇరకాటంలో పెట్టింది. వెలుతురు అతనిమీదుగా వెళ్ళి ఆమెను తాకుతోంది. నిమిషనిమిషానికి ఆమెముఖకవళికలో మార్పు కనిపించింది.

పాల్ తన్నుతాను చూసుకోగలిగినట్టయితే బహుశా, ఆశ్చర్యపోయేవాడే. మోకాళ్ళమీద మోచేతులుఆనించి, గడ్డంకింద అరచేతులుపెట్టుకుని న్యాయాధిపతిలా చూస్తూ కూర్చున్నాడు. పరిస్థితి క్లిష్టంగాఉంది. ఒకొక్కనిమిషం గడిచిన కొద్దీ కుంగదీస్తోంది. ఒకరూ కదలలేదు. ఆమెమొహం ఇంకా పాలిపోయింది. అతనిచూపు తీక్షణంగా నిందాగర్భితంగాఉండే సరికి తట్టుకోలేక గడగడ వణికిపోయింది. అతనిస్ఫోటకంమచ్చల మొహం ఇంకా తీవ్రరూపందాల్చి ద్వేషంతో క్రౌర్యంతో మండిపోతున్నట్లు ఆమెకుతోచింది. ఒకపిల్లి వచ్చి ఈ క్లిష్ట పరిస్థితిని అంతమొందించకపోతే ఎలా పరిణమించేదో చెప్పలేం. కవ్వాకిటికీగుండా పిల్లి పాల్ మీదుగాదూకి, నటాల్యాపాదాల మధ్యగా మెట్లమీదనుంచి పరుగెత్తుకుపోయింది.

నేను దేవతలనుగాని, దెయ్యాలనుగాని ప్రార్థించను. నేను ఒక్క సత్యదేవతఆజ్ఞలకే బద్ధుణ్ణి. ప్రధానసంఘటనలకు వారితీయడంకోసమని నేను పిల్లినితీసుకువస్తాను. ఆ తీసుకు రావడం అప్రధానసంఘటన. పిల్లి వస్తుంది, పోతుంది. ఈ చిన్న చిన్న సంఘటనలను ఎవరూ గమనించరు. అతి క్లిష్టపరిస్థితి నుంచి పాల్, నటాల్యాలను తప్పించి పుణ్యంకట్టుకున్న ఆ పిల్లి పరిమాణం ఎంతో, రంగేమిటో నేను చెప్పలేను.

కెవ్వుమంటూ నటాల్యా పైకి పరుగెత్తుతూ పాల్ని నూసుకుపోయింది. పాల్ పక్కకు ఉరికాడు.

"వెధవపిల్లి ! అబ్బ ! యెంత భయంగపెట్టింది !" అన్నది నటాల్యా రొప్పుతూ, తలుపుతాళం గలగలలాడిస్తూ.

పాల్ కూడా వణికిపోయాడు. ఇద్దరూ మైకంలోనుంచి బయటపడ్డారు. గదితలుపుతీసి నటాల్యా అతనిని లోపలకు రమ్మని ఆహ్వానించింది.

అతను మాటాడకుండా లోపలకు వెళ్ళాడు. ఒక ప్రధాననిర్ణయానికివచ్చినవాడిలా కనిపిస్తున్నాడు. వెళ్ళి కిటికీ దగ్గర కుర్చీలోకూర్చున్నాడు. ఇక ఆమెభుజానికి పిన్నీసుతో గుచ్చుకున్న పూర్వకాలపుతరహాలేసుశాలువ ఊడదీసుకుం టోంది.

"యివాళ యింతపెందలాడే నిద్రలేచావేం?" ఎంత నేపైనా ఇలా మౌనంగాఉండడమే తటస్థిస్తుందనీ, మళ్ళీ క్లిష్ట పరిస్థితి రాబోతోందనీ భావించి అలాఅడిగింది.

అతను ఆమెవంక దీనంగాచూసి, లోపలనుంచి పొడు చుకుపైకివచ్చినట్టు భారంగా ఆగి ఆగి అన్నాడు.

"నే నసలు నిద్రపోలేదు. నిన్న ఆ దిష్టిపిడత నీపక్కన వుండడం చూసి, నేను అసంభవం! నువ్వు యీవిధమైనజీవితం విసర్జించాలి! అదేదో మంచిజీవితం అనుకున్నావా? ప్రతివాడు తనయిష్టం నీదగ్గర సాగించుకోగలడు. యిందుకేనా నువ్వు పుట్టింది? అదేం మర్యాదకాదు, మర్యాదకాదు! నీకుమట్టుకు సంతోషమా? సంభవమా? మొగాడువచ్చి నిన్నుతీసుకు పోయి, యిష్టంవచ్చినట్టు-ఊహుఁ-యిక వీల్లేదు. కట్టిపెట్టేయి నటాల్యా! కట్టిపెట్టేయ్!"

ఆఖరిమాటలు మెల్లగా, బ్రతిమాలుకుంటూ, వేడుకుంటూ హఠాత్తుగా అనేశాడు. అయితే పాల్ ఇలా కుండ పగలకొట్టినట్టు మాటాడుతాడని ఆమె అనుకోలేదు. మొహం ఎర్రబారింది. శాలువాగట్టిగాపట్టుకునిరాతిబొమ్మలా నిలబడింది. ఏమాత్రం ధ్వనిచేయకుండా పెదవులు తమాషాగా కదలాడాయి. ఆమె ఏదో చెప్పుదామనుకుంది. కాని మాట పెగలలేదో, ఇది సమయంకాదనుకుందో మరి మాటాడలేదు

అతను ఆమెవంక చూసి తలవంచుకున్నాడు. జవాబు కోసం నిరీక్షించాడు. జవాబులేదు. మళ్ళీ బతిమాలుకుంటున్న స్వరంతో, "నటాల్యా!" అన్నాడు.

ఆమె అతనికిదగ్గరగా జరిగి, బుజంమీదచేయివేసి దీనంగా, మెల్లగా, ధృఢనిశ్చయంతో,

"చూడు. అలాఅయితే నీతో అబద్ధమాడను. వున్నది వున్నట్టు అంతా నీకుచెప్పేస్తా, చెప్పేస్తా. నే చేసేదంతా నీకు సంతోషదాయకంగావుండదని నాకుతెలుసు. ఛీ, నాకు తెలుసు! కాని యేంచేయను? అది నా వృత్తి. నేను యింకెందు

కూ పనికిరాను! పని! యేపనీ నాకు చేతకాదు. నాకు పనిచేయడం యిష్టమూలేదు. పనిచేస్తూ మాడి చావడం యేమంతమంచిది! కాని సిగ్గూ, బిడియం అంటూ నాకు వుంది. నీముందు యిదంతా చెపుతూ కుళ్ళిపోతున్నాను. కుళ్ళిపోతాను! కాని—యేంచేయను? నా కింకేం చేతకాదు. యీవిధమైన జీవితం గడపాల్సిందే! గడుపుతాను. యేంచేస్తానో తెలుసా? యింకోయింట్లోకి వెళ్ళిపోతాను. యెక్కడికోకూడా నీతో చెప్పను. నన్ను మరచిపో. నేను నీకెందుకు? మంచిపిల్లను పెళ్ళాడి, ఆమెతో సుఖంగా జీవించు. కావాల్సినంతమంది మంచిమంచి పిల్లలు దొరుకుతారు!"

ఈ ఆఖరిమాటలు యథార్థాలను ప్రకటించడంకన్న ప్రశ్నార్థకంగా ఉన్నాయి.

పాల్ గట్టిగా తలవంకించి "నే నొకవిషయం మాటాడితే నువ్వు యింకోటి మాటాడుతున్నావు. ఇపుడు ప్రధానంగా ఆలోచించవలసింది నావిషయం కాదు, నీ విషయం. నాదేముంది? నేను బాగానేవున్నాను. కాని నువ్వు మాత్రం యీమాదిరిజీవితం కట్టిపెట్టాలి. ఛీ! వెధవబతుకు! చూడు, వాడెవడో వస్తాడు, తీసుకుపోతాడు—ఛీ! యిక వాళ్లో! పట్టిదుర్మార్గులు! అలా యెలా తయారయారో! ఈ విషయం ఆలోచించినకొద్దీ భయం వేస్తుంది! తుట్టపురుగులు!"

"యేంచేస్తాం, అంతే" అంది. గొంతులో బుజ్జగింపు ధ్వనించింది. అతనిబుజం నిమిరింది. అతనిమాటలలోని అమిత క్లేశం, విసుగుతో ద్వేషంతో వికారరూపందాల్చిన మొహం ఆమెను కంపింపజేశాయి.

"అలా యెందుకుజరగాలి? నువ్వు నాతో అబద్ధాలాడు తున్నావు. నేను చంటిపిల్లవాడినేంకాను. నాతో అబద్ధాలాడ వలసిన పనిలేదు. ఆవిషయం బాగా ఆలోచించాను. యీ మాదిరిజీవితం యిక కట్టిపెట్టు. ఊఁ– కట్టిపెట్టితీరాలి!"

"అరెబాబా! నేనేంచేయను?" అంది నెమ్మదిగా, సమాధానపర్చేస్వరంతో. భయపడుతూ భయపడుతూ అతని మీదికి ఇంకా ఒరిగింది.

కుర్చీలో వెనకకుఒరిగి, ఒకచేయి కిటికీగడపమీద పెట్టి, రెండోచేతితో చెమటపట్టి, ద్వేషంతోరగిలిపోతున్న మొహం తుడుచుకుంటూ అన్నాడు.

"కట్టిపెట్టేయాల్సిందే! కట్టిపెట్టేయాల్సిందే! కట్టి పెట్టేయ్, వాళ్ళందర్నీ యిక్కడికిరాకుండా తోలేసెయ్యి"

"కేకలువేయకు! నలుగురూ వింటారు. కేకలువేయడం ఆపు. నెమ్మదిగా మాటాడుకుందాం. కాస్త ఆలోచించు..."

"ఊహుఁ– ఆలోచించను. ఆలోచించేదేమిటో యిది వరకే ఆలోచించాను."

"ఊఁ–ఒక్కనిమిషం ఆగు!"

ధైర్యాన్నంతటినీ చిక్కబట్టుకుని, అతనిచేయిపట్టుకుంది. కూర్చోవడానికి ఆసనంఏదీ లేకపోయేసరికి మోకాళ్ళమీద అతనిముందు కూర్చుంది.

"నా కేపనీ చేతకాదు. నాదగ్గర ఆ గుర్తుకాగితం వుండబట్టి, యెవరూ నన్ను పనిలోకి తీసుకోరు..." అంది మాట మాట స్పష్టంగా ఉచ్చరిస్తూ.

ఓర్పువహించలేక పాల్ తలఆడించాడు. హఠాత్తుగా ఏదో ఆలోచనవచ్చిపడింది. బిగుసుకుపోయాడు. ఆమెమీదకు వంగి, కళ్ళల్లోకి సూటిగాచూస్తూ ప్రశాంతంగా, గట్టిగా, నన్ను పెళ్ళిచేసుకుంటావా? చేసుకుంటావా? నీకు నేను, నాకు నువ్వు—" అతని స్వరం భయంతో కంపించి, గుసగుసగా మారి దూసుకుపోయింది.

ఆమె వెనకకుఒరిగి కళ్ళు బాగా తెరిచింది. దిగ్గునలేచి, అతనిని కావలించుకుని కన్నీళ్ళుపెట్టుకుని మెల్లగా "ప్రియా! నన్ను పెళ్ళిచేసుకుంటావా? నన్ను పెళ్ళిచేసుకుంటావా? మనిద్దరికీ పెళ్ళా? బలేచిత్రమైనవాడివి!—పసిపిల్లాడివి!"

చేతులతో అతనిమెడనుచుట్టివేసి, పిచ్చిగా నవ్వుతూ ఏడుస్తూ అతనిని ముద్దిడుకోసాగింది.

ఇదేమిటో అతనికి కొత్తగాఉంది. కళ్ళకు పొరలుగమ్మినట్లుంది. రక్తనాళాల్లో రక్తం చర్రునప్రవహిస్తున్న సవ్వడి మాత్రం మొదట్లో వినిపించింది. తర్వాత లొంగిపోయి, ఆమెను గట్టిగా నొక్కిపట్టి, రొప్పుతూ, ఏదో చెప్పాలనియత్నిస్తూ మాటిమాటికీ ఆమెమొహాన్ని కామాతురతతో వేడివేడిగా ముద్దిడుకుంటున్నాడు...

సూర్యునితొలికిరణాలు కిటికీగుండా పడకగదిలోపడి గులాబిరంగు లేతవెలుగును ప్రసాదించాయి.

ముందుగా పాల్ నిద్రలేచాడు. గదిలో ఉక్కపోస్తోంది. వెలుతురుకు కళ్ళు జిగేల్ జిగేల్‌మన్నాయి. అంతాప్రశాంతంగా ఉంది. దూరాన్నుంచి మందకొడిగా అస్పష్టంగా చప్పుడు విన

వచ్చింది నటాల్యా మొహంమీదకు సూటిగా ఎండవచ్చిపడింది. కనురెప్పలు వాలిఉన్నాయి. కనుబొమలు రెండూకలిసిపోయి మొహంముడుచుకునిఉంది. పైపెదవి అసంతృప్తితో పైకి పొడుచుకువచ్చి, ఆమెలోనిచాపల్యాన్ని, కోపాన్ని ద్యోతకం చేస్తోంది. చెంపలు ఎర్రబారిఉండడంమూలాన ఆమె నిద్రిస్తున్నట్టునటిస్తోందని పాల్ ఊహించవలసివచ్చింది. జుట్టు నిద్రలో చిందరవందరై, సుతిమెత్తనిపాయలుపాయలుగా మెడచుట్టు పడింది. ఒకభుజం తెల్లగా బొద్దుగా అనాచ్ఛాదితంగా ఉంది. ఊపిరిపీలుస్తుంటే సన్ననిరోజారంగుముకుపుటాలు వణుకుతున్నాయి. ఎండలో ఆమెశరీరమంతా పారదర్శకంగాఉండి వెలిగిపోతోంది.

పాల్ ఆమెపక్కనే పడుకుని, జుట్టు మెల్లగానిమిరాడు. నిద్రమత్తుతోనే కళ్లుతెరిచి ఎంతో ఆప్యాయతతో అతనికేసి చిరునవ్వునవ్వి ఎండపడకుండా మొహంతిప్పివేసుకుంది. పాల్ లేచి దుస్తులువేసుకుని, అతిజాగ్రత్తగా ఏమాత్రం చప్పుడుచేయకుండా కుర్చీ మంచంపక్కనే వేసుకు కూర్చుని, ఆమెకేసి చూస్తూ ఉచ్ఛ్వాసనిశ్వాసాలు వినసాగాడు. పూర్వంకంటె ఇప్పుడు ఆమె ఎంతో సన్నిహితురాలుగా, ఆప్తురాలుగా, ప్రేమాస్పదురాలుగా అతనికి గోచరించింది. అతను మందహాసంవేసి, వినుగెత్తని నవప్రియులకుఉచితమైనవిధంగా తమ భవితవ్యంగురించి కలలుకనసాగాడు. పెళ్ళిచేసుకున్నతర్వాత తను తెరవబోయేదుకాణం ఊహించుకున్నాడు. అది మిరాన్ దుకాణంలాగా చీకటికోణంగా పొగచూరిఉండదు. బాగా వెలుతురువచ్చేదిగా, పరిశుభ్రమైనదిగా ఉంటుంది. ఆ గది

పక్కనే ఇంకోగది–పడకగది. అదీ చిన్నదే. గోడలకు నీలిరంగు కాగితం. మొదటిగదిగోడలకు పూలపూలపసుపుపచ్చ కాగితం. ఓ! ఎంత అందంగా ఉంటుందని! తోటవేపున కిటికీ ,సాయం కాలం పూలతోటలో టీతాగడం. వేసవిలో గాలి సువాసన లనుమోసుకువచ్చి వారిగదిలో మెల్లగా వీస్తుంది. ఆమె వంట చేస్తుంది. బూట్లుకట్టడం తాను ఆమెకు నేర్పుతాడు. పిల్లలు పుడతారు. ముద్దొస్తుంటారు. పాల్ పూర్తిగా సంతోషంలో మునిగిపోయి, గట్టిగా నిట్టూర్చి లేచాడు. మేజాబల్ల దగ్గరకు వెళ్ళి, టీపాయి తీసుకుని నడవలోకి వెళ్ళి రాజేయసాగాడు. మొహంఇంతచేసుకుని నవ్వాడు, ఎంత అదృష్టం! ఆమె నిద్ర లేస్తుంది. మేజామీద టీ కాగుతూంటుంది. టీపాయిపక్కన కూర్చుని, టీకాచి అందిస్తాడు. ఆమె అతనిని మెచ్చుకుంటుంది.

సెగ తగ్గింది. బొగ్గులువేశాడు. మెల్లగా అడుగులు వేసుకుంటూ గది సర్దుదామని వెళ్ళాడు. కాని అప్పటికే నటాల్యా నిద్రలేచింది. అతనిస్వప్నం భంగమైంది. ఆమె తల వెనక చేతులుపెట్టుకుని, నీరసంగా ఆవలిస్తూ పక్కమీదనే పడు కునిఉంది. మొహంలో ప్రత్యేకంగా ఏమీ గోచరించడంలేదు. పాల్ని ఎరుగు, బాగాఎరుగునన్న భావం ఒక్కటే గోచరిస్తోంది. అతనికి కష్టంవేసింది.

"టీ తయారుచేస్తున్నా!" అన్నాడు పస్తాయిస్తూ.

"సరే, యెంతపొద్దెక్కింది?"

"మధ్యాహ్నందాటింది."

ఇటువంటివిషయాలు మాటాడుకోవడం అతనికి భయ కారణమైంది. వారు పూర్తిగా వేరువిషయాలనుగురించి

మాటాడుకోవలసింది అని అతనికి అనిపించింది. కాని ఆ వేరు విషయాలేమిటో అతను చెప్పలేదు. మళ్ళీ మంచంపక్కనే కూర్చున్నాడు.

"సరే, యెలావుంది?" అని ఆమె అడిగింది చిరునవ్వు నవ్వుతూ.

"బలేబాగుంది. బలేబాగుంది, సటూషా!" అన్నాడు సంతోషంపట్టలేక.

"బలే!" అంది చిన్నగా నవ్వుతూ. ఆమెనుదురుపై ముద్దిడుకోవాలని పాల్ తలపోశాడు. ఆమెతల పైకెత్తి మీాదకు వంగాడు.

"ఓ! నీకు యిష్టమేనన్నమాట——!" అని మళ్ళీ చిన్నగా నవ్వింది.

ఆమెమాటలు, నవ్వు అతని ఉత్సాహానికి భంగం కలిగించాయి.

"ఏమిటి అన్నావు?" అని అడిగాడు కంగారుపడి.

"నేనా? అబ్బే! యేంలేదు. నన్ను పెళ్ళిచేసుకోవాలని యింకా అనుకుంటున్నావా?"

ఆమెగొంతులోని అనుమానం అవహేళన అతను పసికట్టాడు. దీనిఅర్థం ఏమిటి?

పక్కమీాద లేచికూర్చుని దుస్తులువేసుకోసాగింది. ఆమెమొహంలో విచారం, క్రౌర్యం గోచరించాయి.

"ఇంతలో యేంవచ్చిపడిందేం?" అని పాల్ భయపడుతూ భయపడుతూ అడిగాడు.

"ఎందుకు?" అని ఆమె అడిగింది అతనికేసి చూడకుండానే.

పాల్‌కి సరిగా తెలియదు. ఈ పరిస్థితిలో ఉండవలసిన రీతిగా ఆమె లేదని మాత్రం అనిపించింది. ఇలా ఉండటానికి కారణం లేకపోలేదు. నిద్రనుంచి మేలుకొనేసరికి ఆమెలో పెద్ద మార్పు వచ్చింది. వారిద్దరిమధ్య జరిగినదంతా జ్ఞాపకంవచ్చింది. ఉద్రేకానికిలోనై లొంగిపోయి ఒకప్రియమిత్రుణ్ణి కోల్పోయానని ఆమెకి తోచింది. అలా లొంగిపోవడంవల్ల వారిసంబంధం సుపరిచితమై విసుగెత్తించే మలినసంబంధంగా తయారైందని గ్రహించింది. ఇటువంటిసంబంధాలు ఆమెకు కావలసినన్ని. పాల్ మర్యాదవైఖరి, స్నేహధర్మం ఆమెను ఆకర్షించాయి. ఈ ఆకర్షణ కొద్దిగంటలక్రితంవరకు ఉంది. ఇక మాయమైపోతుందని ఆమెకు తోచింది. అటువంటి సంబంధాలు ఎలా అంతమవుతాయో ఆమెకు బాగా తెలుసు. అన్నీ ఇలానే ప్రారంభమవుతాయి. పాల్‌కి సౌఖ్యం, ఆనందం లభించిందని కూడా ఆమెకు తెలుసు. ఆమె ఒకస్నేహితుని కోల్పోయింది. ఆమెమీద ఆమెకే కోపంవచ్చింది. మనసు దుఃఖంతో నిండిపోయింది. పాల్ ఇంకా ఆనందసింహాసనంనుంచి కిందపడిపోలేదు. కాని అతనిచర్యలలో ఆమెభావాలే గోచరించాయి.

ఆమె దుస్తులువేసుకుంటూంటే కనిపెట్టిచూస్తూంటే ఆమెను కౌగలించుకుని లాలించాలనేకోరిక ఉవ్వెత్తునవచ్చింది. తటపటాయించవలసిన అవసరం కనిపించనందున అతను ఆమెను కౌగలించుకొన్నాడు. ఆమె ముభావంతో వికటంగా చిన్నగా నవ్వుతూ లొంగిపోయింది. ఆమెలో ఉత్సాహం లేదు గాని,

అతని కామాంధకారంమూలంగా ఈవిషయం గమనించలేదు.

పదినిమిషాలతర్వాత ఇద్దరూ టీతాగడానికి కూర్చున్నారు. ఆమె మొహంకడిగి, తలదువ్వుకుని మంచంమీద కూర్చుంది. అతను ఆమెకెదురుగా కుర్చీలో కూర్చున్నాడు. ప్రశాంతమైన ఉత్సాహం, అలసట అతనిని ముంచెత్తాయి. ఆమె విచారంగా ఉంది. ఆమె టీసాసరుమీదుగా అతనికేసి చూసి నిట్టూర్చింది.

హఠాత్తుగా ఆమెచెంపలమీదనుంచి కన్నీరుకారి, టీలో పడుతూండడం, ఆమె దానినే తాగుతూండడం పాల్ గమనించాడు. కన్నీరుపడిన టీ ఎవరూ సామాన్యంగా తాగరు. ఈమె లాగా ప్రశాంతంగా ముభావంగా కనిపించలేదు.

"యేమిటిసంగతి? యేమయింది? యిదంతా దేనికి?" అని పాల్ తొందరతొందరగా అడిగాడు, కుర్చీలోంచి దిగ్గున లేచి ఆమెదగ్గరకు ఉరుకుతూ.

ఆమె సాసరును మేజాకేసికొట్టింది. కన్నీరుకలిసిన టీ విరజిమ్ముకుపోయింది. వెక్కివెక్కి ఏడుస్తూ

"తెలివితక్కువదాన్ని! నన్ను నేనే దోచుకున్నాను. జీవితంలో ఒకేఒకసారిగా కోకిలదొరికితే దాన్ని హడలగొట్టి పారదోలాను. నీపని ఆఖరైంది నటాషా! యిక కుమిలికుమిలి చావడమే మిగిలింది. ఓ! ఓ! ఓ! తెలివితక్కువ మొద్దుని!" అంది.

కాని ఇదేమీ అర్థంకాలేదు అతనికి. లాలించాడు. లాలించినకొద్దీ ఆమెఅనుమానాలు ఎక్కువైనాయి. ఏడుపు మానలేదు. చివరకు,

"యికచాలు నటాషా! చాలించు. పెళ్ళిచేసుకుని హాయిగా జీవిద్దాం. స్వంతదుకాణం తెరుస్తాను. నువు యింటి వ్యవహారాలన్నీ చూసుకుంటూ, అందరిలాగానే కాపురం చేద్దువుగాని. బలే పసందుగా వుంటుంది!" అన్నాడు.

ఆమె అతనిచేతిని తోసివేసింది. అవహేళనగా, ఆశాలేశంతో అన్నది: "యెంతకాలం? ఒకవారంరోజులపాటు యిలాగే మాటాడతావు. మాకు మీమగవాళ్ళసంగతి బాగా తెలును! బాగా తెలుసు. ఆవిషయంగురించి కాదు, నే నా విషయంగురించి ఆలోచించడమేలేదు. భయపడకు. పెళ్ళి విషయం నేను పెద్దగాపట్టించుకోనులే. అసలు నిన్ను పెళ్ళిచేసుకోను. నిజంగా పెళ్ళాడతాననే అనుకున్నావా? నిన్నేకాదు, యెవరినీచేసుకోను. నువు చాలా మంచివాడివే. కాని మంచితనం అట్టేకాలం నిలవదు. నా గతజీవితాన్నిగురించిన యెత్తిపొడుపులు నేను వినలేను, వినలేను! నిన్నుపెళ్ళాడితే నా గతజీవితంప్రసక్తి తేవని నువ్వు అనుకోవచ్చు. కాని అందరిలాగానే యెప్పుడోఒకప్పుడు ఆ ప్రసక్తి తెస్తావు. నాకుతెలుసు. యీ ప్రపంచంలో నాబోటిదానికి స్థానంలేదు. సరే, ఆవిషయం అలావుంచు. నేను నిన్ను పెళ్ళాడదలచుకోలేదు. తెలివితక్కువదాన్ని, నీస్నేహం కోల్పోయాను. తప్పు నాదే. తెలివితక్కువదాన్ని!"

ఆమెను అర్థంచేసుకోవాలని పాల్ ఎంతో యత్నించాడు. కాని లాభంలేకపోయింది. ఆమెకన్నీరు అతనిలో విచారం, భయం రేకెత్తించింది.

"విను, నటాషా! నన్నుచంపుకుతినకు!" అన్నాడు

గంభీరంగా. "అలా మాటాడి నన్ను చంపుకుతినకు. అవేవీ నాకు అర్థంకావడంలేదు. అలాంటిమాటలు కావాలన్నా నాకు రావు. కాని అసలుచిక్కు యీమాటలు కావు. ఒక్కవిషయం చెప్పదలిచాను. నీకోసం నాగుండె చీల్చియివ్వడానికి నేను సిద్ధంగావున్నాను. చూడు, విశాలప్రపంచంలో నువ్వొక్క దానివే నాకు ప్రియమైనదానివి, నువ్వొక్కదానివే ప్రియమైన దానివి! నే నలా నే అనుకుంటున్నాను. నీకోసం యేదిచెయ్యమన్నా చేస్తా. 'పాల్, ఆసూర్యుణ్ణి ఆర్పేయి' అని ఆజ్ఞాపించు, నేను యింటిపైకప్పుమీదికి యెక్కి, సూర్యుడు ఆరిపోయే దాకానో వూపిరితిత్తులుపగిలిపోయేదాకానో వూదాను. 'పాల్ యీ జనాన్ని నరికేసేయి' అని ఆజ్ఞాపించు. వెళ్ళి వరసబెట్టి అందర్నీ నరికేస్తాను. 'పాల్! కిటికీలోనుంచి దూకు' అని ఆజ్ఞాపించు, దూకుతాను. యీనిమిషంలో దూకుతాను. దూకనా? దూకనా?"

ఇలా చెప్పి ఆమెపాదాలమీద పడ్డాడు.

పాల్ ఇంత ఉద్రేకంగా మాటాడేసరికి ఆమె లొంగిపోయింది. అతనిమొదటిమాటలను అపనమ్మకంతో, చిరునవ్వునవ్వుతూ వింది. సూర్యుని ఆర్పివేస్తాననేసరికి ఫక్కుననవ్వింది. ఆమెగౌరవార్థం జనాన్ని నరికివేస్తాననేసరికి కంపించిపోయింది. అతను మండిపడుతూ, వణికిపోతూ చూడడానికి భయంకరంగా ఉన్నాడు. పాదాలనుముద్దుపెట్టుకొనగోరేసరికి ఆమెకు ఎక్కడలేనిపిచ్చిగర్వం కలిగి, అభ్యంతరంపెట్టకుండా ముద్దిడుకోనిచ్చింది.

మనిషిని బానిసనుచేసుకోవడం ఎవరికైనా సంతోషం

గా నేఉంటుంది. ఆమె అతనిని బానిసనుచేసుకుంది. కాని ఇంకా మానవసైజగుణం-జాతీ-ఆమెలో లోపించలేదు. కాళ్ళ మీదపడ్డ పాల్ అంటే ఆమెకు జాలివేసింది. వంగి అతనిని పైకి లేవదీసి, ఎవరినీబుజ్జగించనంతగా బుజ్జగించింది. చివరకు ఇద్దరూ అలిసిపోయారు.

వారిద్దరికీ పూర్తిగా శాంతిచిక్కలేదు. శివారులోని పొలంవైపు షికారువెళ్ళాలని నిశ్చయించుకున్నారు. పాల్ దుకాణాన్నీ, యజమానినీ, ఒకటేమిటి సర్వమూ మరచి పోయి, నిర్జనంగా ఇరుకుగాఉన్నవీధులలో ఆమెతో కలిసి నడక సాగించాడు. పరిచయస్తులు కనిపిస్తారనేభయంతో కావాలని ఆమె ఆ దారిపట్టించింది. చాలాసేపు ఆ పొలంలో విహరిం చారు. మనసువిప్పి మాటాడుకున్నారు. విచిత్రంగా తెలివి తక్కువగా అవతలివాళ్ళకుకనిపిస్తామేమోనని నేభయం కలగలేదు. తమభావాలను, అభిప్రాయాలను అవతలివారిమీద రుద్దాలనే ఉద్దేశం ఇద్దరికీ లేదు. ఒకరిమీదఒకరు అధికారం చెలాయించా లనేకాంక్ష లేదు. సంస్కృతీపరులప్రేమలో ప్రవేశించి, దానిని ఇంకా పటుతరంచేసి చీకాకుపరిచేవైఖరి వారిలో కానరాలేదు.

న్యాయవేత్తలుచెప్పేటట్టు పైనపేర్కొనబడినపరిస్థితుల లోనిసంస్కృతి లోపించినందుకు మన కథానాయికీనాయకులను క్షమిద్దాం.

చివరకు వారు నదినిచేరుకుని కెరటాలుకడిగి శుభ్రం చేసిన ఇసుకమీద, విల్లోచెట్లకింద కూర్చున్నారు. కొంత సేపటికి ఇద్దరికి నిద్రవచ్చింది. ఒకరినొకరు గట్టిగాకౌగలించుకుని నిద్రపోయారు.

## 8

కొద్దిరోజులు గడచినతర్వాత "దుకాణంకిటికీపక్కగా వెళ్ళే ప్రతిమగవాడూ నటాల్యామేడమీదకే వెళుతున్నాడని పాల్ తలచాడు. ప్రతితడవా దిగ్గునలేచి ఆవరణలోకి పరు గెత్తేవాడు. యజమాని ఇదంతా కనిపెట్టి, చేతులు గడ్డంలోకి పోనిచ్చేవాడు. పాల్ నటాల్యావిషయమంతా యజమానికి ఇదివరకే చెప్పాడు. తమపెండ్లికి వచ్చి, ఆశీర్వదించవలసిందని కోరగానే మిరాన్ ఆశ్చర్యచకితుడైపోయాడు. ఎలాగో తట్టు కుని ఉపన్యాసం ప్రారంభించాడు.

"తెలివితక్కువమొద్దా! నా మాటలునాలుగూ విను. నేను రెండుసార్లు పెళ్ళిచేసుకున్నాను. నా మొదటిభార్యకు నాకూ దుకాణంలోనిఇతర్లకూ భేదం తెలియదు. యిక నా రెండవభార్యకి నామీద యెంతప్రేమో తెలుసా? యెలా బతికి బయటపడ్డానో నాకే తెలీదు. దానియిష్టంవచ్చినపుడు చేతికి యేదిఅందితేఅదిపుచ్చుకుని నన్ను చావగొట్టేది. దానికి కొట్టడ మంటే మహాసరదా. దానితలిదండ్రులు పోలీసులా అనిపిస్తుంది!"

తర్వాత కుటుంబజీవితాన్ని పూర్తిగా వర్ణించిచెప్పాడు. కుండలు, పెనాలు, తువాళ్లు, ఇనపకోలలు, బట్టలుఉతకడం, నేలకడ గడం, తదితరసదుపాయాలు. అతని వర్ణనప్రకారం, ఒట్టుపెట్టు కుని మరీ చెప్పాడు, కాబేజీపులుసులో కుంకుడుకాయ పులుసు కలిపేది. చేతులమీద నడవవలసివచ్చేది. తువాళ్ళు కపీమని వచ్చివడేవి. అతనిభార్య కుండలగట్టితనాన్ని అతనినెత్తిమీదకొట్టి పరీక్షించేది. చివరకు స్త్రీల ప్రసక్తితెచ్చి విచారకరమైన నిర్ణయానికి వచ్చాడు.

"నువ్వు చిత్రమైనవాడివి! కావాలంటే ఆడవాళ్లు సవాలక్షమంది వున్నారు. యింతెందుకు? దాన్నికట్టుకున్నావంటే సర్వనాశనమైపోతావు. నామాట నమ్ము. ఆమె నీకు కొంత వుపకారంచేసిందేఅనుకుందాం. సరే, బాగానేవుంది. యిప్పుడు నువ్వు పెద్దవాడివయ్యావు. చలాకీగా తయారయ్యావు. నవ్వడం నేర్చుకున్నావు. చక్కగా మాటాడగలవు. ఆమెరుణమేమో యిదివరకే తీర్చేసుకున్నావు. నువ్వుఆదరించినట్టు దాన్ని యెవరు ఆదరిస్తారు? యిక చాలు. పెళ్లిచేసుకోవాలనుకుంటే, ఊఁ, చేసుకో. మంచి అందంగా బొద్దుగావుండేదాన్ని చూస్తాను. అలాంటిదే నీకు తగిపోతుంది. కొంతకట్నం వస్తుందా, అది పెట్టి స్వంతంగా దుకాణంపెడుదువుగాని. అయితే దీన్ని మాత్రం చేసుకోకు నాయనా! ఒక్కనెలతిరిగేసరికి నీకు విసుగెత్తుతుంది. కాకపోయినా కాపరం యెలావెలిగిస్తావు? కప్పాలు లేవు, చెంచాలు లేవు. పైగా దానికి యేపనీ చేతగాదు, ఛీ! పనికిమాలింది!"

ఈ ఉపన్యాసానికి గోడలు ఎంతచలించాయో పాల్ కూడా అంతే చలించాడు. నటాల్యాకి అతనికి ఏర్పడ్డబంధనం మూలకంగా ఆమెను మనసులోనించి తరిమి వేయలేకపోవడమే గాక, అనుక్షణం ఆమె తనపక్కన ఉండకపోతే బతకలేనని భావించాడు. దుకాణంలో పూర్వంలాగా చురుకుగా పట్టుదలగా పనిచేయాలంటే ఆమె దుకాణంలో తనపక్కన కూర్చోవాలని కాంక్షించాడు.

ఒకమాటు పనిముగిసినతర్వాత ఆమెనుచూడడానికి వెళ్ళాడు. ఇంట్లోలేదు. తెల్లపోయాడు. వణికిపోయాడు. ఆమె

తిరిగివచ్చేవరకు గుమ్మంలో కూర్చున్నాడు. ఆమె తిరిగివచ్చే సరికి అర్ధరాత్రిదాటింది. కాని సారామైకంలో లేదు. తెలివిలో మామూలుగానే ఉంది. పరిచారికపని చూసిపెడతానని చెప్పిన ఒక స్నేహితురాలిని చూడడానికి వెళ్లానని చెప్పి, అతన్ని శాంత పరచింది. అతను ఆమెమాటలు నమ్మాడు. భయంతీరింది.

కాని ఆతర్వాత ఆలోచించడం మొదలుపెట్టాడు. డబ్బు ఎలా సంపాదిస్తోంది? ఈ ప్రశ్న వేసుకుని అతను గడగడా వణికిపోయాడు ఆ సాయంకాలమే ఆమెను డబ్బుసంగతి అడిగాడు. మళ్ళీ ప్రశ్నించనవసరం లేకుండానే ఆమె జవాబిచ్చింది.

"ఆఁ, నా కెంతకావాలేం?"

కాని అతనికి ఆ సమాధానం తృప్తికలిగించలేదు.

"నేను కోపెక్కు-కోపెక్కు-చొప్పున కూడబెట్టాను. అది మార్చుకు తింటున్నా!"

"ఏదీ ఆ డబ్బు చూపించు?" అని ఎవరో అడగమని ప్రోత్సహించినట్టయింది.

ఆమె తటపటాయించి చివరకు అంది "సరే, అలాగే! కావాలంటే చూపుతాను"

కాని పెట్టెతాళంచెవి కనిపించలేదు.

ప్రశ్నకు సమాధానంరాలేదు.

పాల్ తమభావిజీవితం ఎలా గడపదలచిందీ వర్ణించి చెప్పాడు. ఆమె మాటాడకుండా, కలలుకంటున్నట్టు కళ్ళు మూసుకు కూర్చుంది. భావనాప్రపంచంలో తేలయాడుతూ ఆమెను లాలించాడు. కాని ఆమెలో ఉత్సాహం కానరాలేదు. ఒకసారి ఈ నిరుత్సాహం స్పష్టంగా గోచరించేసరికి,

"యేం, నీ కిష్టంలేదా ?" అని అడగకుండా ఉండలేక పోయాడు.

జవాబు చెప్పడానికి ఆమె చాలాసేపుతీసుకుంది. దృష్టి చలించింది. తనమాటలనుతానే నమ్మడంలేదన్నట్లు ప్రశాంతంగా అంది :

"ఊహుఁ, అలా యెందుకనుకున్నావు. నా కెంతో యిష్టం !"

దాంతో అతను శాంతించాడు.

జీతం తెచ్చి భార్యకుఇచ్చినట్లు ఇవ్వసాగాడు. ఒకమాటు దుస్తులకు కావలసినబట్టలు వగైరా తీసుకువచ్చాడు. బహుమానం లాంఛనప్రాయంగా స్వీకరించి దయచూపింది. ఇలా తనబహుమానాన్ని లెక్కచేయకపోవడంవల్ల అతనిలో మొదటిసారిగా అనుమానం తీవ్రరూపం దాల్చింది. అటువంటిభావాలు అతని కెప్పుడూ అనుభవంలోకిరాలేదు. కాని వాటిని వెల్లడించకూడదనిమాత్రం అతనికి తెలుసు.

ఒకరోజున వారిద్దరూ కూర్చుని టీతాగుతూండగా మెట్లమీదనుంచి అడుగులచప్పుడు, హుషారుగా ఈలలు వినిపించాయి.

"నా వలపులకలికి నటూషాను చూడబోతున్నా, నా పలుకులచిలకగూడు ఇదే రన్నా !" అని సన్నగా, నెమ్మదిగా పాటవినిపించింది.

ఏదో గొడవజరుగుతుందని పాల్‌కి అంతరాత్మ చెప్పినట్లనిపించింది. కోపంతో మొహంముడుచుకున్నాడు.

"యిదిగో, నటాషాగూడు! ఓ! యెవరో అతిథులు వున్నట్టున్నారే!" అన్నాడు ఆ పాఠకుడు, అశాభంగంచెంది గుమ్మంలో తచ్చాడుతూ.

రంగేళీపురుషుడు చూడడానికి అసహ్యంగా ఉన్నాడు. మేకగడ్డం, పైకి మెలితిరిగినమీసాలు. పాల్‌వంక పరీక్షగా చూసి, ఏదో దోపనబోతూవచ్చినవాడిలాగా గదిలో ప్రవేశించాడు. వంకీకి హాటు యాదృచ్ఛికంగా తగిలించి నటాల్యా వేపుకు నడిచాడు. ఆమె ఆహ్వానపూర్వకంగా మందహాసం చేసింది. కాని ఆ మందహాసంలో కొంచెం ఖంగారు, అపరాధిత్వం మిళితమై ఉన్నాయి.

"హెల్లో! నటాషా, దేవసుందరీ!"

"యేంకావాలి?" అని పాల్ గుర్రుమన్నాడు. ఆ రంగేళీపురుషుడు అతనికేసి చూసి, మీసాలుమెలివేసి పాల్‌ని లెక్కచేయకుండా నటాల్యాచేయి ధైర్యంగా పుచ్చుకున్నాడు.

"క్రివటోస్నవ్‌కన్యా! కాస్త టీయిచ్చి, యీ పాడు మొహంగురించి చెపుదూ!"

"కొట్టు చూదాం!" అన్నాడు పాడుమొహం పెద్దమనిషి, కుర్చీలోనుంచిలేస్తూ.

"యేమిటి! నటాషా! దీనిఅర్థం యేమిటి?" అని అవమానితుడయిన ఆ రంగేళీపురుషుడు ఆమెను అడిగాడు.

"కొట్టు చూద్దాం!" అని తిరిగీ అన్నాడు పాల్ కోపంతో వణికిపోతూ.

"సరే, నేను వెళ్ళొస్తా" అంటూ అతను తొందర

తొందరగా అంగీకారం తెలిపి, కేకలు వేసుకుంటూ మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

"యిద్దరూ హాయిగా పెళ్ళిచేసుకోండి నటాషా! యీ సంగతి తెలియజేస్తాను–"

కాని ఎవరికి తెలియజేసేదీ ఎవరికీ తెలియదు. వారిద్దరూ చాలాసేపు మాటాడుకోకుండా మౌనంగా కూర్చున్నారు.

పాల్ విచారంగా అడిగాడు.

"వీళ్ళు రావడం యెప్పుడు మానేస్తారు?"

"అందర్నీ బయటికి తరిమేసినప్పుడు" అని చెప్పింది నటాల్యా తొణకకుండా.

"ఇంకా చాలామంది వున్నారా?"

"నాకే తెలీదు. యెన్నడూ లెక్కపెట్టలేదు. వాళ్ళంటే నీ కింత గిట్టదేం?" అని నవ్వింది వెక్కిరింతగా.

"నేను సహించి వూరుకోలేను, తెలిసిందా? వూరుకోలేను. ఇప్పుడు నువ్వు నాదానివి!"

"ఓ అలాగా! నన్ను యెక్కడ కొన్నావు? యెంతకు కొన్నావు?"

పాల్ చురుకుగా ఆమెకేసిచూసి "నవ్వుతున్నావా...? ఊఁ, నవ్వడానికి యిదేనా సమయం? నేను అబద్ధమాడడం లేదు. తెలుసా? పగలూ రాత్రీకూడా నువు నాదానివే. నేను నిన్నే యెప్పుడూ తలుచుకుంటూవుంటాను!"

"చాలు...యిక కట్టిపెట్టు. ఇక మాటాడకు!" ఆమె స్వరంలో ఎక్కడా ఉత్సాహం లేదు.

తనని చూడడానికి వచ్చేవారిపట్ల పాల్ అవలంబిస్తున్న

వై ఖరి నటాల్యాకు ఆందోళన కలిగించింది. వారితో తెగ తెంపులుచేసుకోవడం అవసరమని ఆమె భావించలేదు.వారిలో కొంతమంది మంచివారు, చలాకీపురుషులు. ఒకొ్కకప్పుడు పాల్ మోటుగా ప్రవర్తించేవాడు. ఎక్కడా కలుపుగోలుతనం లేదు. ఎప్పుడూ చుట్టూ తిరుగుతూండడం ఆమెకు చిక్కుగా నేఉంది. ఆమె అభిరుచులు వేరు. అతని అభిరుచులు విచిత్రంగా, పరిహాసాస్పదంగా ఉంటాయి. అయినప్పటికీ అతను మంచి వాడు, నిజాయితీపరుడు. ఆమెను మనసారా ప్రేమించాడు. అది ఆమెకు గర్వకారణం. తనతోసమానంగా అతను చూసు కోవడం పొగడదగిందే. ఏవిషయంపడితే ఆవిషయం అతను స్వేచ్ఛగా ఆమెతో మాట్లాడుతున్నాడు. ఆమెకూడా ఆవిధం గానే అతనితో మాటాడగలుగుతోంది. ఇది సామాన్య విషయం కాదు. పాల్ని ఇలానే పట్టిఉంచి, తాను యథా పూర్వకంగా జీవితం గడపగలిగేపరిస్థితి తీసుకురావడం సాధ్యమా అనిఆలోచించింది. ఆవిధమైనజీవితం సంతోషదాయంకాదుగాని, తరుచు ఉల్లాసంగాఉంటుంది. అందులోఉండే ఆనందం అందులో ఉంది. ఆజీవితంలోని మంచినంతా తనొక్కతే అట్టేఉంచుకుని, అందులోని చెడును పాల్తో పంచుకోవాలని తలచింది. కాలం గడచినకొద్దీ అటువంటిఏర్పాటుకు అంగీకరించేంతగా అతనిని మచ్చికచేసుకోవచ్చునని ఆశించింది. పెళ్ళికిసంబంధించి అతను కన్నకలలు వర్ణించిచెప్పుతూంటే వినడం ఆమె కెంతోప్రీతి. కళ్ళుమూసుకుని కుటుంబజీవితంలోని వివిధమధురదృశ్యాలను మనసులో చిత్రించుకుని చిరునవ్వునవ్వేది. ఒకొకప్పుడు అతని

వర్ణనలకు ముగిసిపోయేది. కాని వాస్తవికజీవితంలో అతని కల్పనాజగత్తు నశించిపోతుందని ఆమెకు తెలుసు. గాఢప్రేమ అతనిలో త్వరలోనే నశించిపోతుందని ఆమెకు దృఢవిశ్వాసం కలిగింది. అతనిప్రేమను ఆమెధోరణిలో ఆమె అర్థంచేసుకుంది. ఆధోరణి ఇచ్ఛాకాలమూరిధోరణిమాత్రం కాదు. ప్రేమనశించగానే కొట్టిపోస్తాడని చావగొడతాడని ఆమెకు గట్టిగా తెలుసు. అతనొక్కడితోనే జీవితమంతా గడపడం విసుగుగాఉంటుంది. పగలు, రాత్రి, ఎల్లకాలం ఒకేగదిలో ఒకేపురుషుడితో నివసించడం ఘోరం!

ఒక్కొకపుడు అతనితో చక్కగా చాలాకాలంపాటు కాపరంచేయగలనని భావించేది. కాని అది యుక్తంకాదని నిర్ణయించుకుంది. ఆమె అతనికితగింది కాదు. ఏదో జాలికొద్దీ అతనిని పెళ్లిచేసుకోవడానికి అంగీకరించకూడదు. అతను అంత మంచివాడు. ఎన్నిమాట్లు అడిగినాసరే, ఉహుం, ససేమిరా పెళ్లిచేసుకోగూడదు. అతను సుఖపడాలి. తనుమాత్రం పూర్వంలాగానే జీవితంగడపాలి.

ఇటువంటిఆలోచనలవల్ల అపరిచితమైన మధురభావాలు ఆమెలో రేకెత్తసాగాయి. ఈవిధంగా ఆలోచించినపుడు ఆమెలో మాలిన్యం నశించినట్టు, తెలివితేటలుపొందినట్టు కనిపించేది. స్త్రీసహజమైన వగలాడితనం అజ్ఞాతంగా ప్రేరేపించగా ఆమె కృత్రిమమనఃస్థితిని అలవర్చుకుంది. పాల్‌తో ఉన్నపుడు ఆమె ప్రశాంతంగాఉన్నట్టు, ఆలోచనలలో మునిగిపోయినట్టు, కుంగిపోయినట్టు నటించేది. అతనూ ఆమెను సానుభూతితో చూసేవాడు. ఈవిధంగా ఆమె వినోదించి పాల్‌తోసంబంధంవల్ల కలిగే

విసుగును పోగొట్టుకునేది. కాని తరుచు ఈ పాత్రను నిర్వ
హించలేక, అతనికంటికి కనిపించకుండా వెళ్ళిపోయేది లేదా
పోట్లాటపెట్టుకునేది. కాని పాల్ మాత్రం ఇంకా ఎక్కువగా
ఆమెను ప్రేమించసాగాడు. ఆమెతో మాట్లాడి తేల్చేసుకోవా
లనే కోరిక నానాటికి అతనిలో ప్రబలంకాసాగింది.

ఒకరోజుసాయంకాలం పట్టణంలో షికారుతిరుగుతూ
చిన్నతోటలోకి వెళ్ళారు. కొంచెం అలసిపోయి కసిందచెట్టుకింది
బల్లమీద కూర్చున్నారు. ఆ చెట్టు బాగా ఒత్తుగాఉండి కిందికి
వాలింది. చెట్టు పసుపువచ్చనిఆకులతో మెరిసిపోతోంది.

"సరేగాని, నటాషా! ఆవిషయం యేంతేల్చావు?" అని
పాల్ అడిగాడు ఆమెకేసి గంభీరంగా క్రీగంటచూస్తూ.

"యేవిషయం?"అని ఆమె అడిగింది విరిగిపడినమండతో
విసురుకుంటూ. ఆప్రశ్న ఎక్కడికి దారితీస్తుందో ఆమెకు
తెలుసు.

"మనం యెప్పుడు పెళ్ళిచేసుకుందాం?"

కసిందచెట్టుఆకుల్లోనుంచి సూర్యకిరణాలు దూసుకుని
వచ్చిపడుతున్నాయి. వారిద్దరిమీదా సన్నగా పొడుగ్గా నీడ
పడింది. కాటలో వారిపాదాలదగ్గర ఎదురుబల్లమీదపడి
తళుక్కుతళుక్కుమంటోంది. తోట ప్రశాంతంగాఉంది. పైన
నిర్మలాకాశంలో పారదర్శకమైనచిరుమబ్బులు మెల్లగా చెదిరి
పోతున్నాయి. నక్షత్రాలు మినుకుమినుకుమంటున్నాయి.

నడిచీనడిచీ అలసిపోవడంవల్ల చుట్టూఉన్నదృశ్యప్రభా
వంవల్ల నటాల్యా చింతాక్రాంతఅయింది. ఆలోచనలోపడ్డది.

ఈసమయంలో వివాహానికి ఆమె వ్యతిరేకత నిజమైనదిగాను, పూర్తిగా సమర్థనీయమైందిగాను తోచింది.

"పెళ్ళి!" అంటూ తలపంకించింది.

"నామాట విను. ఆగొడవ మరిచిపో. నన్ను పెళ్ళి చేసుకోవడ మేమిటి? నేను బజారుమనిషిని. మరి నువ్వో, నిజాయితీగా పనిచేసుకునేవాడివి. అందుచేతనే మనిద్దరికీ కుదరదు. నేను పతితనని యిదివరకే చెప్పాగా!"

ఇలా తన్ను తాను నీచపరుచుకోవడం ఆమెకు సంతోషం. ఆమె చదివిన పుస్తకాలలోని కథానాయికలాంటిదాననని ఆమెభావన.

"మరి నీకు" అంటూ విషాదస్వరంలో మళ్ళీ ప్రారంభించింది. "నీకు మంచి నిజాయితీపరురాలైన భార్య అవసరం. నేనో? పుట్టినప్పటినించీ పాపాలుచేస్తూ బతకమనే రాసిపెట్టాడు. నీజీవితమైనా సవ్యంగా నడవాలని నా కోరిక. భార్య, పిల్లలు, దుకాణం" గద్గదస్వరంతో కన్నీరు తుడుచుకుంటూ "నేను మెల్లగా మీయింటికివచ్చి నా ప్రియమైన పాల్ యెలా—"

వెక్కి వెక్కి ఏడ్చింది. నిజానికి ఆమె ఇప్పుడు చెప్పిందంతా బాధాకరమైనదే, విచారకరమైనదే. ఆమె చదివిన ఒక చిన్న పుస్తకంలోని ఒకదృశ్యం జ్ఞాపకంవచ్చింది. గాఢంగా ప్రేమించి, 'అతని' కోసం, అతని సుఖంకోసం తనప్రేమను బలిపెట్టి, అందరిచేతా ఈసడించుకుని, మెరీడెసీరి, కష్టజీవితం మూలంగా కృశించిపోయి, వాలికలుకట్టుకుని చార్లెస్ లెకాంటీ ఇంటి కిటికీముందు నిలబడి కిటికీఅద్దాలలోనుంచి అతనిని చూస్తుంది. అతను భార్య ఫ్లోరెన్సపాదాలవద్దకూర్చుని పుస్తకం

చదివి వినిపిస్తున్నాడు. ఆమె పొగలువస్తున్న నెగడు కేసి ఏదో ఆలోచిస్తూ తేరిపారజూస్తోంది. మోకాళ్ళమీద కూర్చున్న బిడ్డను ఒకచేతితో పట్టుకుంది. రెండోచేతితో చార్లెస్ తల నిమురుతోంది. పాపం! మేరీ ఎంతో దూరాన్నించి తన నిర్దోషిత్వాన్ని, ప్రేమను రుజువుపర్చుకోవడానికి వచ్చింది. కాని ఏం లాభం, మించిపోయింది. ఆ దృశ్యంచూచి కిటికీ దగ్గర అలానే కొయ్యబారిపోయింది— ఆకథ ఎలా అంతమైందో నటాల్యాకి తెలియదు. ఆ పుస్తకం ఆఖరిపుటలు చినిగిపోయాయి. హృదయవిదారకమైన ఈ కథ జ్ఞాపకంవచ్చి ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది.

సానుభూతితో, ప్రేమతో, నిస్సహాయతతో, దుఃఖంతో పాల్ వణికిపోయాడు. ఆమెను తనకుదగ్గరగా లాక్కున్నాడు. కన్నీటితో ఉక్కిరిబిక్కిరై,

"నటాషా! ప్రియురాలా! నటాషా! చాలు, యిక వూరుకో. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను వదిలిపెట్టను" అన్నాడు.

చివరకు ఆమె కొంచెం కుదుటపడింది. ఆమెమీదఉండే ప్రేమకొద్దీ ఆందోళనచెంది, ఆమెఆత్మౌన్నత్యానికి అదిరిపోయి గంభీరంగా, గట్టిగా అన్నాడు:

"యిలా విను. రాత్రీ పగలూ నిన్నుగురించే తలపోస్తూంటాను. నువు నాదానివి. నువుతప్ప యీప్రపంచంలో నాకింకెవరూ లేరు. యింకెవరూ నాకవసరంలేదు. నువు యేమన్నా అను, నువు నాదానివికావాల్సిందే. కాస్త అర్థంచేసుకో, అర్థంచేసుకో. నిన్ను యింకొకరివశంకానివ్వను. నువు నాదానవు

కాకపోతే నాకు జీవితమే శూన్యం! ఎల్లవేళలా నిన్నే తలుచు కునేవాడిని; నువ్వులేకుండా యెలా బతకగలను? నువ్వు నాదా నివి! కావాలంటే నాగుండెలర్పిస్తాను...అర్థమైందా? యిక ఆవిషయం మనం మాటాడుకోవద్దు."

ఆవిషయం ఆమె అతనితో చర్చించలేదు. తననుతాను అతనిముందర కించపర్చుకుని గొప్పపనిచేశానని భావించు కునేది. తననుతానునిందించుకునేటపుడు గొప్ప మధురభావం ఆమెను ముంచెత్తేది. ఏమాత్రం మర్మంలేకుండా అన్నీ ఒప్పు కుని ఉసూరుమనేది. చివరికి ఎంతవరదాకా వచ్చిందంటే, ఒక మాటు "యిప్పుడుమాత్రం నే నేం మడికట్టుకున్నాననుకు న్నావా? పిచ్చిపుల్లయ్యా! ప్రతిరాత్రీ—"

మాటముగించలేకపోయింది. పాల్ ఆమెభుజాలమీద చేతులువేసి ఊపుతూ బొంగురుగొంతుతో మెల్లగా,

"నోరుముయ్! నోరుముయ్! లేకపోతే చంపేసే స్తాను" అని పళ్ళు పటపట కొరికాడు.

అతనిచేతులబరువుకు నటాల్యా వెనకకు వాలిపోయింది. అతిగా చెప్పానని తెలుసుకుని భయపడిపోయింది, వణికి పోయింది. ఆమె వణికిపోవడంచూసేసరికి మనసుకరిగి అసూయ అణిగిపోయింది. కాని మనసులోనిగాయం మానలేదు. ఆమె పక్కనే అతను కూలబడిపోయాడు. చాలాసేపు ఎవరూ మాటాడలేదు. విసుగెత్తింది. నటాల్యా ఇంకా భయపడు తూనే, ముందుగా మౌనం వదిలిపెట్టి మెల్లగా అతనిచెవిలో "యింటికి వెళదాం పద" అంది.

ఒక్కమాటయినా మాటాడకుండా కొంతసేపు ఆమె పక్కపక్కనే నడిచాడు.

అలా మాటాడగలిగావంటే నన్ను ప్రేమించడం లేదన్న మాట!" అన్నాడు నిందాగర్భితంగా.

ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది. మొహంలో పశ్చాత్తాపం ప్రతిఫలిస్తోంది. పాల్ ఇంకా అన్నాడు.

"అదీ విషయం. సరే, కాని యికముందు నాతో అలాంటివిషయాలు చెప్పకు. యిక మాటలతో పనిలేదు. నా దగ్గర కొంచెం డబ్బు—నలభై రెండురూబుళ్ళు వున్నాయి. యజమాని నాకు పందొమ్మిదిరూబుళ్ళు యివ్వాలి. పెళ్ళి ఖర్చుకు, తరువాత కొంతకాలందాకా ఖర్చులకు అది సరిపోతుంది. పెళ్ళికితగినకొత్తదుస్తు లున్నాయా?"

"లేవు" అంది నెమ్మదిగా.

"సరే. అలాఅయితే కుట్టించుకుందువుగాని. రేపు కావలసినవి తెస్తా."

ఆమె మాటాడలేదు. ఇంటికిచేరుకోగానే మెట్ల దగ్గర దిగబెట్టి పాల్ ఆమెతో మెల్లగా, "యివాళ రాను"అన్నాడు.

"సరే సరే" అంటూ తలపంకించి ఆమె పైకిపరుగెత్తింది.

తాళంచప్పుడువిని పాల్ వీధిలోకి వెళ్ళాడు. ఆమె అలా అంతా ఒప్పుకోవడం అతనిమనసును గాయపర్చింది. ఆ వీధి వీధంతా అతన్ని కుంగదీసి, ఎన్నడో మరిచిపోయిన భావాలను, ఒంటరితనాన్ని, దుఃఖాన్ని తిరిగి రేకెత్తించినట్లుంది. పూర్వపు ఆలోచనలు, భావాలు ఇప్పుడు అతనిని మరింత కుంగదీశాయి.

అర్ధరహితమైనవిగా కనబడ్డాయి. పూర్వంలేని ఒక కొత్తగుణం వాటికి అలవడింది.

నటాల్యా గదితలుపు లోపల వేసుకుంది. దుస్తులు మార్చుకోకుండానే వెళ్లి కిటికీదగ్గర కూర్చుని నిట్టూర్చింది. చెంపమీద అరచేయిఆనించి కిటికీగుండా చూసింది.

మబ్బులు కమ్ముతున్నాయి. కటికచీకటిలోనుంచి అవి లేచి దిఙ్మండలాన్ని ముఖములు తెరతో కప్పివేశాయి. ఆకాశంలో తిరిగీ తిరిగీ అలసిపోయినట్టు మెల్లగా కదులుతున్నాయి. ఆకాశాన్నంతటినీ ఆవరించి ఒక్కొక్కనక్షత్రాన్ని మలిపివేస్తున్నాయి. అలంకారాలను తుడిచివేసి, భూమికి కనిపించకుండా వెలుగును మరుగుపరుస్తూ, ఆకాశపురమణీయతను నాశనం చేస్తామని దుఃఖిస్తున్నట్టు మబ్బులు వర్షబాష్పాలు రాల్చసాగాయి. భూమికి హెచ్చరికసంజ్ఞలు పంపుతున్నట్టు వర్షం ఇంటిరేకులమీద దబదబా పడుతోంది.

నటాల్యాకుకూడా కోపంవచ్చింది. కత్తెరబోనులో చిక్కుకున్నానని భయపడింది. "ఓ, యిలాంటివాడవా? నలుగురిలాంటివాడివే నువ్వూనూ! యివాళ నన్ను ప్రేమతో చూస్తావు, రేపు పళ్ళురాలగొడతావు! నా దగ్గర నీ కుప్పిగంతులా! ఊఁ, సరే. కాస్త ఆగిచూడు!"

"నోరుముయ్, నోరుముయ్! లేకపోతేనిన్ను చంపివేసేస్తాను" అంటూ పళ్ళుపటపటకొరికినప్పటి అతనివికారరూపం, మండిపడుతున్న మొహం ఆమెకు జ్ఞాపకంవచ్చాయి. ఎందుకు? ఏమాత్రం మర్మంలేకుండా నిజంచెప్పినందుకా? బలే ఖేమ్!

పైగా స్నేహితుడనని చెప్పుకోవడం ఇందుకేనా? నన్ను ప్రేమి స్తున్నాననికూడ భావించుకుంటున్నాడు.

చంపుతానని ఎవరైనా ఆమెను బెదిరించడం ఇదే మొదటిసారి. ఎవరైనా కొట్టేవాళ్ళంటే, కారణంలేకుండా, తప్పతాగి కొట్టేవాళ్లు. వాళ్ళసంగతి చూదాం. వాళ్ళకీ పాల్‌కీ పోలికేలేదు. పాల్‌తో జీవితం ప్రతినిత్యం ఉదయంనుంచి సాయంకాలంవరకు ఎలాఉండేదో వివరంగా ఆలోచించ సాగింది. ఉదయాన్నే నిద్రలేవాలి. ఇంకా కాసేపు నిద్రపోవా లనిఉన్నా టీకాచాలిగదా! పనీపాటా చేసుకోవాలి. స్టవ్ వెలిగించాలి. వంటచేయాలి. గది ఊడ్చాలి, మధ్యాహ్నం భోజనంవడ్డించాలి. కంచాలుకడగాలి. నేలఊడ్చాలి, తనకో అతనికో దుస్తులుకుట్టాలి. మళ్ళీ టీకాచాలి. ఇక సాయంకాలం-

తీరుబడి ఉంటే ఇద్దరే షికారువెళ్లితే-అతనితో షికారు వెళ్ళడం విసుగెత్తిస్తుంది. వారినిచూస్తానికి ఎవరూ రారు. అతను పట్టి మోటుమనిషి. ముక్కోపి. షికారునుంచి తిరిగి వచ్చి భోజనంచేయడం, పండుకోవడం-ఇదీ నిత్యకృత్యం.

ఇంతకీ అతనికి పనిదొరకకపోతే! గతజీవితాన్ని ఎత్తి బాధిస్తే? చావగొడితే?

పన్నెండేళ్ళబాలుడిదగ్గరనుంచి డెభ్భైఏళ్ళ ముదుసలి వరకు అందరినీ అనుమానిస్తాడు. అతనితో ఏవిషయం మాటాడు తుంది? అతను నాకంటె తెలివితక్కువదద్దమ్మ! చదవనుకూడా లేదు! నాకు పుస్తకాలు చదవాలని ఉంది. పుస్తకాలు ఇంక ఎక్కడినుంచి వస్తాయి?

ఆలోచించినకొద్దీ పాల్‌తో వైవాహికజీవితం విసుగు పుట్టిస్తుందనీ, విరసంగా ఉంటుందనీ ఆమెకు తోచింది.

ఆమె తననుతానే ప్రశ్నించుకుంది.

"నన్నెందుకు అతనికి అమ్ముకోవాలి?" అమ్ముకుంటే మాత్రం అతను ఏమీ ఇవ్వలేడని తెల్సుకుంది. తనను అతనికి బంధించిందేమిటో, అతనికి ఏవిధంగా తాను ఋణపడిఉన్నదీ తెలుసుకోవాలని యత్నించింది. తాను అతనికి కాదు. అతను తనకే ఋణపడిఉన్నాడు. ఈ సంగతి గ్రహించి సంతోషించింది. అతని ఒంటరిజీవితం జాలిగొలపడంమూలాన్నే అతనితో బంధనం ఏర్పడిందని తెలుసుకుంది.

ఇప్పుడు ఏంచేయాలి? ఆమె నిట్టూర్చి మనసులో బాధ తగ్గినట్టు తలపోసింది. జోరుగా అతని నిందిస్తూ

"ఓ! స్ఫోటకంముచ్చలదెయ్యమా! కాస్త ఆగి చూడు. నా తడాఖా చూపుతాను. నే నెలాంటిదాన్నో చూపిస్తాను. యిక పళ్ళుకొరుకుదువుగాని! నేను నీ బానిసననుకున్నావా? నువ్వు నేర్చుకోవాల్సింది చాలాఉంది!" అనుకుంది.

దిగ్గునలేచి తలమీద చేతిరుమాలు కప్పుకుంది. తలుపు తాళంవేయకుండానే గబగబా మెట్లుదిగింది. రేకులమీద, పక్కబాటలమీద, కిటికీఅద్దాలమీద వాన దరువువాయిస్తున్నా లెక్కచేయలేదు. గబగబా నడిచింది. తాను ఎలాంటిదో పాల్‌కు ఋజువుపర్చాలి. విపరీతమైన సాహసం, స్వాతంత్ర్యచైతన్యం ఆమెను ముంచెత్తాయి.

☆

# 9

ఆమె వెళ్ళిపోయి రెండురోజులైంది. మొదటిరోజు ఉదయం పాల్ ఆమెగదిలో అడుగుపెట్టగానే ఏదో కొత్త సంఘటన, ఏదో దురదృష్టకరమైనసంఘటన జరిగిందని ఊహించాడు. ఆ పగలల్లా ఆమెకోసం నిరీక్షించాడు. ఆ రాత్రి పట్టణమంతా గాలించాడు. సత్రాలు, సారాదుకాణాలు వెదికాడు. కాని ఆమె ఎక్కడా కనిపించలేదు. పళ్ళుపటపటకొరికాడు. మొహంముడుచుకున్నాడు. కంగారుపడ్డాడు. ఆమర్నాడు ఎవరితోనూ మాట్లాడలేదు. ఏదో భయంకరమైనది ఆకస్మికంగా జరుగబోతోందనే అంతఃప్రబోధం బాధారూపంలో అతనిని కుంగదీసింది. క్రమక్రమంగా నటాల్యామీద కోపం మిన్నుముట్టింది. మూడోనాటికల్లా సగంఅయిపోయాడు. మొహం పీక్కుపోయి, రోగిష్టివాడిలా తయారయాడు.

ఆరోజుసాయంకాలం రెండుబగ్గీలు దుకాణంకిటికీ ముందుగా వెళ్ళి, గేటులో ఆగాయి. పాల్‌కి ఆమెనవ్వు వినిపించింది. వెలవెలబోయి ఆవరణలోకి ఉరుక్కుంటూ వెళ్ళాడు.

యుద్ధకార్యాలయగుమాస్తాదుస్తులు ధరించిన ఒక పురుషునిచేయి ఆమె పట్టుకునిఉంది. అతనిమీసాలు, మొహం, చొక్కా—ఒకటేమిటి సర్వమూ వెలవెలబోతున్నాయి. అతను పాండురోగిలా ఉన్నాడు. ఆమె తప్పతాగిననిషాలో తూలుతూ పాడుతూ నవ్వుతోంది. వారివెనక ఇంకోజంట—బక్కపల్చనిది కాయరంగుయువతి, వంటవాడులాంటి నడివయసుపురుషుడు నడిచివస్తున్నారు.

చెక్కలసందులోనుంచి పాల్ చూశాడు. లోలోపల ఉడికిపోయాడు. కోపంతో ఉక్కిరిబిక్కిరిఅయిపోతాడనిపించింది. కాని వారు మెట్లుఎక్కి అదృశ్యమయేసరికి కోపం చల్లారి, విపరీతమైన నిరాశ అతనిని అలుముకుంది. ప్రాణ్పడిపోయి నేలమీద కుప్పకూలిపోయాడు. నీటిపీపాకేసి తల నొక్కుకున్నాడు. మిద్దెమీదనుంచి నవ్వులు, సంభాషణ వినిపించాయి. అతనితో ఎన్నడూలేనివిధంగా నటాల్యా వివిధభంగిమలలో-హుషారుగా, పకపకా బిగ్గరగా నవ్వుతూ-అతని కళ్ళకుకట్టింది.

"నాతో యిలావుండదేం" అనుకున్నాడు? వెంటనే నిజంగా తనప్రశ్నకు తనే ఇలా జవాబిచ్చుకున్నాడు. "నాతోనా? యెలావుండగలుగుతుంది నేను కురూపిని, మందమతిని, పీడాకారాన్ని!" ఈవిషయంగురించడంవల్ల అతని దుఃఖం తీవ్రరూపందాల్చింది. ఇక ఆమెనుకోల్పోయినట్టే! తప్పంతా అతనిదే. కోల్పోవడమే, కోల్పోవడమే! ఆమెను కోల్పోయి మళ్లీ యథాప్రకారం ఒంటరిగా, మౌనంగా, ఎవరికీ కాకుండా అనాథబాలుడిలాగా జీవించడమా! స్త్రీనిప్రేమించి కోల్పోయినవారిలాగానే పాల్కూడా నటాల్యాలోని మంచిని జ్ఞప్తికితెచ్చుకున్నాడు. ఆమెనుగురించి చెడ్డగా ఆలోచించలేకపోయాడు. చివరకు ఆమె ఎంతో పరిశుద్ధురాలని, దయార్ద్రహృదయ యని తలపోశాడు. ఆమెవినా జీవితంలేదనుకున్నాడు. బాధతో ఉక్కిరిబిక్కిరయాడు.

హఠాత్తుగా దిగ్గునలేచి ధైర్యంగా ఒక నిర్ణయానికి వచ్చినవాడిలాగా మందహాసంచేసి, ఆవరణలోకి పరుగెత్తాడు.

గబగబా మెట్లుఎక్కాడు. కిలకిలా గలగలా నినాదాలు వినిపించాయి.

గుమ్మంలోకి వెళ్ళాడు. నటాల్యా ఉద్రేకంతో, ధైర్యంతో, ఒకచేయి నడుంమీద పెట్టుకుని, రెండో చేతితో రుమాలు యెత్తిపట్టుకుని నాట్యంచేయడానికి సిద్ధంగాఉంది. నటాల్యా ఒక్కతే అతనికి స్పష్టంగా రమణీయంగా సజీవంగా కనిపించింది. తక్కిన ప్రపంచమంతా మసకమసకగా గోచరించింది.

"హెల్లో నటాషా!" అని పాల్ కేకపెట్టాడు గద్గదిక స్వరంతో.

"ఓ! నువా! ప్రియా!..." ఇలా ప్రశాంతస్వరం, భయంతో వణుకుతూ ఆ మసకలోనుంచి దూసుకునివచ్చి పాల్ చెవినిబడ్డది.

ఎక్కడా చడీచప్పుడూ లేదు. సర్వమూ ఆ పొగ మంచులో తేలియాడుతున్నట్లుంది. నటాల్యాఒక్కతెమాత్రం తేరిపారజూస్తూ కొయ్యబొమ్మలా నిలబడింది. పెద్దపెద్ద నీలి కళ్ళల్లో దయారసం, శాంతి ఒలుకుతున్నాయి.

"ఆఁ, నీదగ్గరికి-యెలాగైతేనేం-వచ్చాను. కాసేపు సర్దాగా గడుపుదామని వచ్చాను. యిక్కడ మహా వేడుకగా వుంది. నవ్వులు వినిపించాయి. వద్దామనుకున్నాను,వచ్చేశాను" అన్నాడు పాల్ సంభ్రమంతో.

లోపలనుంచి ఉద్రేకంపొంగింది. గుమ్మంలో నటాల్యా పాదాలమీద గుభాలున పడ్డాడు.

"నటాషా! నటాషా! నేను వచ్చాను...యిక్కడినించి వీళ్ళందర్నీ తరిమేసేయి. క్షమించు. నువులేకుంటే నేను బతక

లేను! బతకలేను!... యెలా బతకడం? ఒంటరిగానా? ఒంటరిగా బతకడం సాధ్యంకాదు...నిన్ను ప్రేమిస్తున్నా! నిన్ను ప్రేమిస్తున్నానని నీకుకూడా తెలుసు. నిన్ను ప్రేమిస్తున్నానని నీతో చెప్పనేచెప్పాను !...నువ్వు నాదానివి...వీళ్ళంతా యెందుకు? రాత్రింబగళ్ళు నీమీదే నాధ్యాస!...నాఆలోచనలన్నీ...నేను వుల్లాసంగావుంటూ, చలాకీగావుంటూ, నవ్వుతూ వేలుతా..."

ఆమెపాదాలను కావిలేసుకుని, మోకాళ్ళమీద తల ఆనించి దీనాతిదీనంగా వేడుకున్నాడు. అక్కడివారంతా రాతి బొమ్మల్లా అయిపోయారు.

నటాల్యాకి భయంవేసి గోడకుగట్టిగా ఆనుకుంది. మొహంలో నెత్తురుచుక్కలేదు. వికృతమైపోయింది. అతనితల గట్టిగాపట్టుకుని తోసివేయాలని యత్నించింది. కాని అతను ఆమెను గట్టిగా పట్టుకుని వదలలేదు. నీలిపెదవులు నిస్సహాయ స్థితిలో కదలాడాయి. కాని మాట పెగలలేదు...

మెల్లగా ముసిముసినవ్వులు వినిపించాయి. కారురంగు యువతి నవ్వుతోంది. గుమాస్తా ఆనవ్వుఅందుకుని తానూ నవ్వాడు. వంటవాడిలాకనిపించేపురుషుడూ నవ్వాడు. నటాల్యా గాబరాపడి వారివేపు తిరిగింది. పాల్ కేసి తేరిపారజూసి, తానూ విరగబడినవ్వింది. ఆ నలుగురినవ్వులతో మిద్దె కంపించిపోయింది.

పాల్ ఆశ్చర్యచకితుడయాడు. ఆ నవ్వులకు కుంగిపోయి నేలమీద కూర్చుని, మందకొడిగా పిచ్చిగా తేరిపారజూశాడు. నిజానికి అతనివాలకం హాస్యాస్పదంగానేఉంది. చెంపలమీది స్ఫోటకంమచ్చలకు కన్నీటిబిందువులు అంటుకునిపోయాయి. మొహం దీనంగాఉంది. నుదురుచుట్టూ నాడాతోబిగించినజుట్టు

ఊడి, చిందరవందరై వికారంగా, విదూషకునిటోపీలా ఉంది. మందకొడికళ్ళు, తెరిచిననోరు, పైకిలాగినచొక్కా, బూటుకు అంటుకున్న మురికి తడిగుడ్డపీలిక–ఇవన్నీ కలిసి అతనిని కరుణాపాత్రుడైన విషాదనాయకుడుగా పరిగణింపబడనీయడంలేదు.

ఆ నలుగురూ ఇంకా నవ్వసాగారు. పాల్ కంగారుపడి కదలకుండా మెదలకుండా నేలమీద కూర్చుండిపోయాడు. వారిలోఒకరు సారా ఒలకపోశారు. అది నేలమీద కాలువకట్టి పాల్ దగ్గరకు చేరింది. కారురంగుయువతి పిచ్చిఆవేశంలో ఆడవాళ్ళహాటు అతనితలమీదకు గిరాటువేసింది. అది వెళ్ళి అతని మోకాళ్ళమీద పడింది. అతను ఆ హాటుతీసుకుని ఆ కంగారులో పరీక్షగా దానిని చూడసాగాడు.

ఇలా పరీక్షగా హాటునుచూడడం వారికి మరింత నవ్వు పుట్టించింది. వారునవ్వారు. నవ్వీనవ్వీ మూలిగారు, రొప్పారు; పాల్ అవకతవకగా లేచి నిలబడ్డాడు. అలా నిలబడేసరికి అతని వాలకం మరింత హాస్యాస్పదంగా తయారైంది. తూలుతూ గుమ్మంలోకి వెళ్లాడు. ఆ తూలడంకూడా హాస్యాస్పదంగానే ఉంది. వెనుదిరిగి హాటును నేలమీదికి విసరివేశాడు. నటాల్యాని వేలితో బెదిరిస్తూ "సరే, గ్యాపకంపెట్టుకో!" అని వెళ్ళిపోయాడు. వెనకాల ఎడతెగనినవ్వులు సకిలింతలు వినిపించాయి.

"ఓ, బలేవీరుడు!" అని ఒకరుఅరిచారు. పిచ్చిగానవ్వేసరికి కళ్ళవెంట నీళ్ళుప్రవహించాయి. ఓహొహో! ఆహాహా! హాహాహా! వాణ్ణి దెయ్యంయెత్తుకుపోను! హాహాహా! తలచుట్టూ గుడ్డపేలికా వాడూ! హాహాహా! తోకవంచినట్టు నడుం!

ఓ! హాహాహా! జుట్టు, హాహాహా! తలమీాదదుబ్బులాగా! హాహాహ్హా! వాడితలపండు పగల! హాహాహ్హా!"

బయట ఎడతెరిపిలేకుండా వర్షం ధనధనా కురుస్తూ విసుగెత్తిస్తోంది. శిశిరఋతువు అప్పుడే ప్రారంభమైంది.

మూడురోజులపాటు రాత్రింబగళ్లు జోరున వానకురిసింది. నల్లబారిన చెట్లకొమ్మలనుంచి పసుపుపచ్చనిఆకులు రాలిపోయాయి. అలిసిపోయి వీధి ముఖావంవహించింది. గాలి దెబ్బకు చెట్లకొమ్మలు ఊగిపోతున్నాయి. చలిగాలి ద్వేషంతో దుఃఖంలో తాను ప్రేమించినదానిని వెతుకుతున్నట్లు నేలను తుడిచివేస్తోంది. ఎడతెరిపిలేని మొండివాన, హోరుమనేగాలి గతిస్తున్న వేసవికి చరమగీతం పాడుతున్నాయి; శీతాకాలానికి స్వాగతగీతం ఆలపిస్తున్నాయి. ఎన్నటికీ విడిపోరాదనే ఆకాంక్షతో బూడిదరంగుమబ్బులు దట్టంగా పట్టి తడిసిముద్దయిన భూమికి కనిపించకుండా ఆకాశాన్ని మరుగుపరుస్తున్నాయి. నాలుగోరోజున మంచుకురిసింది. భారీమంచుపెళ్ళలు గాలిలో పట్టణమంతా గిర్రునతిరిగాయి. గాలి పిచ్చిగావీచి గోడలకు, ఇంటికప్పులకు మంచును తెల్లటిమచ్చలుగా అంటించివేసింది.

ఆ సాయంకాలం పాల్ పనిపూర్తిచేసుకున్నవాడిలా అడుగులువేసుకుంటూ ఆవరణదాటాడు. బూట్లకు మన్ను కాకుండా జాగ్రత్తగా నడిచాడు. మెట్లుఎక్కి నటాల్యా గుమ్మంలో ఆలోచిస్తూ నిలబడ్డాడు. బాగా ముస్తాబైనాడు. మొహం ప్రశాంతంగా ఉంది గాని, పీక్కుపోయింది. కాస్తఆగి తలుపుతట్టాడు. ఒకపాదంమీాదనుంచి రెండోపాదానికి బరువు

మార్చుకుంటూ నిరీక్షించాడు. వినిపించీవినిపించకుండా ఈల వేశాడు.

"యెవరక్కడ ?"

"నేనే నటాల్యా!" అని పాల్ బిగ్గరగా ప్రశాంతంగా జవాబిచ్చాడు.

"ఆఁ—" తలుపు తెరుచుకుంది.

"హెల్లో! అని పాల్ టోపీతీసి ఆమెను అభినందించాడు.

"హెల్లో! ఓ, సరేగాని, వదిలిపోయిందా? ఓ, బలే తమాషాచేశావే? అప్పుడు నీవాలకం చూడాలి! అంటుగుడ్డలా వున్నావు! ఆరోజున సరిగా ముస్తాబుకాలేదేం?"

"యేవిఁటో తట్టలేదు. క్షమించు" అని పాల్ నవ్వాడు, చూపుమళ్ళించుకుంటూ.

"టీ తాగుతావా? కాస్తాను,"

"ఊహుఁ—వద్దు. యిప్పుడే తాగివచ్చా."

పాల్ మాటలు లాంఛనప్రాయంగా ఉండడం నటాల్యా గమనించింది.

"యేవిఁటి? అంత దూరంగా నిలబడ్డావేం?"

ఆమె నిర్లక్ష్యంగా నవ్వింది. అతను ఆమెదృష్టిలో ఇతరులకంటె ఏవిధంగానూ భిన్నమైనవాడు కాదు. కొత్తవారి ఎదుట ఎప్పుడైతే ఆమెపాదాలముందు వాలాడో అప్పుడే ఆమెదృష్టిలో అతనివిలువ పడిపోయింది. ఇదివరలో నమ్మకద్రోహం చేసినందుకు క్రూరంగా దెబ్బలుతిన్నది. పాల్ కూడా అలాగే కొడతాడనుకుంది. కాని అతనితరహా వేరు. ఆమె అభిప్రాయంలో పాల్ కు ఇతరులకుగలభేదం పాల్ కి అనుకూలం

కాదు. వాళ్ళు కొట్టేవాళ్ళు. అంటే ప్రేమిస్తున్నారన్న మాట!
నిజంగా ప్రేమించినపుడు కొట్టడమే కాదు, చంపాలని యత్ని
స్తారు. అంతం చూస్తారు. కాని పాల్! కొత్తవారిముందు ఆమె
పాదాలమీదపడి ఆడదానిలాగా ఏడ్చాడు. అది మగతనం
కాదు, మానవత్వం కాదు. ఆడదాన్ని వశంచేసుకోవడానికి
ప్రార్థించి లాభంలేదు, ఏడ్చి లాభంలేదు. పోరాడి తేనే వశ
మౌతుంది. తనదవుతుంది. కాని అవ్వాడైనా..."

పాల్ నిట్టూర్చాడు.

"మనిద్దరికీ సంబంధంలేదు. స్నేహం వుండేది. అదీ
అంతమైపోయింది. అంతమైపోయింది!"

నటాల్యాకి ఆశ్చర్యం వేసింది. కాని ప్రకటించలేదు.
"ఆఖరుసారి శెలవుపుచ్చుకోవడానికి వచ్చినట్టున్నాడు." అను
కుని అతనికి సమీపంగా పక్కమీద, ఇంకా ఏమిమాట్లాడు
తాడోనని నిరీక్షిస్తూ కూర్చుంది.

"చీకటిగాఉంది నటాల్యా! దీపం వెలిగించరాదూ?"

"అలాగే" అని ఆమె దీపం వెలిగించింది.

ఆలోచనాపూర్వకంగా ఆమెకేసిచూస్తూ మాటాడ
సాగాడు—

"ఆఖరుసారి నీతో మాటాడుతున్నాను నటాల్యా!
యిక మాటాడుకునే అదృష్టం మనకులేదు."

"అదేవిఁటి?" అని అడిగింది కళ్లు కిందకుదించుకుని.

ఈపరిస్థితిలో ఎలా మెలగాలో ఆమెకు తోచలేదు.
సరైనవైఖరి అవలంబించడానికి ఏదైనా సందుదొరుకుతుం
దేమోనని నిరీక్షించసాగింది. గత నాలుగురోజుల్లో అతను

ఎంతగా చిక్కిపోయాడో గమనించింది. అతని గుండెనిబ్బరా నికి ఆశ్చర్యపోయింది.

"ఇలా మాటాడుతున్నావేం?"

సమయంవచ్చింది. చాలాసార్లు బాగా ఆలోచించాను. ఇక యిది తుదముట్టాలి...ఎందుకు తుదముట్టకూడదు? నీనుంచి యింకా ఆశించేదేపుంది?" అంటూ ఆమెకేసి పరీక్షగా చూశాడు.

జరిగినదానికి ఆమె పస్తాయించింది. అతనంటే దయ గలిగింది. పైకి ప్రశాంతంగా కనిపించినా, అతను బాధపడు తున్నాడని పసిగట్టింది. ఏమైనా ఆమె ఆడది. దురదృష్టమాన వృణ్ణి చూస్తూచూస్తూ దయదలచకుండా ఎలా ఉండ గలుగుతుంది ?

"అంటే, నీఅభిప్రాయం?" అతనివేపు ఒరిగింది "అం తెందుకు, నేనెపుడూ సిద్ధమేగా..."

"ఊహుఁ, అదేంఅవసరంలేదు!" అంటూ ఆమెను పక్కకు విదిలించివేశాడు. యిదే ఆఖరిఘట్టం. ఆఖరై పోయింది! నువు చెప్పిందే సరి. అందువల్ల ఒగిగేదేమీ వుండదు. యిపుడు నాకు తెలిసివచ్చింది. మనిద్దరికీ మూలకారణం అదీ..."

అతను కొంచెం ఆగాడు.

"దేనికిదారితీస్తున్నాడో!" అని ఆమె ఆలోచించ సాగింది. ఊహకిఅందలేదు. ఏదో హెచ్చరిద్దామనేఉద్దేశంతో, ఏదో జ్ఞాపకంచేద్దామనేఉద్దేశంతో తడిమంచు కిటికీని మెల్లగా తట్టింది.

అవును, నువు చెప్పిందే సరైనదనుకుంటాను. అలా

జరిగితే యింకేమన్నా వుందా?" అని ప్రశాంతంగా మెల్లగా అతని చెవిలో చెప్పి, ఇంకా విచారపడింది.

"అవును. అదీ విషయం! కాని నిన్ను యిలా వదిలి పెట్టలేను. వదిలిపెట్టలేను! నువ్వు చాలాకాలంగా నాఆత్మలో నివసిస్తున్నావు. నువ్వు నా కెంతో కావలసినదానివి. మళ్ళీ చెప్తున్నా విను: మానవులందరిలోకీ నువ్వొక్కదానివే నాకు ప్రేమాస్పదురాలివి, సన్నిహితురాలివి. అతిప్రియమైనదానివి. నీమూలంగానే మొదటిసారిగా జీవితంఅంటేయేమిటో అర్థం చేసుకున్నాను. నువ్వు నాకెంతో కావలసినదానివి. అతిప్రియమైనదానివి. నిజంగా చెపుతున్నా-నాఆత్మలో నువ్వు నివసించావు!"

అతనిగొంతు వణికింది. ఆమెచెంపలమీాద కన్నీరు ప్రవహించింది. కన్నీరు అతనికి కానరాకుండా ఆమె పక్కకు తిరిగింది.

"నువ్వు నాఆత్మలో నివసించావు." అంటూ తిరిగీ మొదలుపెట్టాడు పాల్.

"నీఖర్మానికినిన్ను వదలి వెళ్ళిపోతానా? నిన్ను నాశనం చేయనిస్తానా? నిన్ను నీచంగాచూడనిస్తానా? యెన్నటికీ కాదు. నే నలా చేయలేను. మనసారా ప్రేమించినవ్యక్తిని, యీ ప్రపంచంలోకల్లా నాకు ప్రియమైనవ్యక్తిని ఇతరులన్నదూషించనిస్తానా? ఊహుఁ, దూషించనివ్వను, నటాల్యా! దూషించనివ్వను!"

ముందుకువంగి ఆమె కేసి చూడకుండాఉండాలని యత్నించాడు. అతనిగొంతులో దృఢనిశ్చయమేగాక వేడికోలు,

ప్రార్థన, తృమార్పణ గర్భితమైఉన్నాయి. ఎడమచేయి మోకాలిమీద ఉంది. కుడిచేయి కోటు జేబులో ఉంది. ఆమె "యేమిటి నీవుద్దేశం?" అని మెల్లగా అడిగింది. ఏడుపు అపుకోలేక ఇంకా పెడమొహంగానే ఉంది.

"యిదీ నావుద్దేశం!..."

పొడుగాటికత్తి జేబులోనుంచితీసిఅతను,ఆమెడొక్కలో గురితప్పకుండా గట్టిగా పొడిచాడు.

"ఓ!" అని ఆమె ఎగఊపిరివిడిచి, పక్కమీదనుంచి సూటిగా అతనిమీద పడింది. మొహం అతనిని పెనవేసుకుంది.

చేతులతో ఆమెనుపట్టుకుని పక్కమీద పడుకోబెట్టి, దుస్తులుసర్ది, ఆమెకేసి వంగి చూశాడు. ఆమెమొహంలో ఆశ్చర్యం గడ్డకట్టుకుపోయింది. కనుబొమలు పైకిలేచాయి. కళ్లు కాంతినికోల్పోయి బాగా విప్పారినాయి. నోరు సగంతెరుచుకునిఉంది. చెంపలు కన్నీళ్ళతో తడిసిపోయిఉన్నాయి.

పాల్‌నరాలబిగువు సడలింది. సన్నగా మూలిగాడు. జ్వరపడినవాడిలా వణుకుతూ, వెక్కివెక్కిఏడుస్తూ ఆమెను వేడివేడిముద్దులతో ముంచెత్తాడు. కాని ఆమెశరీరం అప్పటికే చల్లబడిపోయింది.

కిటికీఅద్దాలకు మంచువచ్చి కొట్టుకుంటోంది. గాలి పిచ్చిగా చలిగా గొట్టంగుండా హోరుమంటోంది. ఆవరణలో చీకటి. గదిలో చీకటి! నటాల్యామొహం తెల్లనిమచ్చగా కానవస్తోంది. పాల్ ఆమెమీదికి వంగి, స్తంభించిపోయాడు.

ఇరవైనాలుగుగంటలు అలానే ఒంటరిగాఉండిపోయారు. ఆమె పక్కమీద డొక్కలోకత్తితో పడుకునిఉంది! ఆమె

వక్షంమీద తలపెట్టి అతను బావురుమని ఏడ్చాడు. కిటికీ అవతల శరత్కాలపు చలిగాలి బిగ్గరగా మారుమోగింది.

ఆమర్నాటిసాయంకాలం ఈవిధంగాఉండగా నలుగురూ చూశారు.

*　　　*　　　*　　　*

వసంతకాలం వచ్చింది. మానవనిర్మిత ఉన్నతన్యాయ చట్టం పాల్ గిబ్లీ మీద విరుచుకుపడింది.

విచారణజరుగుతున్న హాలులోనికి కిటికీగుండా వసంత సూర్యకిరణాలు వచ్చిపడుతున్నాయి. పంచాయితీవాదులలో ఇద్దరి నున్ననిబట్టతలలమీద ఎండపడి మాడుస్తోంది. దాంతో వారికి నిద్రపోవాలనేకోరిక బలీయమైంది. తోటిపంచాయితీ దార్లు, న్యాయస్థానంవారు, ప్రేక్షకులు తమనిద్రమత్తును పసి కట్టకుండా ఆ ఇద్దరూ ముందుకు వంగారు. అలా వంగి, విచార ణలో అమితాసక్తితీసుకుంటున్నారనే భ్రమ కలిగించాలని యత్నించారు.

వారిలోఒకడు ప్రేక్షకులమొహాలు పరీక్షగాచూశాడు. ప్రేక్షకులమొహాలలో ఒకదానిలోనూ తెలివితేటలు గోచరిం చకపోయేసరికి విచారంగా తలఆడించాడు. రెండోపంచాయితీ దారు మీసాలువడివేసి, పెనసలుచెక్కుతున్న కార్యదర్శికేసి శ్రద్ధగా చూశాడు.

ఇంతలో న్యాయాధికారి "యిందుమూలంగా... ముద్దాయి పూర్తిగా స్మారకంలోవున్నదృష్ట్యా...సాక్షులను విచారించడం..." అన్నాడు. ప్రభుత్వ న్యాయవాదికేసి తిరిగి "యేమయినా చెప్పదలిచారా?" అని అడిగాడు.

ప్రభుత్వన్యాయవాది మంచివాడు. మీసాలు రెండు బొద్దెంకల్లా ఉన్నాయి. ముచ్చటగా నవ్వుతూ "లేదు, యువర్ ఆనర్!" అని జవాబిచ్చాడు.

ముద్దాయితరఫున్యాయవాదికేసి తిరిగి న్యాయాధికారి అలానే "మీరేమయినా చెప్తారా?" అని అడిగాడు.

ముద్దాయితరఫు న్యాయవాది నిర్మోహమాటంలో ప్రభుత్వన్యాయవాదికి ఏమాత్రం తీసిపోడు. అతనూ చెప్ప డాని కేమీలేదని అంగీకరించాడు. చెప్పడానికేమీలేదనేసంగతి అతనిమొహమే చెప్తున్నది.

"ముద్దాయీ! నువ్వేమయినా చెప్పుకుంటావా?"

ముద్దాయికికూడా చెప్పడానికేమీలేదు. ఏదో మన్ను తిన్నపాములా ఉన్నాడు. స్ఫోటకంమచ్చలమొహం అందరికీ రోతపుట్టించింది.

ప్రభుత్వన్యాయవాదీ, ముద్దాయితరఫు న్యాయవాదీ, ముద్దాయి - ఈముగ్గురూకలిసి విచారణవినాలనివచ్చినవారిని మోసగించారు! ముగ్గురూ ఏకకంఠంతో చెప్పడానికేమీలేదని తెలియజేశారు.

ప్రభుత్వన్యాయవాది ఆకలిగొన్న వేటకుక్కలాగా క్రౌర్యం నటించడంలో నేర్పరి. టక్కుటమారీవిద్యలలో ఘటి కుడు. ముద్దాయివిషయంలో ఏమాత్రం దయజూపినా కుత్తుక కోసేస్తానని పంచాయితీదార్లను బెదిరించాడు.

ఇక ముద్దాయితరఫున్యాయవాదికి మాట్లాడేటప్పుడు అసమ్మతిసూచకంగా ముక్కుచీదుకోవడం, దయపుట్టేటట్టు జుట్టు చిందరవందరచేసుకోవడం, దీనంగా వేడుకోవడం అలవాటు.

"పంచాయితీదారులారా!" ఈ ఒక్క మాటలో ఎంత కరుణారసం చొప్పించాలో ఎంత వాగ్ధాటి చొప్పించాలో— అంతా చొప్పించాడు. కాని తక్కిన ప్రసంగమంతా చప్పగా ఉండి పంచాయితీదార్ల మనసును కరిగించలేకపోయింది.

'పంచాయితీదారులారా!' అని సంబోధన పెరిగేసరికే బ్రహ్మప్రళయమైంది.

విచారణజరుగుతున్నంతసేపూ ముద్దాయిమనసులో ఒకేఒక కోరిక ప్రబలంకాజొచ్చింది. పన్నెండుసంవత్సరాలకఠిన నరకం విధిస్తూ న్యాయాధికారి తీర్పుచెప్పినతర్వాత అందరికీ వినిపించేటట్లు బిగ్గరగా ఆ కోరికను వెల్లడించాడు.

"క్షమించండి!" అంటూ న్యాయాధికారికి వంగి నమస్కరించాడు. కన్నీరుపెట్టుకుని వేడుకుంటూ, "గౌరవనీయులైన న్యాయాధిపా! ఆమెసమాధిని వెళ్ళి చూడడానికి అనుజ్ఞ దయచేయిస్తారా?" అని గొణిగాడు.

"యేమిటీ!" అని ఆ న్యాయాధికారి గట్టిగాగద్దించాడు.

"ఆమెసమాధికివెళ్ళి చూసిరావాలనివుంది. అంతే!" అన్నాడు ముద్దాయి భయపడుతూ భయపడుతూ.

"ఊహుఁ, వీల్లేదు!" అని న్యాయాధికారి గట్టిగాచెప్పి, నడవవెంట కులుక్కుంటూ వెళ్ళిపోయాడు.

న్యాయస్థానంనుంచి మామూలుగా నేరస్థులను తీసుకునివెళ్ళినట్టే ఈ నేరస్థునీ ఇద్దరుసిపాయిలు తీసుకువెళ్ళారు.

# ఉత్తమ నవలలు

| | | | |
|---|---|---|---|
| అనుబంధాలు | సుదర్శన | రు. | 5.00 |
| యుగసంధి | భాస్కరభట్ల | .... | 4.00 |
| తారుమారు | కొసరాజు | .... | 2.50 |
| మిగిలిం దేమిటి? | లత | .... | 1.75 |
| పాడులోకం | ముద్దంశెట్టి | .... | 1.50 |
| చీకటి వెలుగు | ,, | | 1.50 |
| గృహలక్ష్మి | చంద్రమతి | .... | 2.00 |
| వైకుంఠపాళి | పి. వి. కృష్ణమూర్తి | .... | 1.50 |
| చివరకు మిగిలేది | బుచ్చిబాబు | .... | 2.75 |
| సంసార సాగరం | తమిళ నవల | .... | 2.25 |
| కొడుకులు - కూతుళ్ళు | చీనా నవల | .... | 6.00 |
| అహం - అసూయ | జేన్ ఆస్టిన్ | .... | 2.25 |
| అనాథ బాలుడు | గోర్కీ | .... | 2.00 |
| భయస్థుడు | ,, | .... | 5.00 |
| అన్నా కెరెనినా | టాల్‌స్టాయ్ | .... | 6.00 |
| అనుమానం | ,, | .... | 3.00 |
| మానవహృదయాలు | మపాసా | .... | 3.00 |
| డోరియన్ గ్రే | ఆస్కార్ వైల్డ్ | .... | 3.50 |
| నానా | ఎమిలీజోలా | .... | 2.50 |
| థెరెసా | ,, | .... | 2.50 |
| యమకూపం | కుప్రిన్ | .... | 4.00 |
| ఇనపపాదాలు | జాక్ లండన్ | .... | 4.00 |

వివరాలకు:

## ఆదర్శ గ్రంథమండలి,

బకింగ్‌హాంపేట పోస్టు :: విజయవాడ.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.